***19. చంద్రుని గాంచి యేడ్చె గద సారసమిత్రుడు పశ్చిమాద్రిపై.***

ఉ. తంద్రత కుక్షి నింద దిని తల్లడమంద వినాయకుం డటన్
చంద్రుడు నవ్వె వాని గని, శాప మొసంగెను గౌరి కిన్కతో
"చంద్రుని జూడ నింద లగు సర్వుల" కంచు ప్రదోషవేళ, నా
చంద్రుని గాంచి యేడ్చె గద సారసమిత్రుడు పశ్చిమాద్రిపై.

(తంద్రత = కునికిపాటు)

**(చిటితోటి విజయకుమార్ గారి సంస్కృతానువాదము)**

పశ్యన్ పర్యహసత్ విధుర్గణపతిం తన్ద్రం చ కుక్షింభరిం
"యస్త్వాం పశ్యతి నిశ్చయం స మనుజః ప్రాప్నోతు నిన్దా" మితి।
గ్లావం క్రోధవతీ శశాప గిరిరాట్ పుత్రీ ప్రదోషే తతః
దృష్ట్వా శీతకరం రురోద చరమే శైలే సరోజప్రియః ॥

***20. కాలికి కాటుకన్ బులిమి గజ్జెలు కన్నుల గట్టె వింతగన్.***

ఉ. ఏలగ కృష్ణమూర్తి తన యింటికి వచ్చు నటంచు, గోపికా
బాల సుపారవశ్యమున బాడుచు, తొందరపాటు చేత దా
వేలికి గాజులన్ దొడిగి, వేడుక బొట్టును బెట్టి బుగ్గపై,
కాలికి కాటుకన్ బులిమి, గజ్జెలు కన్నుల గట్టె వింతగన్.

**(చిటితోటి విజయకుమార్ గారి సంస్కృతానువాదము)**

మాం ధన్యాం కురుతా దిదం మమ గృహం కృష్ణః పునీతం తథా
కిం కుర్యా మధునేతి గోపతరుణీ గానే స్థితా తన్మయాత్ ।
అంగుళ్యాం వలయే సుగంధతిలకం గండస్థలే సంభ్రమాత్
పాదే రంజక కజ్జలం చ విధదౌ నేత్రే సఖీ నూపురాన్ ॥

***21. కోతుల్ గారె కవీంద్రు లెల్ల రనుచుం గూసెం బికం బొయ్యనన్.***

శా. వ్రాతన్ దిద్దుము, బాగుగా విను, మికన్ భాషా పరిజ్ఞానమున్
ప్రీతిన్ పొందుము, 'పీ' ని వ్రాసితివిగా 'వీ' గా నిటన్ జూడు, నీ
వ్రాతన్ నేటి సమస్య మారి, జటిలం బైపోయెగా నిట్టులన్
"కోతుల్ గారె కవీంద్రులెల్ల రనుచుం గూసెం బికం బొయ్యనన్"

**(చిటితోటి విజయకుమార్ గారి సంస్కృతానువాదము)**

సంశుద్ధిం కురు లేఖనాని శృణుతాత్ సమ్యక్ లభస్వ స్వయం
భాషా జ్ఞాన ఫలం కృతోఽత్ర భవతా 'పీ' వర్ణ ఏష భ్రమాత్ ।
'వీ' వర్ణ స్తవ లేఖనేన జటిలా చేత్థం సమస్యాఽభవత్
సాహ్లాదం పరభృత్ చుకూజ కవయః సర్వే కపీంద్రా ఇతి ॥

***22. పండుగనాడు కూడ గన ప్రాత మగండె లభించె నయ్యయో!***

ఉ. పండుగ నేడు, పెట్టెదరు బాగుగ నందఱు కోడికూరనే
దండిగ నంచు, భిక్షుకుడు తాను దలంచెను భోగిపండుగన్,
దండిగ చద్ది పెట్టిరని తాపము నందుచు వాగె నిట్టులన్
"పండుగనాడు కూడ గన ప్రాత మగండె లభించె నయ్యయో!"

**(చిటితోటి విజయకుమార్ గారి సంస్కృతానువాదము)**

దివ్యే పర్వదినేఽద్య భోగిని మయా ప్రాప్యేత నృభ్యో మహా
రస్యం కుక్కుట మాంస భోజన మితి స్వాన్తే సుఖీ భిక్షుకః ।
ప్రాప్తే పర్యుషితే ప్రహీణ కవళే తాపేన జల్పత్యయం
"హా ధిక్ పర్వదినే మయా కువిధినా ప్రాప్తః పతిః ప్రాక్తనః" ॥

**23. గరుడుడు సర్పభీతుడయి గ్రక్కున జొచ్చెను పుట్టలోనికిన్.**

చం. "స్మరహరు నైన బట్టెదను, మానను నే ననుచున్న యా శనై
శ్చరునికి చిక్కబో ననుచు" శంభుడు దాగెను చెట్టు తొఱ్ఱలో
తిరుగుచు విశ్వ మంతయును; దీనిని నిట్టుల జెప్పగా నగున్,
గరుడుడు సర్పభీతుడయి గ్రక్కున జొచ్చెను పుట్టలోనికిన్.

**(చిటితోటి విజయకుమార్ గారి సంస్కృతానువాదము)**

**శనైశ్చర భయాత్ భర్గో వివేశ కోటరం తరోః ।**
**హా!హా! వివేశ వల్మీకం సర్పభీత్యా ఖగేశ్వరః ।।**

**24. రవి చెప్పెన్ కమనీయ విష్ణుకథలన్ రంజిల్లగా నెల్లరున్.**

మ. భవ రోగమ్మును బాప, భాగవతమున్ బల్కెన్ మహా యోగియై,
స్తవనీయమ్ముగ నా శుకుండు, కృపతో సంసార నిర్ముక్తుడై,
భువిలో సత్కవి, నైమిశాఖ్య సువనీ మున్యాస్య రాజీవ భా
రవి చెప్పెన్ కమనీయ విష్ణుకథలన్ రంజిల్లగా నెల్లరున్.

**(చిటితోటి విజయకుమార్ గారి సంస్కృతానువాదము)**

**భవ తారక భాగవతే శుక మునినా నైమిశాఖ్య గహనే వై**
**మున్యాస్యేందీవర భారవినా కథితాః ముకుంద కథాః ।।**

**25. కరణము నమ్మువారలకు గల్గు సుఖమ్ములు కచ్చితమ్ముగా.**

చం. సరిగను పెద్దగా జదువ జాలకయున్న, పఠించుమయ్య వ్యా
కరణము చక్కగా, స్వజన కాదుగదా శ్వజనమ్ము గా, శుభం
కరమును పూర్ణమౌ సకల కాదుగదా శకలమ్ముగా, సకృత్
తరచు శకృత్తు గాదు, ముఖ తత్త్వము వేదము నేర్వ, గాన వ్యా
కరణము నమ్మువారలకు గల్గు సుఖమ్ములు కచ్చితమ్ముగా.

***26. కాంతాసేవల జేయగావలె జగత్కల్యాణ సంధాయకుల్.***

శా. వంతల్ దీరగ, విశ్వ మందు గనుమా భక్తిన్ సదా దైవమున్,
అంతా విష్ణువె  మోక్ష మిచ్చు శ్రవణ మ్మంచున్ పరీక్షిత్తు తా
చింతన్ మానె, మహాత్ముడౌ శుకుడు నా శ్రీ విష్ణు కీర్తించె గా,
చింతించెన్ స్మరియించె భక్తియుతుడై శ్రీనాథు ప్రహ్లాదుడున్,
వింతన్ నిత్యము పాదసేవ నమరెన్ స్వేచ్ఛన్ మహాలక్ష్మి, శ్రీ
మంతుండౌ పృథు చక్రవర్తి నుతి శ్రీమద్విష్ణు నర్చించెగా,
యెంతో భక్తిని వందన మ్మిడెను శ్రీకృష్ణాప్తి నక్రూరుడున్,
చెంతన్ దాస్యము జేసె మారుతి, సదా స్నేహమ్ముతో నర్జునుం,
డంతా యిచ్చెను చక్రవర్తి బలి తా నాత్మార్పణమ్మంచు, నీ
పొంతన్ జేరగ నుండెగా నవ విధమ్ముల్ భక్తి మార్గమ్ములున్,
పంతమ్మున్ విడి వీరి వోలె, హరి! శోభన్ మోక్షలక్ష్మీమహా
కాంతాసేవల జేయగావలె, జగత్కల్యాణ సంధాయకుల్.

***27. తమ్ముని పెండ్లియాడె నొక తన్వి ముదమ్మున తానె పెద్దయై.***

ఉ. ఇమ్మహి నీదు మాట వినిపించకయున్న చెవుల్ వృథా గదా,
సమ్మతి నీ శరీర సుఖ సారము నందని యంద మేలనో?
నెమ్మది నీ స్వరూపమును నిండుగ చూడని కన్నులేల? ని
త్యమ్మును కృష్ణ! నీదు నధరామృత మానని జిహ్వ యేలనో?
కమ్మని నీదు మాలల సుగంధము నందని ఘ్రాణ మేల? క్షే
మమ్మున నీకు దాస్యమును మచ్చిక చేయని జన్మ మేల? రా
రమ్మని, ప్రేమలేఖ నట వ్రాయుచు, నా ''బలరామ మూర్తికిన్
తమ్ముని'', పెండ్లియాడె నొక తన్వి ముదమ్మున తానె పెద్దయై.

***28*. అవధానమ్మును జేయునట్టి కవి మూర్ఖాగ్రేసరుండౌ జుమీ!**

మత్తేభమాలిక

అవనిన్ గావలె, 'పాండితీ గరిమ' చేయంగా నిషిద్ధాక్షరిన్,
స్తవమొప్పంగ సమస్య దీర్చుటకు 'సద్యస్స్ఫూర్తి'యున్ గావలెన్,
కవితన్ గావలె 'నేర్పు' దత్తపదినే గావింపగా, నక్షరా
లు వరస్థానములందు నిల్పవలె 'నాలోచించి' న్యస్తాక్షరిన్,
'కవితాదృష్టి'యు వస్తు వర్ణనములన్ గావింపగా గావలెన్,
'జవ' మందన్ వలె నక్షరాల నుడువన్ జాలంగ వ్యస్తాక్షరిన్,
కవితన్ నిత్యము నాశువున్ బలుక 'గంగారీతి'యున్ గావలెన్,
నవలీలన్ 'తగురీతి బల్కదగు' తా నప్రస్తుతమ్మందు, ని
ట్లవకాశమ్ము నెరింగి చేయదగు 'నష్టాంశమ్ములన్' యుక్తితోన్
చివరన్ 'ధారణ' నప్పజెప్పవలె వాసిన్ నాటి పద్యాల, తా
నవధానమ్మున పృచ్ఛకాళి మదిలో హర్షమ్ము వర్ధిల్ల; స
త్కవితాధార, విశేషధారణ, చమత్కారాదులున్ లేనిచో
నవధానమ్మునుఁ జేయునట్టి కవి మూర్ఖాగ్రేసరుండౌ జుమీ!

***29*. రాఘవ నీ కుఠారమును ప్రార్థన చేసెద నిష్ట సిద్ధికిన్.**

ఉ. హే ఘన నీలదేహ! స్మరియించు మహేశుడు నీదు నామమున్,
రాఘవ! నీదు నామము విరాజిలు మంత్రము, పావనమ్ము ధీ
రా! ఘనపుణ్యదాయకము, రమ్యమునౌ స్మరియింతు దాని, ఘో
రాఘ వనీ కుఠారమును ప్రార్థన చేసెద నిష్ట సిద్ధికిన్.

(ఘోరమైన పాపములు అనెడి అడవికి గొడ్డలి)

**30. భార్యకు సేవఁ జేయ, భువి భర్త తరించును జన్మజన్మకున్.**

ఉ. కార్యము లందు దాసి, వర గౌరవ మంత్రియు యోచనన్, మహై
శ్వర్యద లక్ష్మి రూపమున, భవ్య ధరిత్రి క్షమా గుణమ్ములో
నార్యయు మాత భోజనము నందున, శయ్యల రంభ యైన యా
భార్యకు సేవఁ జేయ, భువి భర్త తరించును జన్మజన్మకున్.

**31. భీముడు యుద్ధరంగమున భీష్ముని జంపె పరాక్రమోద్ధతిన్.**

ఉ. ధీమహితుండు, ఫల్గుణుడు, ధీరుడు, పార్థుడు, శ్వేతవాహనుం,
డీ మహి కృష్ణుడున్, విజయు, డెన్న కిరీటియు, సవ్యసాచి, సు
శ్రీమహితుండు, నర్జునుడు, శ్రీవికృతుండు ధనంజయుండు, నా
భీముడు యుద్ధరంగమున, భీష్ముని జంపె పరాక్రమోద్ధతిన్.
(ఆ భీముడు = ఆ భయంకరమై అర్జునుడు)

**32. జీతము లేని కొల్వుల నిసీ యను వారలు గూడ నుందురే?**

ఉ. ప్రీతిని మ్రొక్క, నీకు కనిపించెడి దైవమె కన్నతల్లి యౌ,
వా తెఱవంగ పట్టు తన పాలనె, నీ మల మూత్ర సీమలన్
చేతులతోడ శుభ్రముగ జేయును భోజన మాపుకొన్నదై,
చేతము పొంగ సర్వ విధ సేవల జేయును బిడ్డకోస, మీ
జీతము లేని కొల్వుల నిసీ యను వారలు గూడ నుందురే ?

**33. లేదన లేదు లేదనగ లీలగ గల్గును భోగభాగ్యముల్.**

ఉ. లేదను లోభ మెన్నడును, లే దనృత మ్మను, వెన్ను జూపుటే
లేదను యుద్ధరంగమున, లేదను కౌగిలి యన్యభామకున్,
లేదని ద్రోహబుద్ధి తుల లేక వెలింగెడి కర్ణు పోలికన్
లేదన లేదు లేదనగ లీలగ గల్గును భోగభాగ్యముల్.

***34*. కదలనివాడు సేర్చె నిలు గానని వానిని విభ్రమంబుగన్.**

చం.“ఇది హిమవన్నగంబు, తెరు వింతయు గానను హవ్యవాహనా!
కదలగలేను, లేపనము గానను, కానను కన్నులున్న, నీ
యదనున బ్రోవు” మన్న ప్రవరాఖ్యు గృశానుడు గాలి లేనిచో
గదలనివాడు సేర్చె నిలు గానని వానిని విభ్రమంబుగన్.

***35*. హనుమంతుం దగ బెండ్లియాడిరట తా మయ్యార్గురౌ కాంతలే.**

మ. ఘనమౌ శాస్త్రము లాఱు, వ్యాకరణ తర్క జ్యోతిషమ్ముల్ ధరన్
గన మీమాంసయు ధర్మ వైద్యములు దీక్షన్ గోరె నా విద్యలన్
హనుమంతుండు, ప్రసన్నులైరి గద విద్యాలక్ష్ములున్, ప్రీతితో
హనుమంతుం దగ బెండ్లియాడిరట తా మయ్యార్గురౌ కాంతలే.

***36*. వాడిన పూవులే తగును భామలకున్ బ్రతుకమ్మ బేర్చగన్.**

ఉ. వాడిన జీవితాలు ఫలవంతములౌ నిల దైవపూజకై
వాడిన, పుష్ప తోయ ఫల పత్రములం దొకదాని బూజకై
వాడిన భక్తి యున్న నగు భాగ్యము; జీవిత సుప్రసూనమున్
వాడిన పూవులే తగును భామలకున్ బ్రతుకమ్మఁ బేర్చఁగన్.

***37*. మగనిన్ వాకిట నిల్పునట్టి మగువా మా జోతలం బొందుమా.**

మ. "మగువా! శూలిని", "వైద్యునిన్ వెదుక బొమ్మా", "నీలకంఠుండ నే",
"సుగతిన్ కేకను వేయుమా", "పశుపతిన్", "సొంపారు శృంగాల నే
ను గనన్", "స్థాణువు నే", "తరుల్ పలుకనౌనో?" "నే శివా నాథుడన్,
నగజాతా!". "యటవీస్థలిన్ దిరుగుమా నాతో పనే" మంచు నీ
మగనిన్ వాకిట నిల్పునట్టి మగువా! మా జోతలం బొందుమా.

***38*. సానిన్ గొల్చెద రేబవల్ గలుగగన్ సౌఖ్యంబు సత్సంపదల్.**

శా. నే నిన్నెంచెద, కోరెదన్ తిరుమలన్ నీ సేవ, శేషాద్రివా
సా! నిన్ జూచెద, దివ్యభూష! సువిలాసా! శ్రీశ! సద్భక్తదా
సా! నిన్ మ్రొక్కెద వేంకటేశ! జగదీశా! సద్యశా! శ్రీనివా
సా! నిన్ గొల్చెద రేఁబవల్ గలుగగన్ సౌఖ్యంబు సత్సంపదల్.

***39*. ఖర పాదార్చన మొక్కటే హితముఁ గల్గన్ జేయు ముమ్మాటికిన్.**

మ. సురలున్ దైత్యులు సంద్రమున్ జిలుకగా, శోభిల్లు శ్రీ కూర్మమై
హరి దా మందర మెత్తగా, ఘన విష మ్మావిర్భవింపంగ, నా
గరళమ్మున్ హరు డాహరించె హితుడై, కైమోడ్చు డా చంద్రశే
ఖర పాదార్చన మొక్కటే హితముఁ గల్గన్ జేయు ముమ్మాటికిన్.

***40*. చెడు గుణమున్నచో యశము చేకుఱు ధారుణి నెల్లభంగులన్.**

చం. చెడు గుణమున్న దుర్జనుల జేరకుమా, ఘన సాధులన్ భజిం
చెడు గుణశాలివై మనుమ, చేయుమ పుణ్యము, ధర్మమున్ గణిం
చెడు గుణమున్న భద్రమగు శీఘ్రమె, నిత్య మనిత్యమున్ స్మరిం
చెడు గుణమున్నచో యశము చేకుఱు ధారుణి నెల్లభంగులన్.

***41*. పుణ్యక్షేత్రము లెన్నొ యున్నవట యా పూబోడి నెమ్మేనుపై.**

శా. పుణ్యక్షేత్ర మయమ్ము భారతము సంపూర్ణమ్ముగా గన్పడం
బుణ్యాత్ముండుగ చీర నేసె నొక డామోదమ్మునన్, దాని నై
పుణ్యం బొప్ప ధరించె చూడు మదె యా పూబోడి మిస్సిండియా,
పుణ్యక్షేత్రము లెన్నొ యున్నవట యా పూబోడి నెమ్మేనుపై.

**42. కారము బాయసమ్మునను గల్పినచో రుచి మిక్కుటంబగున్.**

ఉ. కారము గల్పెనన్న, పలు కారములే మది దోచుచున్ జమ
త్కారముతోడ వ్రాయ సహకారము నీయగ వచ్చి నిల్చె, శ్రీ
కారము తొల్త నుండు, సహకారము మోదము గూర్చు, మోహనా
కారము నేత్రపర్వ, ముపకారము పుణ్య మొసంగుచుండు, స
త్కారమె సంబరమ్ము, గుణకారము లెక్కల నుండెడిన్, నమ
స్కారము కీర్తి నిచ్చు, మమకారము స్నేహము బెంచుచుండు, సం
స్కారము గౌరవమ్మిడు, వికారము గాంచ నసహ్యమౌ, నహం
కారము త్యాజ్య, మెన్న నధికారము కన్నుల గప్పెడిన్, బలా
త్కారము పాపమౌ, మిరపకాయల కారము మందు, గావునన్
పూరణ నిట్లు గూర్తు, 'మమ' పూర్వపదమ్ముగ నున్న యట్టిదౌ
కారము బాయసమ్మునను గల్పినచో రుచి మిక్కుటంబగున్.

**43. చాలును కంది శంకరయ చాలును నీ గుణ దోష చర్చలున్.**

ఉ. వేల కొలందిగా తమరు వింత సమస్యల నిచ్చినారుగా,
వేల కొలంది శిష్యులుగ ప్రీతిగ పద్యము నేర్చి, రింక నీ
వేల శ్రమింప, దీని పదివేలని యెంతుము విశ్రమింపుమా!
చాలును కంది శంకరయ! చాలును నీ గుణ దోష చర్చలున్.

**44. రణ మాధారము మంగళమ్ము లిడగా రమ్యావధానమ్మునన్.**

ఉ. రణమే గల్గు వధాన పృచ్ఛకులకున్ ప్రజ్ఞన్, కవిత్వాది ధో
రణియున్ ధారణ ధార ధైర్య ధిషణల్ రాణింపగా, మేటి పూ
రణముల్ పంచ ధకార యుక్తములునౌ, రాజిల్లు పద్యాల తో
రణ మాధారము మంగళమ్ము లిడగా, రమ్యావధానమ్మునన్.

**45. కొట్టెడు భర్తనే సతము గోమలు లిష్టపడంగ నేర్తురే.**

ఉ. తిట్టకు తప్పు చేసినను, తీయగ బల్కుము, కోరకుండనే
పెట్టుము బట్టలన్ నగల, ప్రేమను పంచుము, నీదు భార్య తా
పుట్టిన యింటి కేగు తలపున్ విడనాడును నమ్ము, మిట్లు జో
కొట్టెడు భర్తనే సతము గోమలు లిష్టపడంగ నేర్తురే.

**46. ఒక్కడు నొక్కడే మఱియు నొక్కడు నొక్కడె యొక్క డొక్కడే.**

ఉ. ఒక్కడు, విశ్వకర్మసుతు, దుత్తమ శిల్ప కళా విశారదుం,
డక్కపివర్యుడౌ నలుడె యబ్ధికి వారధి గట్ట బూనగా,
తక్కిన వానరేశ్వరులు తామును సాయము చేసినారుగా,
ఒక్కడు నొక్కడే మఱియు నొక్కడు నొక్కడె యొక్క డొక్కడే.

**47. పోరాటమ్మును జేయ నాయుధములన్ బూనంగ నేలా యనిన్?**

శా. పారావారము గుంభసంభవుడు శోభన్ త్రాగె, సూర్యుండు లీ
లారంభుండుగ నింగి నేగును నిరాలంబుండుగా, రాము డా
వీరున్ రావణు జంప కోతులను భావించెన్ చమూ రాశిగా,
పోరాడున్ సుమరాశి నంది మరుడున్, మోదమ్మునన్ సత్యమన్
ధారన్ గెల్చెను తెల్లవారల మహాత్మా గాంధి, యోచింపగా
పోరాటమ్మును జేయ నాయుధములన్ బూనంగ నేలా యనిన్?

**48. నిత్యము గావలెన్ మనకు నెమ్మది గల్గ సమస్య మిత్రమా!**

ఉ. సత్యమె పల్కుమా! యెఱిగి చక్కగ ధర్మము నాచరింపుమా!
నిత్యము 'శంకరాభరణ' నిష్ఠ సమస్యల నభ్యసింపుమా!
స్తుత్య మహోపదేశ మిది, తుష్టిని సద్గురు బోధ నందుమా!
నిత్యము గావలెన్ మనకు నెమ్మది గల్గ సమస్య మిత్రమా!

**49. పద్యము వ్రాయువాడు చెడి పాతకమందును సత్కవీశ్వరా!**

ఉ. పద్యము పోతనార్యువలె, పాపయ వోలెను, జాషువా వలెన్
హృద్యము గాగ వ్రాయవలె, తృప్తి నొసంగగ, వాణి కిచ్చు నై
వేద్యము గా, భళీ యనుచు విశ్వము మెచ్చ, రసమ్ము పండగా,
పద్యము వ్రాయగా దగునె వంచనతో? కుకవి స్వరూపుడై
పద్యము వ్రాయువాడు చెడి పాతకమందును, సత్కవీశ్వరా!

**50. తద్దినమే శుభమ్ములిడు ధారుణిలోని జనాళి కెప్పుడున్.**

ఉ. నిద్దుర లెమ్ము వేకువన, నిల్పుము నీ మది దైవ భక్తి, నీ
వొద్దికతో మెలంగు మిల, నుత్తమమౌ గురు బోధ నెంచుమా,
పెద్దలు పొంగిపోవ కడు బ్రీతిగ వారికి సేవజేయుమా,
ఇద్ది హితోపదేశ మగు, నే దిన మిట్టుల జేయుచుందురో
తద్దినమే శుభంబు లిడు ధారుణిలోని జనాళి కెప్పుడున్.

**51. అందము నాశనమ్మయిన దంచు కడున్ ముద మందె నాతియే.**

ఉ. నందసుతుండు నన్ను గనినాడు, సుగంధము నందినాడు, నా
కందము నిచ్చినాడు, ముద మందుచు నన్ స్పృశియించినాడు గో
విందుడు, చూడు నేడు కనువిందగు; నాదగు కుబ్జరూప మే
మందము? నాశన మ్మయిన దంచు కడున్ ముద మందె నాతియే.

**52. భారవియె రచించె భారతమును.**

ఆ.వె. ఆ వసిష్ఠ నప్త, యా శక్తి మనుమడు,
నా పరాశరునికి నాత్మజుండు,
నరయ శుకుని తండ్రి, యా వ్యాసముని ప్రతి
**భా రవియె రచించె భారతమును.**

***53. భారవి వ్రాసె భారతము పాడిరి దానిని రాఘవాత్మజుల్.***

ఉ. భారతి! తెల్పుమా ఎవడు వ్రాసె కిరాతుని గాథ నింపుగన్?
కోరితి చెప్పుమంచు సుమకోమలి వ్యాసుడు వ్రాసె దేనినిన్?
శ్రీరఘురాముగాథ రమణీయముగా నిల పాడిరెవ్వరో?
భారవి వ్రాసె; భారతము; పాడిరి దానిని రాఘవాత్మజుల్.

***54. విజ్ఞత లేనట్టి వాడు విజయము పొందున్.***

కం. ''ప్రజ్ఞానం బ్రహ్మ'' యని
విజ్ఞతతో ''సోఽహ'' మని వివేచన చేయన్
విజ్ఞాని వగుదు వీవె య
విజ్ఞత లేనట్టి వాడు విజయము పొందున్.

***55. హర్మ్యమ్మున వెదుకదగునె యానందమ్మున్.***

కం. ధర్మార్థధర్మసుఖమ్ముల
ధర్మమ్మానందమిదు ప్రధానముగానన్,
భర్మము కలియౌ, కనకపు
హర్మ్యమ్మున వెదుకదగునె యానందమ్మున్.

***56. భీమసేనుండు తాటకి పీచమణచె.***

తే.గీ. ఆ జరాసంధు పాలిటి యము డెవండు?
మొదట రాముండు చంపిన ముదిత యెవరు?
ఎన్న మారుతి యసురుల కేమి జేసె?
భీమసేనుండు; తాటకి; పీచమణచె.

**57. రావణ కుంభకర్ణులకు రాముడు తమ్ముడు మామ వాలియే**

ఉ. ధీవర! నే పురాణముల దివ్యముగా వినినాడ, చక్కగా
నే వచియింతు నం చొకడు, నిండుగ త్రాగుచు వాగినా డిటుల్
"పావన పంచపాండవులు పల్కగ నల్వురె ముగ్గు రిద్దరే
రావణ కుంభకర్ణులకు రాముడు తమ్ముడు మామ వాలియే"

**రెండవ పూరణ...**

ఉత్పలమాలిక

ఏ విధి పూర్తిజేయగల నిట్టి సమస్య నటంచునెంచ, నన్
గావ స్ఫురించె మృచ్ఛకటిక మ్మను నాటక పాత్రధారి, దు
ర్భావియునౌ శకారు డశుభమ్ముల జెప్పుచు బల్కె నిట్టులన్
"రావణకుంభకర్ణులకు రాముడు తమ్ముడు మామ వాలియే"

**58. నాగుల ముద్దాడె లలన నాగులచవితిన్.**

కం. నాగులు నాట్యమ్మాడగ
నాగక చిత్రీకరించె, నా దృశ్యములన్
తా గాంచి మురిసిపోవుచు
నాగుల ముద్దాడె లలన నాగులచవితిన్.

**రెండవ పూరణ...**

కం. నాగుల ముద్దాడెదనని
వేగమె పందెమ్మునొడ్డి వీడియొలోనన్
నాగుల నృత్యము జూపుచు
నాగుల ముద్దాడె లలన నాగులచవితిన్

***59. మునికిన్  కోపమె భూషణమ్మగు, ప్రజామోదమ్ము సంధిల్లగన్.***

మ.  ముని కోపమ్మున శ్రీనివాసుడిలలో మూర్తీభవించెన్ గదా
    ముని కోపమ్మున నంబరీషుడు సదా పూజ్యుండయెన్ భక్తులన్,
    ముని కోపమ్మున  నేడురోజుల  సిరిన్  పొందెన్  పరీక్షిత్తు,  స
    న్మునికిన్  కోపమె భూషణమ్మగు, ప్రజామోదమ్ము సంధిల్లగన్.

**రెండవ పూరణ....**

మ.  ధనువున్ ద్రుంచగ రాము డా మిథిలలో దా మ్రొక్కె నెవ్వానికిన్?
    తనకున్ శత్రు వనంగ నేది? విలసద్వాక్య మ్మదేమౌనొకో?
    యినవంశమ్మున రామరాజ్యమది తానెట్టుల్ ప్రవర్తించెనో?
    మునికిన్; కోపమె; భూషణమ్మగు; ప్రజామోదమ్ము సంధిల్లగన్.

***60. రావణానుజుండు రాముడు కద.***

ఆ.వె. "వదలు మొకని కులము వర్ధిల" నను ధర్మ
    మెంచి రావణు ఖలు నిలను వదలె,
    అరయ ధర్మమూర్తి యా విభీషణు డగు,
    రావణానుజుండు రాముడు కద.

***61. సవతిలేని ఇంట సౌరులేదు.***

ఆ.వె. నేడు కాంచగ "గృహిణీ గృహ ముచ్యతే"
    యనెడి సూక్తి సత్యమనగ వలయు
    సాధుశీల, సుమతి, సౌభాగ్యవతి, విలా
    సవతి లేని యింట సౌరులేదు.

**62. మునికి  కోపమే భూషణం బనగ నొప్పు.**

తే.గీ. రావణాసురు శిక్షింప, లంక కేగ,

దారి నిమ్మన, కడలి తా నూరకుండె,

రాము డపుడు కోపించె, ప్రళయ సమయ య

మునికి  కోపమే భూషణం బనగ నొప్పు.

**63. తమ్ముని పెండ్లాడె నొక్క తన్వి ముదమునన్.**

కం.  నెమ్మది లేఖను బంపితి,

నమ్మితి నిను, వాసుదేవ ! నా ప్రాణేశా!

రమ్మా యని బలరాముని

తమ్ముని పెండ్లాడె నొక్క తన్వి ముదమునన్.

**64. అన్నదమ్ములు రాముడు నంగదుండు.**

తే.గీ. బోధఁ జేసె రామాయణ గాథ గురుడు

పాత్రలను గూర్చి ప్రశ్నించె వరుస నతడు

అల్లరిన్  జేయుచున్ బల్కె  పిల్లవాడు

"అన్నదమ్ములు రాముడు నంగదుండు"

**రెండవ పూరణ...**

తే.గీ. రామలక్ష్మణు లెవ్వరు రక్త బంధ

మున ? ధరణి జానకీపతి యనగ నెవడు?

వాలిపుత్రు డెవండనన్, పలుకు మిటుల

"అన్నదమ్ములు, రాముడు, నంగదుండు"

**65. చద్దుల బతుకమ్మ నాడె షంషాద్ బేగమ్.**

కం. ముద్దుగ మన సంక్రాంతికి
కద్దిట గొబ్బెమ్మ, యచట గన తెలగాణన్
ముద్దగు మతసహనముతో
చద్దుల బతుకమ్మ నాడె షంషాద్ బేగమ్.

**66. విజయదశమి వచ్చు విదియ నాడు.**

ఆ.వె. “తనయ! కొన్ని నాళ్లె, దగ్గరలో చూడ
విజయదశమి వచ్చు; విదియ నాడు
రమ్ము,సెలవులె గద, రావమ్మ ముందుగా”
ననుచు, బిలిచె నమ్మ యాదరమున.

**67. గాంధి స్వాతంత్ర్యయోధుడు గాడు నిజము.**

తే.గీ. లీల భారతీయులకు కష్టాలబాపు,
వేడ్క మనము హిందీభాష బిలువ బాపు,
గాంధి స్వాతంత్ర్యయోధుడు; గాడు (God) నిజము
ఆంగ్లభాషలో; తలప మహాత్ము డతడు.

**68. రాధ నాలింగనముఁ జేసె రాఘవుండు.**

తే.గీ. అగ్నిపూత, పతివ్రత, యమలచరిత,
శీలవతి,‘సీత’ వర, మనస్విනియు, సాధ్వి
యనుచు, దేవతలును బల్క, నపుడు నిరప
రాధ నాలింగనముఁ జేసె రాఘవుండు.

***69. జన హననము  జేయువాడె జన వంద్యుడగున్.***

కం. కన దుష్టశిక్షణకు,తా

జనియించును దైవ మెపుడు సాధుల బ్రోవన్,

ఘన రావణాది రాక్షస

జన హననము  జేయువాడె జన వంద్యుడగున్.

***70. సోమరితనమ్మె జనులకు సొబగు గూర్చు.***

తే.గీ. వత్స! పనులు చేయక యుండ వద్దు, తగదు

సోమరితనమ్మె; జనులకు సొబగు గూర్చు

వర కృషియె; వివేకానంద, గురువు మనకు

సరిగ జెప్పె 'ఉత్తిష్ఠత' 'జాగ్రత' యని

బోధ నిడెను 'ప్రాప్య వరా న్నిబోధత' యని.

***71. సత్పుత్రు డొకడు జనింప సద్గతి కరవౌ.***

కం. సత్పథము గనడు నరకుడు,

సత్పతి ! యీతని నరకుడు, చంపుదు కృష్ణా!

ఉత్పాత శీలి,యిట్టి య

సత్పుత్రు డొకడు జనింప సద్గతి కరవౌ.

***72. కరుణను జూపించదలచి కఠినుడ నైతిన్.***

(శిశుపాల వధ  సమయంలో కృష్ణుని మనసు)

కం. వర! ద్వారపాలకా! జయ!

కరుణన్ నిన్ జేర్చుకొనగ, ఖండించితి నీ

శిరము, శిశుపాల! నీపై

కరుణను జూపింపదలచి, కఠినుడ నైతిన్.

***73. పుణ్య మార్జింప  పొరుగింటి పొలతి గూడె.***

తే.గీ. పుణ్యమూర్తి శ్రీ కృష్ణుండు పుణ్యము నిడు
కోరి పూజింప, నందరు గూడి రండు
వేగ ననుచు గోదాదేవి పిలిచె, నపుడు
పుణ్య మార్జింప, పొరుగింటి పొలతి గూడె.

***74. పసుల సేవ పరమ పదము నొసగు.***

ఆ.వె. సత్యము, ప్రియ హితము, జనులకు నుద్వేగ
కరము గాని, వాక్కె ఘన తపమ్ము.
తలచి గీత నట్టి తపమును జేయు తా
పసుల సేవ పరమ పదము నొసగు.

***75. నెల జూచి లతాంగి యేడ్చె నేరుపు తోడన్.***

కం. "నిలువుమ మీ పుట్టింటనె
నలరుచు, నాషాఢ మాస మమరును రేపే
చెలి"! యన నాషాఢ మనెడి
నెల జూచి లతాంగి యేడ్చె నేరుపు తోడన్.

***76. వడ్డించెడివాడు శత్రువా? తిననొప్పున్.***

కం. అడ్డము జెప్పకు షుగరని,
లడ్డులు స్వీట్ లెస్సు లడ్లు లభియింపగ, నీ
లడ్డుల ప్రక్కన బెట్టకు,
వడ్డించెడివాడు శత్రువా ? తిన నొప్పున్.

***77. వడ్డన జేయువాడు పగవాడె? తినందగు శంక వీడియున్.***

ఉ. వడ్డన జేయువాడు మనవాడె, సదా శుచి నెంచువాడు, నే
చెడ్డను గూర్పబోడు, పరిశీలన చేయకు వాని వైఖరిన్,
సొడ్డును చెప్పవద్దు శుచి శుభ్రత యంచు మహానుభావుడా!
వడ్డన జేయువాడు పగవాడె? తినందగు శంక వీడియున్.

***78. కారము నయనముల జల్లగన్ హితమబ్బున్.***

కం. కోరిక తీరగ, తిరుమల
జేరుము, శ్రీ వేంకటేశు సేవించుచు, నిం
పారగ తిలకింపు మలం
కారము నయనముల, జల్లగన్ హితమబ్బున్.

***79. కరణ మేల నవ్య కావ్యమునకు?***

(విశ్వనాథ సత్యనారాయణ గారి వాగాడంబరము)

ఆ.వె. "జగతిలో ప్రయోగ శరణమ్ము వ్యాకర
ణము సరస్వతి నగు నన్నెరింగి,
క్రొత్త సూత్రములను కూర్చుకో నాకు వ్యా
కరణ మేల నవ్య కావ్యమునకు?"

***80. తనయుడు పతియయ్యె తరుణి మురిసె.***

ఆ.వె. "అమ్మ ! నమ్మ మెవరి కమ్మను భారతీ!"
యనుచు, రామమూర్తి కంకిత మిడె
ఘనుడు భాగవతము, కవితాంబరమున పో
తన యుడుపతి యయ్యె, తరుణి మురిసె

***81***. **తమ్ముల నిరసించె రామధరణీశుడొగిన్**.

కం. నెమ్మది విని ఘన ముని వా

క్యమ్ముల పూర్ణముగ దండకారణ్యములో,

సమ్మతమున దైత్య వ్రా

తమ్ముల నిరసించె రామధరణీశు డొగిన్.

***82***. **బాలభానుడు నేలపై పరుగులెత్తె**.

తే.గీ. తండ్రియే పుత్రు డను శ్రుతి దలప ; భాను

పుత్రు డైన సుగ్రీవుడు పుడమి భాను

డాలమున పారిపోయె నా వాలి గాంచి,

బాలభానుడు నేలపై పరుగు లెత్తె.

***83***. **కాలు బెండ్లియాడె కరము వలచి**.

(వధూవరుల పేర్లలో మొదటి అక్షరాలు 'క, కా' అని ఉన్న సందర్భం)

ఆ.వె. కమల పెండ్లియాడె కమలాక్షు నర్చించి

కాళి పెండ్లియాడె కాలకాలు

కద్రువయు వరించె కశ్యపు క్రమత 'క

కా'లు పెండ్లియాడె కరము వలచి.

***84***. **ధనలక్ష్మీవ్రత మాచరించిన మహా దారిద్ర్యమే దక్కుగా**.

మ. అనయమ్మున్ ఘనభక్తి నుండుమని ప్రహ్లాదుండు బోధించె, బో

ధనలో శ్రద్ధయె సత్పథ మ్మనెను గీతాచార్యుడున్, కాన భ

క్తిని చేపట్టుము, శ్రద్ధతో మనుము, భక్తి శ్రద్ధలన్ వీడి శ్రీ

ధనలక్ష్మీవ్రత మాచరించిన మహా దారిద్ర్యమే దక్కుగా.

***85*. చరణము తోడ భర్తృపరిచర్య లొనర్చె లతాంగి వేడుకన్.**

చం. సరిగ పవిత్రబంధమును చక్కని బంధము చిత్రమంచు తా
నరయుచు, ధర్మపత్ని పను లందున దాసిగ, గొప్ప మంత్రిగా
కరణములందు, కన్నులను గాంచగ రూపము నందు లక్ష్మిగా,
ధరణిగ నోర్పునన్ మెలగ, తల్లిగ భోజన వేళ, రంభగా
వర శయనమ్ములన్, సతిగ వర్తిలు నంచు, ధరన్ సదా సదా
చరణము తోడ భర్తృపరిచర్య లొనర్చె, లతాంగి వేడుకన్.

***86*. రాణ్ముని దుర్యోధనుండు రాముని సుతుడే.**

కం. చిన్మయరూపుండు, జనక
రాణ్ముని పౌత్రుడు, కుశుండు, లవ సోదరు,డీ
షణ్మాత్ర భేద రహితుడు,
రాణ్ముని, దుర్యోధనుండు, రాముని సుతుడే.

(రాణ్ముని = రాజర్షి; దుర్యోధనుడు = దుర్జయుడు)

***87*. మారీచుండు ధరాత్మజాపతిని దుర్మార్గుండునై చంపెరా.**

శా. చేరంబోవగ, నాదు ముక్కుచెవులన్ ఛేదింపజేయంగ, నీ
వా రామున్ వధియింతు వన్న వని, నే నాశించితిన్, నా కలన్
మారీచుండు ధరాత్మజాపతిని దుర్మార్గుండునై చంపెరా,
వీరా! రాముని చంపరా యిలను నీ వీరత్వమున్ చూపరా.

***88*. గట్రాచూలికి బతి హరి కంతుడు సుతుడే.**

కం. ఎట్రా మహిషుని జంపుట,
యిట్రుండని, దేవి కొరకు నిచ్చిరి, మెరుపుల్
చుట్రా, వస్త్రాస్త్రములన్
గట్రాచూలికి పతి, హరి, కంతుడు, సుతుడే.

**89. పంచ వింశతి శత సమస్యాంచిత మిది.**

తే.గీ. అల దశాబ్దమ్ముగా 'శంకరాభరణము'
మెరయ పద్య రచన నేర్పె మేటి సుకవి
అరయ మన కంది శంకరయ్య ఘనుడయ్య
నిండునూరేండ్లు చల్లగా నుండు మనెడి
పంచ వింశతి శత సమస్యాంచిత మిది.

**90. దశకంఠున్ కడు భక్తి గొల్చు నరులే ధన్యుల్ గదా చూడగన్.**

మ. యశమున్ గాంచగ, తండ్రిమాట వినగా, యజ్ఞమ్ము కాపాడగా,
కుశల మ్మందగ లోకముల్, దనుజులన్ కూల్చంగ, రక్షింపగా
వశులౌ సాధుల, ధర్మమూర్తి వనగా, వైదేహినే ప్రోవగా,
నశియింపంగ నధర్మరాశి, నిను గానన్, రామ! నిర్జింపగా
దశకంఠున్, కడు భక్తి గొల్చు నరులే ధన్యుల్ గదా చూడగన్.

**91. సంపద కొల్లగొట్టెద బ్రశస్తముగా జనులెల్ల మెచ్చగన్.**

ఉ. ఇంపుగ మోది యిట్లనె ''వచించిన రీతుల స్వచ్ఛ భావమున్
నింపగ బూని, స్వచ్ఛతను నిల్పితి భారత దేశమందు. ధ్యా
నింపగ బూని, విశ్వమున నిల్పితి ధ్యానము. భారతాంబ రా
ణింపగ బూని, దూరముగ నెట్టితి నల్లధనమ్ము. నంతటన్
సొంపుగ నేకరీతిగను చూపితి పన్నుల మార్గమున్. యశ
స్సంపద కొల్లగొట్టెద, బ్రశస్తముగా జనులెల్ల మెచ్చగన్.

***92. పుస్తకముల్ పఠించెదరు మూర్ఖజనాళి వివేకశూన్యులై.***

ఉ. "వాస్తవ మేమి? సంశయముఁ బాపుము, మైనపువత్తి నార్పుచున్
ప్రస్తుత మీవు వేఱొకటి వాడిన కారణ మే" మనంగ, నా
శస్తుడు మోక్షగుండ మట సంశయమున్ తొలగింప బల్కెగా
"నేస్తమ! రాత్రివేళ గమనింప, ప్రభుత్వపు క్రొవ్వువత్తినే
ప్రస్తుత మీ నివేదికకు వాడితి; నా పని యంచు, నిప్పుడీ
పుస్తకమున్ పఠింప తలపోసితి నాదగు క్రొవ్వువత్తితో,
వస్తువులన్ ప్రభుత్వ మిడ, వాటిని నిప్పుడు గూడ వాడుచున్
పుస్తకముల్ పఠించెదరు, మూర్ఖజనాళి వివేకశూన్యులై"

***93. నాగుల బూజ సేయు నెలనాగలకున్ నరకంబె ప్రాప్తమౌ.***

ఉ. రేగెను శృంగిశాపము పరీక్షితు డంత మృతుండయెన్ గదా.
యా గతి తండ్రి తక్షక విషాగ్నికి దగ్ధము గాగ, నుగ్రుడై
యాగక, సర్పయాగమున కాద్యుడునై, జనమేజయుండనెన్
"నాగుల బూజ సేయ దగునా, యికపై మగవారి కెన్నగా
నాగుల బూజ సేయు నెలనాగలకున్, నరకంబె ప్రాప్తమౌ"

***94. దుర్యోధను బెండ్లియాడి ద్రోవది మురిసెన్.***

కం. ఆర్యున్, ఫల్గుణు, నర్జును,
వీర్యోన్నతు, మత్స్య యంత్ర విజయుని, సంయ
త్కార్యముల ధనుర్విద్యా
దుర్యోధను బెండ్లియాడి ద్రోవది మురిసెన్.

(సంయత్కార్యము = యుద్ధకార్యము; దుర్యోధనుడు = దుర్జయుడు)

**95. జిహ్వకకు పంచదారయె చేదు గాదె!**

తే.గీ. మితమె సతతమ్ము యుక్తమ్ము మేదినిన్ హి

త మతి సర్వత్ర వర్జయే దనగ వినమె.

రక్తి నతిగ మధుర పదార్థముల దినిన

జిహ్వకకు పంచదారయె చేదు గాదె.

**96. కవి కిద్దరు భార్య లున్నఁ గను సుఖ కీర్తుల్.**

కం. స్తవనీయ సతియె సుఖమిడు

కవియైనన్ కీర్తిసతియు ఘనత వరించున్,

భువి సతి, సుకీర్తిసతి యన

కవి కిద్దరు భార్య లున్నఁ గను సుఖ కీర్తుల్.

**97. పలలమ్మును గోరి చిలుక ఫలముల రోసెన్.**

కం. ఫలమన కర్మఫల మనా

విల మూలాధార చక్ర బీజాక్షరమున్

తలచుటచే, దేహములో

పల లమ్మును గోరి, చిలుక ఫలముల రోసెన్.

**98. కార్తిక పూర్ణిమను గంటి గద నెలవంకన్.**

కం. ఆర్తిన్, సుతు నిమ్మని, గత

కార్తికమున గోర, శివుడు కరుణన్ గోర్కిన్

పూర్తిగ దీర్చెన్, గను మీ

కార్తిక పూర్ణిమను, గంటి గద నెలవంకన్.

(కంటి = ప్రసవించినాను; నెలవంకన్ = బాలచంద్రుని)

**99. సింగము జెంగటన్ గనిన చింతలు దీరుట తథ్యమే గదా.**

ఉ. బంగరు బిడ్డ సైనికుడు, భారత దేశపు చిహ్న మందు, తా
పొంగుచు, భక్తితో కమలమున్ గని, మేటి యశోక చక్ర మూ
ర్తింగని, సత్యమేవ జయతే యను సంస్కృత సూక్తి జూచుచున్,
ముంగిట గుఱ్ఱమున్, వృషభమున్, గజమున్, ఘనశౌర్యచిహ్నమౌ
సింగము జెంగటన్ గనిన చింతలు దీరుట తథ్యమే గదా.

**100. భరతు వధించె రాఘవుడు భామినికై సదసద్వివేకియై.**

చం. ధరణిని వానరుల్ నరులు దప్ప, మరొక్కరు చంపకుండ, దా
వరముల గాంచినాడు, చెరపట్టెను సీతను రావణుం డదే
మరణము గాగ, క్రోధ మద మత్సర శీలుని, కామ మోహ లో
భ రతు, వధించె రాఘవుడు, భామినికై సదసద్వివేకియై.

**101. పండు ముసలిని వరియించె పంకజాక్షి.**

తే.గీ. "పతి యెవడు రేవతికి?" నన బ్రహ్మ పలికె,
"ముసల మాయుధముగ గల పుణ్యమూర్తి
పతిగ బలరాముడె తగు, రేవతికి నోము
పండు" ముసలిని వరియించె పంకజాక్షి.

**102. రమణికి బూలు చేటగును బ్రాయము నందనుమాన మేటికిన్.**

చం. సుమము లనంగబాణము లశోకములున్, నవమల్లికాళి, చూ
తము, లరవిందము ల్గుణయుతమ్ములు నీలపుటుత్పలమ్ములున్
రమణుడు చెంత నుండ ననురక్తినిఁ బెంచును, విప్రలబ్ధయౌ
రమణికి బూలు చేటగును బ్రాయము నందనుమాన మేటికిన్.

***103. శివభక్తాగ్రణి యెవ్వరో యెరుగవా శ్రీశ్రీయె సత్యం బిదే.***

మ. భవ! శ్రీరంగమె యింటిపేరు, కనలేవా? శ్రీనివాసున్, కవి
ప్రవరున్, పాటలు వ్రాసెగా తెలుగు వీరా! లేవరా యంచు, భ
క్తి వెసన్ పాడుము భారతీయుడ! యనెన్ దేశమ్ముపై భక్తి సం
భవమౌ రీతుల, దేశభక్తుడు మహాప్రస్థానమున్ వ్రాసె నో
శివ! భక్తాగ్రణి యెవ్వరో యెరుగవా శ్రీశ్రీయె సత్యం బిదే.

***104. పగతుర పాదపద్మముల బట్టగ వీరుల కొప్పు నాజిలోన్.***

చం. అగణితుడౌ బృహద్రథుని కర్థశరీరములే జనింప, నా
సగములు రెండు చేర్చి జర చక్కగ బట్టగ నొక్క బిడ్డడై,
మగధకు రాజుగాగ, పరిమార్చగ నెంచి వృకోదరుండు సం
యుగమున వాని పాదముల నుద్ధతి పట్టుచు జీల్చె; గావునన్
పగతుర పాదపద్మముల బట్టగ వీరుల కొప్పు నాజిలోన్.

***105. కవులన్ బిల్వగరాదు దండుగ పురస్కారమ్ము లందిచ్చుటల్.***

మత్తేభమాలిక

కవివర్యుండగు కంది శంకరుని సత్కారంబు పాత్రమ్మగున్,
సవనమ్మో యన 'శంకరాభరణము'న్, స్థాపించె పద్యాలకై,
భువిలో నీతని జాడ, వేల కవులే పుట్టన్ దశాబ్దమ్ముగా,
స్తవనీయుల్ గురజాడ వారల పురస్కారమ్ము, నందింపగా,
కవిలోకమ్మును తెల్గుతల్లియు మహత్కార్యమ్ముగా నెంచెగా,
నవలోకింపగ, నిట్టివారలకె చేయంబోలు సన్మానముల్,
కవి నంచున్ పరభావ చౌర్యమున సత్కారమ్ములన్ గోర, నా
కవులన్ బిల్వగరాదు, దండుగ, పురస్కారమ్ము లందిచ్చుటల్.

***106. పరమపదమ్ము లభ్యమగు పాపులకే సులభమ్ముగా భువిన్.***

చంపకమాలిక

మరణము నంది, తేజముగ మాధవు జేరిన చైద్యు జూచుచున్,
వరదుని దిట్టినట్టి శిశుపాలుడు శ్రీహరి జేరు టెట్లనన్,
నరులకు జ్ఞానదాత యగు నారదు డిట్లనె, ధర్మరాజుతో
"హరి గిరి యంచు దిట్టి యిపు డారయ నీ శిశుపాలు డీ సభన్,
కెరలిన భక్తితో భ్రమరకీటక ధర్మముతో పవిత్రుడై
ధరణిని వైరబంధమున తన్మయతన్ హరి నైక్య మయ్యెగా,
నురుతర భక్తిమార్గమున నుండెడి భక్తులకంటె ముందుగా,
పరమపదమ్ము లభ్యమగు పాపులకే, సులభమ్ముగా భువిన్"

***107. పొడి యొనర్చు వాని బొగడ దరమె?***

సీ. ధరణి రథమ్ముగా దనర, వేదమ్ములు
గుఱ్ఱములుగ మారి కొలువు దీర,
సూర్యుండు చంద్రుండు శుభదృష్టి జూచుచు
రథచక్రములు నౌచు రాణ జేర,
బ్రహ్మ సారథి యయ్యె, వర ధనువుగ మేరు
పర్వత మ్మమరెను భద్రమమర,
నారాయణుండు బాణమ్ముగా మారగా,
శివతేజము పురాల జేర్చి యలర,

ఆ.వె.ఇనుము వెండి స్వర్ణ మను లోహపురముల
యంతు జూచుచు త్రిపురాంతకుండు,
త్ర్యంబకుండు వాటి దహనమ్ము జేయుచు,
పొడి యొనర్చు; వాని బొగడ దరమె?

***108. మది మెచ్చిన సుందరాంగి మర్కట మయ్యెన్.***

కం. అదె చూడు పుంజికస్థల,

మొదట గనగ నప్సరస, యిపుడు శాపముచే

నిదె యంజన, యౌ, నందరు

మది మెచ్చిన సుందరాంగి, మర్కట మయ్యెన్.

***109. వాణికి నర్ధదేహమును వాసిగ నిచ్చె శివుండు వేడుకన్.***

ఉ. ప్రాణవిభుండె, భృంగిమునివర్యుని పూజల నంద, కిన్కతో,

స్థాణువుతో సమానముగ సత్కృతి నంద, వ్రతమ్ము జేసె రు

ద్రాణియె గౌతమోక్తి, సతితత్త్వ మెఱుంగుచు, మెచ్చుకొంచు, శ

ర్వాణికి నర్ధదేహమును వాసిగ నిచ్చె, శివుండు వేడుకన్.

***110. బొంకునట్టి వాడె పూజ్యు డగును.***

సీ. బలి చక్రవర్తి! యా భగవాను డీతడే

విష్ణు వవ్యయుడు త్రివిక్రముండు,

అదితి కశ్యపులకు నవతరించినవాడు

వామనమూర్తియై వచ్చినాడు,

ఒక పాదమున భూమి, నొక పాదమున స్వర్గ

మాక్రమించు, నిక నిన్నణచివేయు,

ధర్మమ్ము, కీర్తియు, ధనవృద్ధి, తన సుఖ

మ్మును, స్వజనావన మనగ నైదు

ఆ.వె. కలవు ధనమునకును గన ప్రయోజనములు

కనుక నీయజాల ననుము, వినుము,

ప్రాణ రక్షణమ్మె పరమ ధర్మం బని,

బొంకునట్టి వాడె పూజ్యు డగును.

**111. చోరునకున్ సముండు కవి చోద్యము గాదిది నిత్యసత్యమౌ.**

ఉ. చోరుడు వెల్గు, చోర కళ శోభిలగా, పర విత్త హారిగా;
సూరియు దా కవిత్వ కళ శోభిలగా పర చిత్త హారిగా;
వీరు సతమ్ము దోచుకొన, వీరికి సామ్యము దోచు, నెంచగా
చోరునకున్ సముండు కవి, చోద్యము గాదిది, నిత్యసత్యమౌ.

**రెండవ పూరణ...**

ఉ. ఓరిమి మెల్లగా పదములుంచును, శబ్దము గాంచు, తా నలం
కారములన్, సువర్ణముల గైకొనుగా, రసమున్ స్పృశించెడిన్,
కోరు వరార్థసంపదల, గొప్పగ జూచును దోషసీమలన్,
చోరునకున్ సముండు కవి, చోద్యము గాదిది నిత్యసత్యమౌ.

**112. పట్టపగలు వెన్నెల కురిసెన్ - ఛందో గోపనము.**

సీ. శ్రీవిల్లిపుత్తూరు శ్రీవిష్ణుచిత్తుల
పుత్రికారత్నము పుణ్యచరిత,
ఆండాళ్లు పేరున నలరె, గోదాదేవి
నామధేయమున, శ్రీనాథుడైన
శ్రీ రంగనాథుని శ్రీవారుగా గోరి,
స్వామినే వరియించె; పండుగ నెల
బాలికలకు తిరుప్పావైని బోధించి,
నేత్ర తత్వమ్ముల నిట్లు బలికె,

ఆ.వె. సూర్య చంద్ర నేత్ర శోభితుడౌ స్వామి
ఘనుడు, చంద్రనేత్రము నిటు మూయ
వేడ్క పట్టపగలు, వెన్నెల కురిసెన్ మ
హితుడు సూర్యనేత్ర మిట్లు మూయ.

**113. కుంతికి వందమంది కొడుకుల్ జనియించిన బొందె మోదమున్.**

ఉ. కాంత యసూయ నందినది, గర్భిణియౌ ధృతరాష్ట్రపత్ని, ని
శ్చింతను వీడి, గర్భమును చేతుల గొట్టుచు నేడ్చె నిట్టులన్,
"సంతస మిచ్చునట్టి వర సంతతి గల్గెను ముందుగానె యా
కుంతికి" వందమంది కొడుకుల్జనియించిన బొందె మోదమున్.

**114. కుట్మలదంతి నీ పయిన కోరిక లీరిక లెత్తె నా మదిన్.**

ఉ. కుట్మల మబ్బు నన్ను, నిను గూడక మానను, కీచకుండ, నీ
వట్మరలంగ నప్సరసవై కనిపింతువు, సుందరాంగి! నీ
విట్మరలంగ నా రతివి, యిప్పుడె తాపము దీర్చ వేడెదన్,
కుట్మలదంతి! నీ పయిన కోరిక లీరిక లెత్తె నా మదిన్.

**115. శ్రీకృష్ణుని కంటె ఘనుడు శిశుపాలుండే.**

కం. లోకమున, మూడు కనులు, వి
లోకింపగ నాల్గు చేతులు, గలిగి పుట్టెన్,
చేకొనగ రెండు కన్నుల
శ్రీకృష్ణుని కంటె ఘనుడు శిశుపాలుండే.

**రెండవ పూరణ**

(రుక్మి తన చెల్లెలు రుక్మిణితో...)

కం. గోకులచోరుడు కృష్ణుడు,
నీ కిడు సవతులను, తగడు నీకున్ బతిగా,
నీకెట్లు నచ్చెనమ్మా?
శ్రీకృష్ణుని కంటె ఘనుడు శిశుపాలుండే.

***116. శంకరు డెత్తె వెండిమల శైలతనూభవ సంభ్రమింపగన్.***

ఉ. మంకుతనాన పుష్పక విమానములోజని, నంది జూచి నీ
శంకరు డెంత యంచు, మనసా వచసా వర కర్మణా యనన్
బింకము నంది, రావణుడు, వీరవరేణ్యుడు, సాధులోక నా
శంకరుఁ డెత్తె వెండిమల, శైలతనూభవ సంభ్రమింపగన్.

***117. పద్మము లెల్ల భాను గని వైళముగన్ ముకుళించె జూడుమా.***

ఉ. ఛద్మవిహీను భానుకుల సంభవు జూచి స్వయంవరమ్ములో
పద్మగ నున్న యిందుమతి పాత్రు నజున్ వరియింప, బాధితుల్
సద్మ నివాసులౌ నితర రాజులు క్రుంగగ, వారియొక్క హృ
త్పద్మము లెల్ల భానుఁగని వైళముగన్ ముకుళించెఁ జూడుమా.
(ఛద్మవిహీను = కపటము లేనివానిని; పద్మగ నున్న = లక్ష్మి వలె ఉన్న)

***118. రమ్మున్ గ్రోలిన, రావు రోగము లికన్ రాజిల్లు నారోగ్యమున్.***

శా. అమ్మా! వచ్చును గుండెపోటు, కలుగున్ హై బీపి నిత్యమ్ము, నీ
విమ్మంచున్, పలు కుట్రలన్ దెలుప నీవేలా కనన్ సీరియల్?
వమ్మై పోదువు; భక్తి బోధకములన్ వాంఛన్ గనన్, వేద సా
రమ్మున్ గ్రోలిన, రావు రోగము లికన్ రాజిల్లు నారోగ్యమున్.

***119. గౌరికి కేశవుండు పతి గావలె శంకరు డన్న గావలెన్.***

ఉ. క్షీరసముద్రజాత, విలసిల్లు తటిల్లత, చంద్రకాంతులన్
మీరెడి కాంత, స్వచ్ఛత నమేయగ వర్ధిల గౌరవర్ణగా,
కోరి వరించె లక్ష్మిని వికుంఠనివాసుడు గౌరవర్ణ నా
గౌరికి కేశవుండు పతి గావలె, శంకరు డన్న గావలెన్.
(అమరము – 'పీతో గౌరో హరిద్రాభః' 'గౌరోఽరుణే సితే పీతే'; గౌరికి అంటే గౌరవర్ణంతో విరాజిల్లే లక్ష్మికి అని భావన)

***120. సత్యమ్మున్ గలనైనఁ బల్కఁడు హరిశ్చంద్రుండు ముమ్మాటికిన్.***

శా. సత్యశ్రేష్ఠుల గూర్చి దేవసభలో చర్చించుచుండన్, సదా
సత్యాత్ముం డనె నా వసిష్ఠుడు హరిశ్చంద్రున్ ప్రశంసించుచున్,
నిత్యమ్మున్ సుతు గావ, బొంకి వరుణున్ వేధించినా, డాతడే
సత్యాత్ముం డన దప్పటం చనెను విశ్వామిత్రు డీ రీతిగా
''సత్యమ్మున్ గలనైన బల్కడు హరిశ్చంద్రుండు ముమ్మాటికిన్''

***121. లలిని ప్రపంచ తెల్గు సభలన్ గన నేగెడి వారు మూర్ఖులే.***

చం. అల కవి పండితుల్, బహు సహస్ర వధానులు, ముఖ్య నేతలై
యలరెడు వక్తలున్, ఘనులు నష్ట వధాన శతావధానులున్,
పలు కళలందు కోవిదులు, భారతికిన్ పదపూజ సేయగా
లలినిఁ బ్రపంచ తెల్గు సభలన్ గన నేగెడి వారు మూర్ఖులే?

**రెండవపూరణ...**

చం. పిలిచిరె యాంధ్ర రాష్ట్రమున పెద్ద యనం దగు చంద్రబాబునే?
పిలిచిరె రామలింగ సుకవీశ్వరు పేరడి జొన్నవిత్తులన్?
పలుచన జేసి రాంధ్రులను, బల్కెద కోపముతోడ, నాంధ్రులై
లలిని ప్రపంచ తెల్గు సభలన్ గన నేగెడి వారు మూర్ఖులే.

***122. సీతను దొంగిలించె గద శ్రీ రఘురాముడు దండకాటవిన్.***

(వాలి తారతో...)

ఉ. "పాతకమెట్లు చేయు రఘువర్యుడు? చంపడు నన్ను తార! యా
భూతహితుండు రక్షకుడు పూజ్యుడు జ్ఞానియు, ధర్మమూర్తి నా
చేతము దొంగిలించె, మునిచిత్తములన్ గుణరాశిచేత నో
సీ! తను దొంగిలించె గద, శ్రీ రఘురాముడు దండకాటవిన్"

**123. వెన్నెల రేయియే తనువు వెచ్చగ జేసెను సుందరాంగికిన్.**

ఉ. ఎన్నడు వీడనట్టి ప్రియు డేగగ, ప్రేయసి తద్గుణమ్మునే
యెన్నుచు సంతసించు; శశి యేగగ రోహిణి జేర, వెన్నెలన్
కన్నుల జూచుచున్, ప్రియుని కౌగిలి నున్నటులెంచె తార, యా
వెన్నెల రేయియే తనువు వెచ్చగ జేసెను సుందరాంగికిన్.

**124. పదములు లేని పద్యముల వ్రాయవలెన్ కవు లెల్ల రౌ ననన్.**

చం. ఇది పరుషమ్ము, గ్రామ్య మిది, యిద్ది నిరర్థక, మప్రయుక్త మి
య్యది, యసమర్థమౌ గనగ, నియ్యది క్లిష్టము, నప్రతీతిక
మ్మిదియగు, నప్రయోజనము నిద్ది, యపుష్టము, గూఢ మెన్నగా
నిది, యివి దోషముల్ గనుక నెన్నడు వీటిని వాడరాదు. దు
ష్పదములు లేని పద్యముల వ్రాయవలెన్ కవు లెల్ల రౌ ననన్.

**125. పిడికిలి లోన నాకు కనిపించె దివాకర చంద్ర బింబముల్.**

చం. నుడివెద దక్షయజ్ఞ మన నొప్పెడి చిత్రము జూడ, నందులో
వడి జనె వీరభద్రు డట ధ్వంసము జేయగ దక్షయజ్ఞమున్,
తడబడకుండ దక్షుని పథమ్మున నుండిన దేవతావళిన్
పిడికిట బట్టినాడు కనిపించిన వారల, నుగ్రరూపు, డా
పిడికిలి లోన నాకు కనిపించె దివాకర చంద్ర బింబముల్.

**126. నన్నయభట్టు కన్నడమునన్ రచియించెను మేటి కావ్యమున్.**

ఉ. మున్ను వెలుంగ పంప కవి, పొన్నయు, రన్న కవిత్రయమ్మనన్
కన్నడ మందు, పంపకవి గ్రంథము వ్రాసెను భారతమ్మునే
యన్నున విక్రమార్జున జయమ్మన, భారత కావ్య నిర్మితిన్
నన్నయభట్టు, కన్నడమునన్ రచియించెను మేటి కావ్యమున్.

(అన్నున = పరవశమ్మున)

***127*. పున్నమవేళ యయ్యెనని పూర్తిగ చంద్రుడు మాయమయ్యెడిన్.**

ఉత్పలమాలిక

ఎన్న శపింపగా దగునె? యీ క్షయరోగము గల్గ నంచు, నా
సన్నుని, దక్షు గాంచి, ప్రతిశాప మొసంగును, క్షీణరూపుడై
పున్నమి వేళ యయ్యెనని పూర్తిగ చంద్రుడు మాయమయ్యెడిన్,
చెన్ను దొలంగ, లోకము నశించును, వర్షము లుండ వింక, నే
మన్నను పంటలుండ విక, మాన్యత చంద్రుని రాక గోరుచున్
మున్ను మహౌషధీ చయము బూజ్యత వేయుచు నబ్ధి జిల్కగా,
మన్నన వచ్చు చంద్రు డను మైత్రిని బ్రహ్మయు, నట్లు చేయ, నా
పన్న జనాళి గావ, శశి వచ్చును రెండవ మారు సోముడై.

**రెండవ పూరణ...**

ఉ. అన్నులమిన్న! చంద్రముఖి! యానగ నీయధరామృతమ్ము నీ
వన్నెలు గ్రోల వచ్చితిని వాయువికీర్ణములై శిరోజముల్
చెన్నగు నీదు మోముపయి చేరెను గుంపుగ, కోర్కి రేగెగా
పున్నమవేళ యయ్యెనని, పూర్తిగ చంద్రుడు మాయమయ్యెడిన్.

***128*. తెలుగు తెలుంగు తెల్గని సుధీవరు లెల్లరుఁ బల్కు టొప్పునే?**

చం. పిలువుము నాన్న నమ్మ నని ప్రేమగ జెప్పగ, లేరటంచు తా
బలుకుచు, మమ్మి డాడి గలవారని, బిల్చెద నంచు, బిడ్డయే
పలుకగ, తెల్గు వెల్గె నని, భారత భాషల తెల్గు లెస్స యౌ,
తెలుగు తెలుంగు తెల్గని సుధీవరు లెల్లరుఁ బల్కు టొప్పునే?

**129. దమయంతిని పెండ్లియాడె ధర్మసుతు డొగిన్.**

కం. రమణిని, పాంచాలిని, సతి,
నమలను, ద్రౌపదిని, సుందరాంగిని, కృష్ణన్,
శమ దమ గుణముల పోలిక
దమయంతిని పెండ్లియాడె ధర్మసుతు డొగిన్.

**130. తెలుగు బఠించు వార లిక దేహి యటంచును చేయి జాపరే?**

చం. పలికెను తెల్గు నేత యిటు '' పట్టము గట్టెద తెల్గు భాషకే,
తెలుగు పఠించు వారల నుతింతు, గురూత్తమ కార్య రాశి వా
రల నియమింతు, సత్య మిక ప్రాథమిక మ్మగు పాఠశాలలన్
నిలిపెద తెల్గు'' నంచు, గన నేతల చేతలు సున్న, గావునన్,
తెలుగుఁ బఠించు వార, లిక దేహి యటంచును చేయి జాపరే?

**131. సవతిని జూచి సీత కడు సంతస మందెను రాము తోడుతన్.**

చం. "శివుని ధనుస్సు నెక్కిడెను, చిత్తము దోచెను, పెండ్లియాడె ప్రా
భవమున'' నంచు బల్కుచు, వివాహము గూరిచి విన్నవింతు నం
చు వినయశీల యౌచు ననసూయను సాధ్విని మాన్య మందహా
సవతిని జూచి, సీత కడు సంతస మందెను రాము తోడుతన్.

**132. రావణుఁ బెండ్లి యాడినది రాజిత సీత సకామయై భళా**

ఉ. రావణు డిట్లనెన్ సరిగ వ్రాసెడి శిల్పుల బిల్చి, సీత తా
నా వశమై చరించు, నను నాథునిగా వరియించు నింక స
ద్భావన, రాతికంబముల వ్రాయుడు నాదు చరిత్ర మీ రిటుల్,
"రావణుఁ బెండ్లి యాడినది రాజిత సీత సకామయై భళా''

***133. కన్న వారి కన్న ఖలులు గలరె వెదకి చూచినన్?***

ఉత్సాహ. మున్ను క్రోధ కామ లోభ మోహ మద విమత్సరా

లన్ని యింద్రియాలు చిత్త, మరులటంచు బలికి, తా

నెన్ని హరిని దలచు సుతుని, హింసబెట్టు వారలౌ

కన్న వారి కన్న ఖలులు గలరె వెదకి చూచినన్?

***134. దౌర్భాగ్యమ్ముల నిచ్చి ప్రోవగదరా దామోదరా! సత్కృపన్.***

శా. నిర్భాగ్యున్, బలిచక్రవర్తి నసురున్ నీ విట్లు బంధించు సం

దర్భం బే మని, బ్రహ్మదేవు డడుగన్, తత్త్వమ్ము బోధించుచున్

దౌర్భాగ్యమ్ముల నిత్తు నంటి విల భక్తశ్రేణి బ్రోవంగ; నా

దౌర్భాగ్యమ్ముల నిచ్చి ప్రోవగదరా దామోదరా! సత్కృపన్.

***135. ఎలమిన్ కష్టము లెన్నొ గూర్చును గదా యేకాదశీ పూజలే.***

మ. తొలి యేకాదశి వంటి పుణ్య తిథులందున్; విష్ణు సేవా రతిన్

ఫలిత మ్మందుట మేలు, శాస్త్ర విధులన్ బాటించుచున్ శ్రద్ధతో,

బలిమిన్ కుత్సితబుద్ధి శాస్త్ర విధులన్ వర్జించి, వర్తింపగా

నెలమిన్, కష్టము లెన్నొ గూర్చును గదా యేకాదశీ పూజలే.

***136. బారని చెప్పగానె విని, బాపఁడు సంతస మందెఁ జూడుమా.***

ఉ. కూరిమి వేదముల్ సదువు కోరిక, విప్రవరేణ్యు సద్గురున్

జేరగనే, షడంగముల జెప్పు మనెన్ గురువర్యు డంత తా

నారయ శిక్ష, ఛందమును, వ్యాకరణమ్ము, నిరుక్త కల్పమున్

సారెకు విస్మరించెదను షష్ఠ మొకండని యెంచుచున్ జవా

బా రని చెప్పగానె విని, బాపఁడు సంతస మందెఁ జూడుమా.

**137. రుచిమంతంబగు కోడిమాంస మది యారోగ్యమ్ము సన్యాసికిన్**

మ. అచటన్ సాత్విక భోజన మ్మదియె రస్య స్నిగ్ధ హృద్యమ్మనొ,
నిచటన్ రాజస భోజన మ్మిది సదా యిష్టమ్ము దుఃఖ మ్మిడున్
వచియింపంగను, మాంసభోజనములన్ వద్దంచు, వర్జింపు డీ
రుచిమంతంబగు కోడిమాంస, మది యారోగ్యమ్ము సన్యాసికిన్.

**138. భాగవతమ్ము వ్రాసె నల ప్రాజ్ఞుడు నన్నయభట్టు తెల్గునన్.**

ఉ. భాగవతంబె యౌను భగవంతుని గాథల భక్త గాథలన్
బాగుగ వ్రాయ, పాండవుల భక్తి ప్రపత్తిని, కృష్ణ రీతులన్
సాగిన భారతమ్ము గని, చక్కగ బల్కగవచ్చు నిట్టులన్
భాగవతమ్ము వ్రాసె నల ప్రాజ్ఞుడు నన్నయభట్టు తెల్గునన్.

**139. దుఃఖ మెఱుంగు వానికె యథోచిత తుష్టి కలుంగు నెయ్యెడన్.**

ఉ. దుఃఖము గల్గినన్ బిదప తుష్టియు గల్గును ; తుష్టి గల్గినన్
దుఃఖము గల్గెడిన్ బిదప ; తోచును చక్రము లోని యాకులై ;
దుఃఖము, తుష్టి ప్రాప్తమగు ధోరణి నర్థము జేసికొన్నచో,
దుఃఖ మెఱుంగు వానికె, యథోచిత తుష్టి కలుంగు నెయ్యెడన్.

**140. తర్షము దీరలేదు గద ద్రాక్ష రసమ్మును ద్రాగి చూచినన్.**

ఉ. హర్షము గూర్ప బిడ్డలకు, నర్థము నిమ్ముచితమ్ముగా, మహో
త్కర్షము గల్గ; మేటి తమకమ్మున లక్షల నీయ జెల్లునే?
మర్షము తోడ త్రాగవలె మాన్య జలమ్మును దప్పిగొన్న; నా
తర్షము దీరలేదు గద ద్రాక్ష రసమ్మును ద్రాగి చూచినన్.

(ఉచితము = తగినంత; ఉత్కర్షము = మేలు; మర్షము = ఓర్పు; తర్షము = దప్పిక)

**141. మాన్యుడు గానివాడు సభ మన్నన లందె నదేమి చిత్రమో?**

ఉ. మాన్యవు, నీదు చిత్తసభ మంచి వరుండుగ గొల్వు దీరె సా
మాన్యుడు భూతనాయకు డమంగళశీలి శ్మశానవాసియున్
మాన్యుడె? నాగభూషణు డుమా! వలదమ్మ త్రినేత్రు, డక్కటా!
మాన్యుడు గానివాడు సభ మన్నన లందె నదేమి చిత్రమో?

**142. చోరుడు పూజ్యు డాయె గద చోద్యముగాగ నిలాతలమ్మునన్.**

ఉ. క్రూరుడు బాలుడై వివిధరూపుల జంపెను పూతనాదులన్,
జారుడు నుంచెడిన్ తన వశమ్మున నిత్యము గోపకాంతలన్,
మారడు సజ్జనుండుగను, మానడు దొంగతనాలు, శాటికా
చోరుడు పూజ్యు డాయె గద చోద్యముగాగ నిలాతలమ్మునన్.

(శాటికా చోరుడు = గోపికా వస్త్రాపహారి)

**143. హరితత్వమ్మును మెచ్చి నాస్తికుడు బ్రహ్మానందమున్ జెందెరా.**

మ. అరయన్ నాస్తిక కర్షకుం డొక, డనూహ్యంబైన యత్నమ్ముతో,
వర కేదారమె లోకమంచు, నిరతం బా నేలతల్లిన్ గనున్,
సరిగా నాట్లను వేయగా, నదియు సస్యశ్యామలంబయ్యె, నా
హరితత్వమ్మును మెచ్చి, నాస్తికుడు బ్రహ్మానందమున్ జెందెరా.

**144. భార్యలు ముప్వు రారతులు పట్టిరి పావన రామమూర్తికిన్.**

ఉ. వీర్యమునందు విష్ణువుగ, వేదవిదుండుగ, ధర్మమూర్తిగా,
ధైర్యమునందు చూడగను దా హిమవంతుడు నైన రాముడే
శౌర్యము చూపి సీత గొని, సౌమ్యు డయోధ్యకు రాగ, మేటి ధీ
వర్యుని స్వాగతించుచు, శుభ మ్మని కోసల నామ దేశ రాట్
భార్యలు ముప్వు రారతులు బట్టిరి పావన రామమూర్తికిన్.

**145. పడతియె శాంతి సౌఖ్యముల భంగ మొనర్పఁగ గారణం బగున్.**

చం. దడ గలిగించు శూర్పణఖ, తాటక, మంథర, కైక వంటి వా
రిడుముల బెట్టువారు, కరుణింపరు, ప్రాణము దీయువారు తా
మొడుపుగ; వారి వోలె నిల నొప్పుచు, నిత్యము దుష్టచిత్తయౌ
పడతియె, శాంతిసౌఖ్యముల భంగ మొనర్పఁగ గారణంబగున్.

**146. కవితల లేని భావములు కైతల కెక్కెఁ బ్రశంసనీయమై.**

చం. కవి యను పేర దానవుల గాచెడి శుక్రుడు శాప మిచ్చె దా
నవులకు, తాను ద్రాగు సుర నాశన కారణ మంచు మానె, మా
ధవునికి దానభంగమును దాను దలంపగ కన్ను బోయెగా,
కవి తల లోన లేని వగు కార్యములే జరిగెన్, దలంప నా
కవి తల లేని భావములు కైతల కెక్కెఁ బ్రశంసనీయమై.

**147. ఖర మార్గంబున సాగుమా కలుగు సౌఖ్యశ్రీలు నీ కెప్పుడున్.**

మ. సురలున్ దైత్యులు సంద్రమున్ చిలుక నాశుప్రౌఢి, హాలాహలం
బరుదెంచెన్, భయమంది రంద, రనుకంపన్ లోకకల్యాణ త
త్పరుడై శంభుడు దాని మ్రింగె, నదియే ధర్మంబు నా చంద్ర శే
ఖర మార్గంబున సాగుమా కలుగు సౌఖ్యశ్రీలు నీకెప్పుడున్.

**148. సర్వజ్ఞుం డని కీర్తిఁ బొందెను గదా చంద్రుండు సచ్ఛీలుడై.**

శా. "ఉర్విన్ తా ననసూయ కత్రికి సుతుం, డూహింప నాహారమౌ
సర్వామర్త్యుల, కక్షి విష్ణువున, కాస్వాదించె పీయూషమున్,
సర్వ శ్రేష్ఠుడు, తండ్రి యా బుధునికిన్, సౌజన్య" దంచున్ సదా
సర్వోత్కృష్టత వాని దాల్చు తలపై శర్వుండు గౌరీశుడున్
సర్వజ్ఞుం, డని కీర్తిఁ బొందెను గదా చంద్రుండు సచ్ఛీలుడై.

***149. సంహారమ్మును జేసెదన్ జగమునన్ శాంతిన్ ప్రతిష్ఠింపగన్.***

(కల్కిగా అవతరింతునని విష్ణువు చెప్పుట)

శా. అంహస్సున్ దొలగింతు ఖడ్గ మది నా హస్తమ్ము నం దుండగా,
రంహోయుక్తుడ, కల్కి నశ్వ గతులన్, రక్షించెదన్ సాధులన్;
సింహమ్మో యన చీల్చివేసెదనుగా చెండాడుచున్, దుష్టులన్
సంహారమ్మును జేసెదన్; జగమునన్ శాంతిన్ ప్రతిష్ఠింపగన్.

***150. ధారణ లేని వాఁడె యవధానిగ వర్ధిలు నద్భుతంబుగన్.***

ఉ. ధారణ యన్న సంస్థ యగు, ధారణయౌ, స్థితి యౌను, సీమయౌ,
ధారణ యన్న ''సీమ'' యను తత్త్వమునే తలపోయ, ధారలో
నారయ ధోరణిన్ ధిషణ యందున ధైర్యము నందు ధారణన్
ధారణ లేనివాఁడె, యవధానిగ వర్ధిలు నద్భుతంబుగన్.

***151. దుఃఖమె స్త్రీల కెల్లపుడు తుష్టిని పుష్టిని శాంతి నిచ్చెడిన్.***

ఉ. దుఃఖ విరాగ భావములు తోచును స్త్రీకి ప్రసూతి వేళ, నా
దుఃఖమె బిడ్డ గన్పడగ దూరమగున్ ఘన తృప్తి నిచ్చు, నా
దుఃఖమె జన్మసార్థకతతో నిడు నమ్మ పదమ్ము, గాన యా
దుఃఖమె స్త్రీల కెల్లపుడు తుష్టిని పుష్టిని శాంతి నిచ్చెడిన్.

***152. కీచకుడైన సద్గురువు కీర్తి గడించు ధరిత్రి లోపలన్.***

ఉ. యోచన ధర్మ బద్ధముగ నుండవలెన్ పురుషార్థ సిద్ధికై,
కీచక రావణాదు లపకీర్తిని గూలిరి చూడుమా యనెన్
నీచుని మార్చ సద్గురువు; నీతి నెఱింగిన మారిపోవు గా
కీచకుడైన; సద్గురువు కీర్తి గడించు ధరిత్రి లోపలన్.

***153*. బూతు పురాణమున్ జదువ బుణ్యము దక్కును తథ్య మీ భువిన్.**

ఉ. ప్రీతి పురాణ గాథలను, వీనుల విందుగ జెప్ప బూనితిన్,
పాతకముల్ నశించు గద, భద్రము గల్గెడి నాలకింప, నీ
చేతము పైన చల్లగను శ్రీ హరి తత్త్వ పవిత్ర గంధమున్
బూతు; పురాణమున్ జదువ బుణ్యము దక్కును తథ్య మీభువిన్.

**రెండవ పూరణ...**

ఉ. ఆతత కీర్తి వ్రాయ గల, వంచు దలంచితి గాని, నే దప
ఖ్యాతి లభింప, వ్రాసితివిగా నిట 'బూత'కు కొమ్ము జేర్చుచున్,
బూతుపురాణమయ్యె ! పదమున్ సవరింపక యున్న నిట్లగున్
"బూతు పురాణమున్ జదువ బుణ్యము దక్కుట తథ్య మీభువిన్"

**మూడవ పూరణ....**

ఉ. పాతకరాశి ద్రుంచు భగవానుడు, నిర్మలు, డెన్న నాత్మ సం
భూతుడు, నిర్గుణుండు, పరిపూర్ణుడు, దివ్య పురాణ కీర్తితుం,
డాతత పుణ్యదాయకు, డనంతుడు, పూతుడు గాన నిత్యమున్
బూతు పురాణమున్ జదువ బుణ్యము దక్కుట తథ్య మీభువిన్.
(నిత్యమున్ + పూతు = నిత్యమున్ బూతు)

***154*. అనుమా వినుమా స్తవనీయ సత్కథల్.(ఛందోగోపనము)**

ఉ. కాదనకుండ నా ధ్రువుని గాథ, గజేంద్రుని గాథ, భక్త ప్ర
హ్లాదుని గాథ, వామనుని రమ్య చరిత్రము, నంబరీషు గా
థాదుల, రంతిదేవు చరితమ్ము, కుచేలుని గాథ, కృష్ణ లీ
లాదుల జెప్పె, నా శుక మహర్షి యె భాగవతమ్ము నందు నా
మాదిరి జెప్పు మంచు, ననుమా వినుమా స్తవనీయ సత్కథల్.

***155. బైబిలులో ఖురాను గని భాగవతమ్ము రచించె నింపుగన్.***

ఉ. బాబు! ఖురాను చెప్పె నుపవాస మవశ్య మటంచు చక్కగా,
బైబిలు బోధ యందు నుపవాస మవశ్య మటంచు దెల్పె, రా
వా బతు కౌను ధన్య మనె భాగవత మ్ముపవాస రీతి, జీ
వా! బహు మార్గవర్తి! భగవాను డొకం డని రామకృష్ణుడే
ధీ బల సంపదన్ బలుక, దీని నొకండు సమన్వయించుచున్,
బైబిలులో ఖురాను గని భాగవతమ్ము రచించె నింపుగన్.

***156. కాటుకగా ధరించె గద కంజదళాయతనేత్ర కారమున్.***

ఉ. పాటున రాధ నెంచి వృషభమ్మును కృష్ణుడు గట్టె పాలకై,
పాటలగంధి రాధ మది భావన చేయుచు కృష్ణతత్త్వమున్
పాటల బాడుచున్ వర ప్రభన్ చిలికెన్ దధి రిక్త పాత్రమున్,
కాటుకగా ధరించె గద కంజదళాయతనేత్ర కారమున్.

***157. దుష్టు సుయోధనున్ వలచి ద్రోవది పెండిలియాడె వేడుకన్.***

ఉ. భ్రష్టుడు మత్తచిత్తు డిటు వల్కె శకారుడు నాడు వింతగా,
"నిష్టము తోడ లక్ష్మణ వరించిన దా శశిరేఖ చూడగా,
నిష్టముతోడ రుక్మిణి వరించెనుగా శిశుపాలు, నట్టులే
దుష్టు సుయోధనున్ వలచి ద్రోవది పెండిలి యాడె వేడుకన్"

***158. హనుమంతుండు వివాహ మాడె హిమశైలాధీశు పుత్రిన్ దమిన్.***

మ. వినుమా యం చిటు పల్కె మేన చెలితో విశ్వేశు కల్యాణమున్
"ఘనుడీ శంభుడు దివ్య సుందరుడుగా కన్పించు నీ నాడు; నా
మనసే కుందగ వచ్చె భిక్షుకుడుగా మా యింటి కా నాడు తా
గనిపించెన్ గద కోతి వోలె మొదటన్ కన్యార్థియై యట్టి యా
హనుమంతుండు వివాహమాడె హిమశైలాధీశు పుత్రిన్ దమిన్"

**159. లక్ష్మణుఁ బెండ్లి యాడినది రాజిత సీత సకామయై భళా.**

ఉ. లక్ష్మియె సీత గాగ, రఘురాముడుగా హరి యుద్భవించె, నా
లక్ష్మి జనించినట్టి మిథిలా నగరాన స్వయంవరమ్ములో
లక్ష్మిని జూచె, విల్విరిచె రాముడు శ్రీయుతమూర్తి, సర్వదా
లక్ష్మణు డన్న యర్థమును లక్ష్మ్యనపాయుడుగా వచింతు, నా
లక్ష్మణుఁ బెండ్లియాడినది రాజిత సీత సకామయై భళా.

**160. నిందలు మోపి పిమ్మటను నెమ్మిని మెచ్చెను మేలు గోరుచున్.**

ఉ. అందఱు నిన్ను దొంగయని యందురు సత్యమె? వెన్నదొంగ! నీ
వందఱి యిండ్లలో పెరుగు పాలు భుజింప భవత్ప్రసాదమౌ,
ముందు భుజింపు మింట, నని ముద్దుగ బల్కె యశోద, కృష్ణుపై
నిందలు మోపి పిమ్మటను నెమ్మిని మెచ్చెను మేలు గోరుచున్.

**161. అక్కరో! యిటు రాగదే యని యాలిఁ బిల్చెను భర్తయే.**

మత్తకోకిల. అక్కటా ! యనగా నిరీశ్వర యాగమే జరుగంగ తా
నొక్క టైనను బోవ నెంచెడి నూహ నా సతి యుండెగా,
దక్క దింక నటంచు రుద్రుడు తా సతిన్ గన బిల్చె, ''ని
న్నొక్క సారి గనంగ నా మది నుండె మేధకు చూడగా
అక్కరో! యిటు రాగదే'' యని, యాలి బిల్చెను భర్తయే.

**162. కాలు కడు యాతన బెట్టెను గ్రామవాసులన్.** (ఛందోగోపనము)

ఉ. జోతలు గన్న పాచకుడు శుభ్రత లేకయె వంట జేయుచున్,
చేతము పొంగ షడ్రుచుల సిద్ధము జేసెను భోజనాదులన్,
ప్రీతి భుజింపగా నుదర వేదన, వాంతులు గల్గ సాగెగా!
ఆతని వంటకాలు కడు యాతన బెట్టెను గ్రామవాసులన్.

**163. చీమయె ముద్దులాడె నల శీతమయూఖుని చిత్ర మయ్యెడిన్.**

ఉ. ఏమనవచ్చు? కిందమ మునీంద్రుడు జింకగ మారె భార్యతో
కామము నంద, దేవతలు గాంతురు కోరికఁ గామరూపమున్,
ప్రేమగ తారయున్ శశి పిపీలికలై విహరించుచుండగా,
చీమయె ముద్దులాడె నల శీతమయూఖుని చిత్ర మయ్యెడిన్.

**164. దుర్మార్గం బిసుమంత లేదు గురులన్ దూషింపగా శిష్యులే.**

శా. శర్మంబున్ గలిగింప శిష్యులకు దీక్షన్ విద్య నేర్పించు స
త్కర్మంబే గురు లెల్ల చేయవలె; వీకన్ ద్రోణు డంగుష్ఠమున్
ధర్మంబే గురుదక్షిణార్థ మడుగన్; దా నేకలవ్యుండు నే
మర్మం బెంచక నిచ్చె; శిష్య గణ సామర్థ్యమ్ము ఖండించుచో
దుర్మార్గం బిసుమంత లేదు గురులన్ దూషింపగా శిష్యులే.

**165. పిన్నలు పెద్ద లేగిరట భీష్ముని పెండ్లిని జూడ వేడుకన్.**

ఉ. మున్నట భోజ వంశమున బుట్టి విదర్భకు రాజు లేలినా
రన్నన దాము కుండిన పురమ్మును, వారల భీష్మకుండు దా
నెన్నగ భీష్మ నామము ధరించిన వాడు వివాహమాడగా,
పిన్నలు పెద్ద లేగిరట భీష్ముని పెండ్లిని జూడ వేడుకన్.

**166. అల్లా క్రీస్తులు రామచంద్రసుతులయ్యా శాస్త్రి! సేవింపుమా.**

శా. చెల్లున్ సన్మతసామరస్య మిలలో శ్రేయ మ్మిడున్ సర్వదా
అల్లా మాలికు; దైవ దూత యగు తా నా క్రీస్తు; విష్ణ్వంశ వ
ర్ధిల్లం బుట్టిన రామచంద్రసుతులున్, ధీరుల్, ప్రజల్ మెచ్చగా
నుల్లంబందున నిల్చి రా లవకుశుల్; యోచింప పూజార్హు లా
యల్లా క్రీస్తులు, రామచంద్రసుతు, లయ్యా! శాస్త్రి! సేవింపుమా.

***167. అనలమె సుమ్మి చల్లన, మహా హిమ శైలము వేడి యీ భువిన్.***

చం. వినక హితమ్ము రావణుడు వేగమె తోకకు నిప్పుఁ బెట్టగా
నసలము గాల్చదయ్యె నణు వంతయు ని న్నట నంజనాసుతా!
ఘనతర రామనామము నఖండముగా జపియించు చుండుటన్
మనమున, రామ నామ మహిమ మ్మిది, భక్తుల కిట్లగున్ సదా
అనలమె సుమ్మి చల్లన, మహా హిమ శైలము వేడి యీ భువిన్.

***168. మీసములన్ గనంగ గలమే యిక మేదిని నెందు గాంచినన్.***

ఉత్పలమాలిక

ధీసముపేత! రాజనుత! తిర్పతి శాస్త్రి వరేణ్య! ప్రోవు మీ
వే, సురరూప! చెళ్లపిళ వేంకటశాస్త్రి వరేణ్య! కావుమా!
భాసుర చర్ల బ్రహ్మయకు భక్తి ప్రపత్తుల శిష్యు లౌచు, వా
ణీ సము లౌచు, పద్యముల నిత్యము చెప్పుచు నాశుధారలన్,
మీసము సంస్కృతాంధ్రముల మేమె కవీంద్రుల మంచు బెంచుచున్,
మీ సుకవిత్వ ధారలను మించ వధాన విధాన వైఖరిన్,
వాసి నిరక్షరాస్యు లిల వర్ధిలుచుండిరి యక్షరాస్యులై,
భాసితు లక్షరాస్యు లిక భవ్య కవీశ్వరు లైరిగా, కవుల్
చేసిరిగా వధానముల, శ్రీయుతు లెందరొ శిష్యు లైరిగా,
వ్రాసిరి మిమ్ము గూర్చి మది రంజిల నాంధ్రులు, వెల్గినారుగా
శ్రీ సతి జేర, రాజ గణ సేవల నేనుగు నెక్కినార, లే
దోసము లేనివారలయి, తుష్టి సదా బహుమాన కీర్తులన్
రాసులుగాగ గొన్న కవిరాజులు మీరలు, మీకు మ్రొక్కెదన్
మీ సములన్ గనంగఁ గలమే యిక మేదిని నెందు గాంచినన్.

***169*. తెలుగును నేర్చుకొమ్మనుట తేలిక నేర్చినఁ గొల్వు లిత్తురే?**

చం. పలుచన చేయవద్దు పరభాషల మోజున మాతృభాష యౌ
తెలుగును, తెల్గుభాష కడు తీయని కమ్మని భాష, యంతటన్
వెలిగెడి భాష, సత్య మిది, వీనుల విందగు భాష యందు, రీ
తెలుగునె నేర్పు నా బడులఁ దీసిరి మూసిరి మంత్రి వర్యు లీ
తెలుగును నేర్వ జీవితపు తీరు వెలుంగగ కొల్వు దక్కునే?
తెలుగును నేర్చుకొమ్మనుట తేలిక, నేర్చినఁ గొల్వు లిత్తురే?

***170*. సమకూర్చుం గద సర్వ సంకటములన్ సంకర్షణుం డెప్పుడున్.**

మ. శ్రమ గల్పించెను గర్భవాసి యగుచున్ సంకర్షణుం డౌచు వి
భ్రమలన్ దేవకి, కంత రోహిణికి తా రాముండుగా బుట్టె, భీ
ము మదిన్ మెచ్చడు, కోపశీలి, బలరాముం డెప్డు దుర్యోధనున్
కుమతిన్ మెచ్చును గంగలో గలుపగా గ్రుచ్చెన్ గదా హస్తినన్,
యమునన్ జీల్చెను, సూతు గొట్టె, సరిగా నాలోచనన్ జేయగా
సమకూర్చున్ గద సర్వ సంకటములన్ సంకర్షణుం డెప్పుడున్.

***171*. అనృతమ్మున్ గడు నేర్పునన్ బలుకువాఁ డారాధ్యుడౌ సత్సభన్.**

మ. వినుమయ్యా!శివరాత్రి నాటి కథ నా విష్ణుండు నా బ్రహ్మయున్
ఘనుడన్ నే నని కాదు నే ననగ, లింగ మ్ముద్భవింపంగ, దా
నిని నాద్యంతము చూడ నేగి రట, గానీ చూడలేరైరి, యై
నను "నే జూచితి" నం చసత్యమును తానా బ్రహ్మ పల్కన్, శివుం
డనె యజ్ఞమ్మున పూజ యుండదని బ్రహ్మన్ గూర్చి, యేరీతి దా
ననృతమ్మున్ గడు నేర్పునన్ బలుకువా డారాధ్యుడౌ సత్సభన్?

**172. దారము పైన వ్రాలెను గదా మకరందము గ్రోల తుమ్మెదల్.**

ఉ. శ్రీరమ గొల్చు పాదముల చిత్తము నిల్పి, భవాబ్ధి దాటగన్
సారము భక్తిమార్గ మని, సాధన జేసెడివాడు శీఘ్రమే
పారము చేరు, విష్ణు పద పద్మ సుధన్ గొనగోరి భృంగమై
చేరితి జొక్కి; యీ మదన సేవలు వ్యర్థము లంచు నెంచి మం
దారము పైన వ్రాలెను గదా మకరందము గ్రోల తుమ్మెదల్.

(మదన పుష్పము = ఉమ్మెత్త పూవు)

**173. దుష్ట కురురాజు రణంబున జంపె భీమునిన్.** (ఛందోగోపనము)

ఉ. నా జము డీతడే యనుచు నాశము జేయగ నెంచి, నేరుగా
నాజిని జంప జాలక, విషాన్నము బెట్టితి, గంగ ద్రోసితిన్,
నా జవసత్త్వరాశియు గనన్ వృథ యంచును స్వప్న మందు రా
రాజుగ నున్న దుష్ట కురురాజు రణంబున జంపె భీమునిన్.

**174. పతినే నమ్మి మనమ్ము నందు సతమున్ బాధల్ వడెన్ సాధ్వియై.**

మ. గతి నీవే, పతి నీవె రావణవిభో! గైకొమ్ము నా మాట, నీ
వతి కామమ్మున సీతఁ దెచ్చితివి, నీ యంతున్ గనున్ దాను, నీ
మతి యోచింపుము ధర్మ మంచు, బలికెన్ మండోదరీనారి, యా
పతినే నమ్మి మనమ్ము నందు సతమున్ బాధల్ వడెన్ సాధ్వియై.

**175. జూదము నాడు వారు సరసుల్ సుజనుల్ గద లోకమందునన్.**

ఉ. వాదము లేక పూజ్యు లగు వారల నా నల ధర్మరాజులన్
నీదు మనమ్మునన్ దలప నీ కలిదోష మడంగు; కీర్తిసం
పాదితులైన ధార్మికులు, పాత్రులు వారలు ధర్మబద్ధులై
జూదము నాడువారు సరసుల్ సుజనుల్ గద లోకమందునన్.

**176. ఎంతయొ నంచు నెంచితిని యింతియయే యని మీర లెంతురే?**

(పరీక్షిత్తు శుకమహర్షితో...)

ఉ. "చింతన చేయుమా హరిని, శీఘ్రమె యొక్క ముహూర్తమందె ని
శ్చింతగ మోక్షమున్ గనగ జెల్లు, నటంచును బల్కు చుంటి వా
వంతయు సందియమ్ము వలదందువు, హే శుకయోగివర్య! నా
కింతియె చాలు, కావలయు నెన్న కఠోరమునౌ పరిశ్రమం
బెంతయొ నంచు నెంచితిని, యింతియయే యని మీర లెంతురే?"

**177. రావణు డంత రాముడయి రావణుఁ జంపె రణమ్మునందునన్.**

ఉ. దైవము విష్ణుమూర్తి యవతారము నందును సాధువర్గమున్
గావగ, దుష్టులన్ దునుమగా, నిల స్థాపన జేయ ధర్మమున్;
పావన సీతఁ గోరి చెఱపట్టగ, పెట్టగ లంకలోపలన్
రావణు, డంత రాముడయి రావణుఁ జంపె రణమ్మునందునన్.

**178. రంభను పెండ్లియాడె రఘురాముడు తా నటు సీత మెచ్చగన్.**

ఉ. శంభుడు, బ్రహ్మయున్, సురలు, సాధులు, పౌరులు సంతసింప, ని
ర్దంభుడు ధర్మమూర్తి యట దాల్చె కిరీటము, కీర్తిమంతమౌ
కుంభిని రామరాజ్య మన, కోసల రాజ్య రమాఖ్య సత్క్రియా
రంభను బెండ్లియాడె రఘురాముడు తానటు సీత మెచ్చగన్.

**179. రాముని పుత్రు డర్జునుడు రావణు గెల్చె రణాంగణమ్మునన్.**

ఉ. భీముడు, మౌనియైన కృతవీర్యుని పుత్రుడు, దత్తభక్తుడౌ,
నా మహితున్, సహస్రకరు, హైహయ వంశజు, కార్తవీర్యుడన్
నామము గన్న యర్జును, ననంగక్రియాయుతు గాంచి నవ్వుచున్
"కామవిలాసతత్పరుడు కయ్యములో గెలువం" దనంగ నౌ
రా! ముని పుత్రు దర్జునుడు రావణు గెల్చె రణాంగణమ్మునన్.

***180. పతి సరసమ్ము లాడ సతి పర్వులు వెట్టె న దేమి చిత్రమో?***

చం. సతియె జనించి పార్వతిగ, శంకరు భర్తగ గోరి, తండ్రి స
మ్మతి దప మాచరింప; తన మానినిఁ జేరుచు బ్రహ్మచారిగా
"నతివ! శ్మశానవాసిని, మహా శివుఁ గోరిన యుత్పలాక్షి! సం
స్తుతమతి! గౌరి! నీ గతి యధోగతి సుందరి!" యంచు నా జగత్
పతి సరసమ్ము లాడ సతి పర్వులు వెట్టె నదేమి చిత్రమో?

***181. పుత్రోత్సాహము పొంగి పొర్లు గదరా పోగాలమే వచ్చినన్.***

(శ్రవణకుమారుని తండ్రి దశరథుని శపించుట)

శా. పుత్రోత్సాహము పొంగ, మా యసువులే పోవంగ నీ వేళ మా
పుత్రున్ జంపితి వీవు, హే దశరథా ! పుణ్యాత్ము డైనట్టి నీ
పుత్రుండే నిను వీడి పోవ, నిటులే పోవున్ భవత్ ప్రాణముల్,
పుత్రోత్సాహము పొంగి పొర్లు గదరా పోగాలమే వచ్చినన్.

***182. కోడిని బ్రాహ్మణుం డొకడు గోరి భుజించె జనుల్ నుతింపగన్.***

ఉ. వేడి యడంగు, శూల లవి వీడును, సత్యము సర్వ రోగముల్
బూడిదయౌ, నపూర్వమగు మూలిక యిద్దియె నమ్మకమ్ముతో
వాడుడు గావుకోడి నని పల్కుచు కోయ యొసంగ నట్టి గావ్
కోడిని బ్రాహ్మణుం డొకడు గోరి భుజించె జనుల్ నుతింపగన్.

***183. రాలను వండిపెట్టె రుచి రంజిలుచుండఁగఁ గాంత ముద్దుగన్.***

ఉ. హేలగ సూర్యదేవు నుదయింపగఁ జేసె, ధరన్ త్రిమూర్తులన్
బాలుర జేసె, నత్రిసతి పావని తా ననసూయ సీతకున్
లీలగఁ జెప్పె ధర్మముల ప్రీతిగ, నారదమౌని కోరగా
రాలను వండిపెట్టె రుచి రంజిలుచుండగ గాంత ముద్దుగన్.

***184***. ***లెక్కయె యెక్కువై నపుడు లేదు గదా సుఖ మెంత మాత్రమున్***.

ఉ. నొక్కి వచించె ధర్మము మనుస్మృతి, యర్థము దుఃఖ భాజన
మ్మక్కట! యార్జవమ్మున, వ్యయమ్మున, సంచిత రక్షణమ్మునం,
దక్కర యున్న మేర ధన మందుకొనంగ సుఖమ్ము గల్గెడిన్,
లెక్కయె యెక్కువై నపుడు లేదు గదా సుఖ మెంత మాత్రమున్.

(లెక్క = డబ్బు, ధనము)

***185***. ***మల్లియ తీగకున్ గలిగె మామిడి కాయలు నేత్రపర్వమై***.

ఉ. మల్లియ వంటి కోమలి, సుమంగళి, గర్భిణి, సీత కానలో
తల్లడ మందుచుండ, ముని తల్లజు డామెను చేరదీయ, శో
భిల్లు కుమారులన్, కవల పిల్లల దా ప్రసవించె, చూడుడీ
మల్లియ తీగకున్ గలిగె మామిడి కాయలు నేత్రపర్వమై.

***186***. ***మగనికి గర్భమయ్యెనని మానిని మీసము దువ్వె వేడుకన్***.

చం. మగువ వివాహమాడి, యొక మాసములో నెల దప్పి, యమ్మగా
నగణిత మోద మందగల నంచును, ధన్యత గాంతు నంచు, శ్రీ
సుగతులు గల్గునంచు, బతి జూచి, ముఖమ్మున ముద్దు బెట్టుచున్
మగనికి, గర్భ మయ్యె నని మానిని మీసము దువ్వె వేడుకన్.

***187***. ***రా రా రమ్మని పిల్చె సీత యెలమిన్ రాధాప్రియున్ జెచ్చెరన్***.

శా. శ్రీ రమ్యం బగు వేణుగాన సుధ వాసిన్ గూర్చుచున్, గోవులన్
"హే రాధా! సతి! సీత! గంగ ! ఉమ! లక్ష్మీ! వాణి!" యంచున్ సదా
పేరున్ బెట్టుచు బిల్చు కృష్ణు; డట గోవిందుండు గోశాలలో
భూరి ప్రేమను రాధ పేరు గల గోవున్ చేరగా జూచి, రా
రా రా ర మ్మని పిల్చె సీత యెలమిన్ రాధాప్రియుం జెచ్చెరన్.

***188. సంసారుల్ గనలేని చింత యెపుడున్ సన్నాసికే సొంతమౌ.***

శా. కంసారిన్ మదినెంచి లౌక్యమమతల్ ఖండింప సన్న్యాసియౌ,
శంసన్ బూని శకుంతలన్ బెనిచె దీక్షన్ కణ్వు, డేణమ్ము్నే
హంసన్ బోలిన మౌనియౌ భరతుడున్ హర్షమ్ముతో బెంచె, నే
సంసారుల్ గనలేని చింత యెపుడున్ సన్న్యాసికే సొంతమౌ.
(శంస=కోరిక, ఏణమ్ము=జింక, హంస= పరమ హంస)

***189. అశ్వత్థామను జంపె నంగదుడు దుష్టాత్ముండునై పోరునన్.***

శా. అశ్వత్థామ యనంగ హస్తి, కురురా జౌ నంగదుం డన్న, దా
శశ్వత్కీర్తుల నంగ రాజ్యమును ప్రాశస్త్యంబుగా నిచ్చుటన్
విశ్వాసింపు మతండు జంపె కరి, నా వృత్తాంతమున్ గాంచుచో
నశ్వత్థామను జంపె నంగదుడు దుష్టాత్ముండునై పోరునన్.

***190. పతి గళ మందు కట్టె నొక భామిని తాళిని మోదమందుచున్.***

చం. చితియె దహింప, నంబ తన చింత దొలంగ, శిఖండి పేరునన్
సుతగ జనించియున్, ద్రుపద సూనుడుగా నిల వృద్ధి చెంది, సు
వ్రతను దశార్ణ రాజ సుత పాణిఁ గ్రహించుచు సాక్షిగా నహ
ర్పతి, గళ మందు గట్టె నొక భామిని తాళిని మోదమందుచున్.

***191. మసి జేసెన్ దన పుష్పబాణములతో మారుండు ముక్కంటినే.***

మ. అసురున్ తారకు జంపగా, శివసుతుం డావశ్యకమ్మంచు, సం
తస మొప్పారగ గౌరి యాశు గొలువన్గా జేరు కాలమ్మునన్,
వెస నున్మాదన, తాపనమ్ములను బంపెన్ శోషణ, స్తంభనా
ల సుసమ్మోహన నామకమ్ముల సుమాలన్ గర్వితుం డౌచు, దా
మసి జేసెన్ దన పుష్పబాణములతో మారుండు ముక్కంటినే.

***192. వాసిగ గౌరి కాత్మజుడు బ్రహ్మ యనంగుడు శౌరి కల్లుడా.***

ఉ. శ్రీసతి పద్మ యౌచు విలసిల్లగ, విష్ణువు శ్రీనివాసుడై
భాసిల, వారి పెండ్లి గన వచ్చిరి దేవత లెల్ల వారిలో
వాసిగ గౌరి కాత్మజుడు, బ్రహ్మ, యనంగుడు, శౌరి కల్లుడౌ
భాసురమూర్తి షణ్ముఖుడు, పార్వతి, శంభుడు, వాణి యక్షతల్
వేసిరి యొక్కసారి కనువిందగురీతి శుభమ్ము పల్కుచున్.

***193. నా నీ పత్నికి కోర్కె దీర్చు మనె హన్మంతుండు కౌంతేయుతోన్.***

శా. చానల్ కోరగ దెచ్చి యిత్తురు విభుల్, సౌగంధికా పుష్పమున్
కానన్ గాంచగ వచ్చినాడవు సతీకార్యార్థివై, సోదరా!
మానీ! వాయుకుమార! భీమ! జయమౌ, మన్నించి నిన్ మెచ్చుకో
నా నీ పత్నికి కోర్కె దీర్చు మనె హన్మంతుండు కౌంతేయుతోన్.

***194. వృషభము వచ్చి నిల్చినది వృశ్చిక పుచ్ఛము మీద చూడగన్.***

చం. వృషభము వంటి వాడగును వీరులలో గన కర్ణు, డెల్లెడన్
విషమతియౌ సుయోధనుడు వృశ్చికతుల్యుడు, సర్వదా స్వయం
కృషి దనరారు కర్ణు డపకీర్తుల నిల్చెను దుష్టమైత్రితో,
వృషభము వచ్చి నిల్చినది వృశ్చిక పుచ్ఛము మీద జూడుమా!

***195. హనుమంతుం డదె లంక కేగి విడిచెన్ హా సోదరా! ప్రాణమున్.***

మ. కన నైతిన్ గద సీత జాడ ఘన లంకాపట్టణ మ్మందు, నే
రను దుర్వార్తను జెప్ప రామున, కిటన్ ప్రాయోపవేశమ్ము జే
సిన మే లౌనని, రామదూత తలచెన్ "శ్రీ రామచంద్రుండు నన్
గనలేమిన్, విలపించు, లక్ష్మణుని వీకన్ గాంచి తా నిట్లనున్
హనుమంతుం డదె లంక కేగి విడిచెన్ హా సోదరా! ప్రాణమున్"

***196. దేవుడు వచ్చినా డిటకు దీవెన లిమ్ము కృపారసమ్మునన్.***

(పార్వతీదేవికి రుక్మిణి విన్నపము)

ఉ. నా వినతిన్ గ్రహింపు ముమ! నాకు హరిం బతి సేయు మమ్మ! నన్
బ్రోవ దలంచినా డతడు, పూజ్యుడు మెచ్చెను నా గుణోన్నతిన్,
పావనమూర్తి రాక్షస వివాహమునం గొనిపోవ గోరి, నా
దేవుడు వచ్చినా డిటకు దీవెన లిమ్ము కృపారసమ్మునన్.

***197. వడియము లెల్ల నెండినవి, వానలవారిత రీతిగా బడన్.***

చం. ఇడుములఁ బెట్టు రావణుని యిచ్ఛ మెలంగుదు రెల్ల దేవతల్,
మడుగుల నొత్తు చుందు, రభిమానము వీడుచు లంకలోపలన్,
వడి వడి నేగుదెంచె నట భానుడు రావణు గొల్వ, నింటిలో
వడియము లెల్ల నెండినవి, వాన లవారిత రీతిగా బడన్.

***198. ద్రౌపది వల్వ లూడ్చె నదె తత్సభలోనఁ గిరీటి నిర్దయన్.***

ఉ. చూపఱు లందఱున్ నటన జూచి భళీ యని మెచ్చుచుండగా,
శ్రీపతి వెల్గెగా, నటకిరీటిగ; నాతడె నేడు చూడగా
పాపిగ దుష్టశాసనుని పాత్ర ధరింపగ, పల్కి రిట్టులన్
ద్రౌపది వల్వ లూడ్చె నదె తత్సభలోనఁ గిరీటి నిర్దయన్

***199. దుగ్ధపయోధి మధ్యమున దుమ్ములు రేగె నదేమి చిత్రమో.***

ఉ. దగ్ధము గాగ వైర, మమృతమ్మును గోరుచు వార్ధి జిల్కగా
స్నిగ్ధమనస్కులై దనుజ నిర్జరు లాశగ జేర, ప్రేక్షకుల్
ముగ్ధులు గాగ, వారిచరముల్ నశియింపగ, పైకి లేచుచున్
దుగ్ధపయోధి మధ్యమున దుమ్ములు రేగె నదేమి చిత్రమో?

(దుమ్ములు = ఎముకలు)

***200. పంచదార తినగ పళ్లు రాలు.***

ఆ.వె. చాల తియ్య ననుచు చక్కెర బొక్కగా,

పుచ్చి పోయె పళ్లు పూర్తిగాను,

వైద్యు డపుడు వాని పళ్లను తొలగించె,

పంచదార తినగ పళ్లు రాలు.

***201. గ్రీష్మము నందు బైట తొలగించియుఁ గోడలు గన్ను గీటెరా.***

ఉ. గ్రీష్మము రాగ, భీము సతి గేహమునన్ వసియింపలేక, తా

సూష్మము సైపలేక, యెద నున్న పటమ్మును దీసె, తాపమే

భీష్మము గాగ, గోరినది వేగమె మామను వాయుదేవునిన్,

గ్రీష్మము నందుఁ బైట దొలగించియుఁ గోడలు; గన్ను గీటెరా

భీష్మబలున్ వృకోదరుని ప్రేమగ చెంతకు బిల్చుచుండెరా.

***202. పతి తల గోసి వండినది బంధువు లెల్ల దినంగ గోరుచున్.***

చం. అతివ వచించె "నీ పెరటి యందలి మొక్కలు గాసె గాయలన్

పతివర! గోసి వండెదను బాగుగ" నంచు నుగాది నాడు, దా

వ్రతమున మౌనదీక్ష నలరారుచు, సమ్మతి దెల్ప నూపగా

పతి తల; గోసి వండినది బంధువుఁ లెల్లఁ దినంగఁ గోరుచున్.

***203. నంద్యాల పురప్రజల్ స్తుతి కనర్హు లవిజ్ఞులు నీతి దూరులున్.***

(ఛందోగోపనము.)

ఉ. జాలి, దయాగుణమ్ము, కృషి, సత్యము, జ్ఞానము, దాన ధర్మముల్,

శీలము, సాధుభావము, విశిష్టత నందిన వారు, సర్వదా

మేలి గుణాల నందఱిని మించెడి వారలు; కారు కారు నం

ద్యాల పుర ప్రజల్ స్తుతి కనర్హు లవిజ్ఞులు నీతిదూరులున్.

***204. రాముడు గోరె రావణుని రమ్మని సీతను దొంగిలింపగన్.***

ఉ. "ఏమనుకొంటివోయి? మద మెక్కినదా? పర దార మాతయౌ
నీ మతి మంద, యుద్ధమున నిన్ను వధించెద" నంచు బల్కుచున్
రాముడు గోరె రావణుని రమ్మని; సీతను దొంగిలింపగన్
క్షేమము గల్గునా? మరణ శిక్ష లభించు, నశించు యోగముల్.

***205. చెడు వానిన్ గొలువంగఁ గామ్యములు నక్షీణంబుగాఁ దీరులే.***

మ. చెడు బుద్ధిన్ దొలగించువాని, జగమున్ సృష్టించి లీలన్ ధరిం
చెడువానిన్, లయకారకున్, సుగతులన్ చేకూర్చి భద్రమ్ము లి
చ్చెడువానిన్, పరమేశ్వరున్, వరదునిన్, చింతింపగా మోక్ష మి
చ్చెడువానిన్ గొలువంగఁ, గామ్యములు నక్షీణంబుగాఁ దీరులే.

***206. సరసం బాడుట చేతకాదు గద కృష్ణా ! గోపికావల్లభా!***

మ. దరహాసమ్మున బల్కరించి, కథలన్ తాదాత్మ్యమున్ గూర్చి, సుం
దర రూపమ్మును జూపి, వేణు సరళిన్ ధన్యాత్ములన్ జేసి, యం
దరి చిత్తమ్ముల గెల్చుచుందువు యశోదానందనా! నీ వలెన్
సరసం బాడుట చేతకాదు గద కృష్ణా గోపికావల్లభా!

***207. రణ మొనరింపకున్న కవిరాజు పరాభవ మందు నెల్లెడన్.***

చం. అణకువ తోడ, కైపదము నద్భుత భావము తోడ, హృద్యమౌ
గుణముల తోడ, రమ్య పద గుంభన తోడ, విశుద్ధ కావ్య ల
క్షణముల తోడ, దివ్యమగు కైతల తోడ, హితమ్ము తోడ, పూ
రణ మొనరింపకున్న కవిరాజు పరాభవ మందు నెల్లెడన్.

***208. మునికిన్ నేర్పగనొప్పు రాజవదనా! మోహంపు బుద్ధుల్ దమిన్.***

మ. ''కన దెన్నండును ఋష్యశృంగముని లోకమ్మున్, విభూ! యెట్లు వ
చ్చునొ? నాథా!'' యన రోమపాదు డనియెన్ ''శోభిల్లు శృంగార మో
హినులన్ వేశ్యలఁ బంపెదన్ గనుము నీవే, నేర్పునన్ వారలా
మునికిన్ నేర్పఁగ నొప్పు రాజవదనా! మోహంపు బుద్ధుల్ దమిన్''

***209. కాంతకు మ్రొక్కినం గలుగుఁ గామిత సంపద లెల్ల శీఘ్రమే.***

ఉ. చింతల దీర్చు, దేహమును జీల్చెడి రైతుల క్షేమ మెంచు, వి
భ్రాంతిగ నిచ్చు గర్భజలరాసుల రంధ్రము వేయ, తల్లియై
పొంతముతో మెలంగు మల మూత్ర విసర్జన జేయఁ, గాన భూ
కాంతకు మ్రొక్కినం గలుగుఁ గామిత సంపద లెల్ల శీఘ్రమే.

***210. పూల ధరింప నిష్టపడు ముగ్ధలు లోకమునందు నుందురే?***

ఉ. పూలపయిన్ మదిన్ గరుణ పొంగగ, పాపయ శాస్త్రి గారు 'జం
ధ్యాల' రచించినారు కడు నార్ద్రత 'పుష్పవిలాప' కావ్యమున్,
జాలి జనింప పద్యముల జక్కగ బాడెను ఘంటసాల ''యే
పూలను కోయవద్దనుచు, పుష్పము లేడ్చు నటంచు''; విన్నచో
పూల ధరింప నిష్టపడు ముగ్ధలు లోకమునందు నుందురే?

***211. రంభన్ గూడి శకుంతలన్ గనియె నా రాజర్షి సంరంభియై.***

శా. స్తంభించెన్ తపియించె లోకములు విశ్వామిత్రుచే, సత్క్రియా
రంభా! మేనక! వాని జేయుము తపోభ్రష్టాత్ము, మోహక్రియా
రంభా! యంచు పురందరుం డనగ; చేరన్ జూచి నాట్యక్రియా
రంభన్ గూడి శకుంతలన్ గనియె నా రాజర్షి సంరంభియై.

***212. తారానాథుని భీతితో నణువు మధ్యన్ దాగె సంద్రంబు సూ.***

(వాల్మీకి మహర్షి సీతతో...)

శా. శ్రీ రామున్ వలె నుండు రాజు లిల నేరీ? యేక పత్నీవ్రతుం,
డా రాజాగ్రణి, యశ్వమేధమును జేయన్ స్వర్ణ సీతన్ గొనెన్,
ధీరుం, డందఱి నాథు, డాతని విభూతిన్ దెల్పెదన్ నీకు సీ
తా! రా నాథుని భీతితో నణువు మధ్యన్ దాగె సంద్రంబు సూ.

***213. మోదము నందరే ప్రజలు మూర్ఖు డొకండు నృపాలు డైనచో.***

ఉ. వాదము లేక, యెన్నడును స్వార్థము లేక, భయమ్ము లేక, యే
ఖేదము నందబోక, యపకీర్తిని బొందక, రామరాజ్యమే
మోదము గూర్చు నిత్య మని పూజ్యులు పల్కగ, రాము డేలెగా,
మోదము నంద రే ప్రజలు మూర్ఖు డొకండు నృపాలు డైనచో.

(మోదము నందరు + ఏ ప్రజలు)

**(రెండవ పూరణ)**

ఉ. వాదముతో, శకారు డిల స్వార్థముతో, కడు దుష్ట బుద్ధితో,
ఖేదముతో, సతమ్ము నపకీర్తులతో, ఘన మూర్ఖ రాజుగా,
వేదన గూర్చెగా ప్రజకు, వింతగ పాలన జేసి ; యెన్నడున్
మోదము నంద రే ప్రజలు మూర్ఖు డొకండు నృపాలు డైనచోన్.

***214. శ్రీ రాముండు త్రినేత్రు జంపెను గదా సీతమ్మకుం బుత్రుడై.***

శా. కారుణ్యమ్మున బ్రోచె శిష్టులను, వీకన్ దుష్టులన్ ద్రుంచెగా,
ఆ రామేశ్వర మందు శ్రద్ధగను తా నర్చించె దేవేశునిన్
శ్రీ రాముండు త్రినేత్రు; జంపెను గదా సీతమ్మకుం బుత్రుడై
వీరుండై కుశు డట్లె దుర్జయుని పృథ్వీన్ దుష్టు, రక్షించెగా
ధీరుండై బుధ రాశి, నింద్రు కొలిచెన్ దేవేశు,రామాంశయై.

**215. శివపుత్రుండు మఱంది గాడె హరికిన్ శ్రీకాంతకున్ పౌత్రుడౌ.**

మ. అవలోకింపుడు సిద్ధిబుద్ధులము మీకై వచ్చియున్నార మీ
యవనిన్ మా పతిదేవుడీ గజముఖుం డౌ, షణ్ముఖుండైన యా
శివపుత్రుండు మఱంది గాడె, హరికిన్ శ్రీకాంతకున్ పౌత్రుడౌ
నవునా యా యనిరుద్ధు డచ్చట గలం డర్చింపుడీ భక్తితో.

**216. కలుషమతుల్ దురాత్ముల కకారణ మిత్రులు గారె సత్కవుల్.**

చం. పలువల ప్రేమతో గనుచు బల్కరె సత్కవు లెల్ల మిత్రతన్
''కలుషిత బుద్ధి వీడుడు, సుఖమ్ముల గాంచుడు, సాధుమూర్తులన్
గలసి భజించి పుణ్య మిడు కార్యమె చేయు డహర్నిశల్ ధరన్,
దెలియు డనిత్య నిత్యముల ధీరత'' నంచు; దలంప కారుగా
కలుషమతుల్; దురాత్ముల కకారణ మిత్రులు గారె సత్కవుల్.

**217. పొలమును దున్నినంత సుత పుట్టుట యెట్టుల సాధ్య మమ్మరో?**

చం. తలపగ నర్మగర్భముగ తా ననె భూసుత సీత ''నాథుడా!
తెలుపుము నాకు, పాయసము దిన్న సుతోత్తము లీ యయోధ్యలో
కలుగుట సాధ్యమా?'' యనుచు; కాంతుడు రాముడు ప్రశ్న వేసె ''మీ
పొలమును దున్నినంత సుత పుట్టుట యెట్టుల సాధ్య మమ్మరో?''

**218. కౌపీనము దాల్చువాడె కద సంపన్నుండు దర్కించినన్.**

(ఛందోగోపనము)

మ. వినుడీ శంకరు బోధ, నేడె గనుడీ, వేదాంత వాక్యమ్ములన్
గని లోలో రమియించువాడె, సముడే, కారుణ్య చిత్తుండె, భి
క్షను సంతృప్తి భుజించువాడె, సుతరుచ్ఛాయాశ్రితుండే, ఘన
మ్మని కౌపీనము దాల్చువాఁడె కద సంపన్నుండు దర్కించినన్.

**219. తల్లికి దాళి గట్టిన సుదారుని దాశరథిం దలంచెదన్.**

ఉ. ఎల్ల జగాల గాచు, కరుణించుచు భక్తుల బ్రోచు, లక్ష్మి తా
నెల్లలు లేని ప్రేమ పతి నెంచు పతివ్రత యౌచు, పృథ్వి రా
జిల్లుచు వచ్చె భూసుతగ సీతగ, నామెయె లోకమాత, యా
తల్లికి దాళి గట్టిన యుదారుని దాశరథిం దలంచెదన్.

**220. సతి సతి క్రీడ సల్ప మగ సంతు జనించెను మెచ్చి రెల్లరున్.**

చం. 'సతి' మరణించె, శంభునికి సంతు జనించిన జచ్చు తారకుం,
డితరులచేత జావదని యెంచి, సదాశివ పార్వతుల్ సదా
గతి యని పుష్ప బాణముల కాముడు వేసె, శివుండు పార్వతీ
సతి "సతి" క్రీడ సల్ప మగ సంతు జనించెను, మెచ్చి రెల్లరున్.

**221. మ్రొక్కె బతివ్రతాసుతుఁడు పూజ్యులు తండ్రుల కెల్ల భక్తితోన్.**

ఉ. చక్కగ నన్నదాత, యనిశమ్ము భయమ్మును ద్రుంచు త్రాతయున్,
జిక్కుల దీర్చి విద్యనిడు జీవనదాతయు, జన్మదాతయున్,
నిక్కము మంత్రదాత యుపనేతయు దండ్రులు; సవ్యసాచి తా
మ్రొక్కెఁ బతివ్రతాసుతుఁడు పూజ్యులు తండ్రుల కెల్ల భక్తితోన్.

**222. హానిం జేయని యాత డెవ్విధిని తా నాచార్యుడై యొప్పునో?**

శా. జ్ఞానాఖ్యాంజన వర్తి చేత గురు డజ్ఞానాంధకారమ్మునన్
గానంజాలని వాని కండ్లు తెఱచున్, గైవల్య సంధాయియై
యానందమ్మును గూర్చు; నిట్లు సతతం బజ్ఞాన వారాశికిన్
హానిం జేయని యాత డెవ్విధిని తా నాచార్యుడై యొప్పునో?

**223. నాలుగు రెండు నయ్యె నట నల్లనివాని కదేమి చిత్రమో?**

ఉ. హేలగ బెండ్లియాడి రట కృష్ణుని రుక్మిణి, సత్యభామయున్,
లాలిత లౌచు జాంబవతి, లక్షణ, భద్రయు, మిత్రవిందయున్;
లీలగ తాను నాగ్నజితి, ప్రీతిగ నెన్నగ సూర్యపుత్రియున్
వైళమ బల్కె నొక్కతె వివాహములన్ గణియించి, రెండగున్
నాలుగు, రెండు, నయ్యె నట నల్లనివాని కదేమి చిత్రమో?

**224. చీకటి లోపలన్ వెదుకఁ జిక్కును వస్తుచయమ్ము దప్పకన్.**

ఉ. చేకురు భక్తవర్యులకు శ్రీకర వస్తు చయమ్ము, భక్తితో
నా కమలాక్షు శ్రీ హరిని యాశ్రితపాలకునే స్మరింపు డీ
పోక నెఱుంగుడీ, తొలగి పోవును బాహ్య జగద్విమోహమన్
చీకటి; లోపలన్ వెదుకఁ జిక్కును వస్తుచయంబు దప్పకన్.

**225. ధవుని దురూహలే సుతు నధర్మపుఁ జావుకు మూలమయ్యెడిన్.**

(గాంధారి స్వగతము)

చం. అవగుణు డౌచు ద్రౌపదిని నంకము జేరగ బిల్చుచుండి, యీ
యవనిని నేనె యేలగలనన్న సుయోధను బ్రోత్సహించె గౌ
రవ శత పక్షపాతి ధృతరాష్ట్ర డధర్మపథావలంబి నా
ధవుని దురూహలే సుతు నధర్మపుఁ జావుకు మూలమయ్యెడిన్.

**226. దేహమ్మున్ విడనాడి చూడుము సఖా! ధీరత్వ మేపారగన్.**

శా. ఊహాతీతము నా మహత్తు గనుమా! ఉత్సాహమున్ బొందుమా!
స్నేహమ్మున్ స్వజనమ్ముపై విడువుమా! ఛేదించుమా మాయ, నే
నాహా యంచన ధర్మయుద్ధమును జేయం బూనుమా! పార్థ! సం
దేహమ్మున్ విడనాడి చూడుము సఖా! ధీరత్వ మేపారగన్.

***227. భీతిని ముందుకేగిననె ప్రీతి జగద్విజయమ్ము దక్కురా.***

ఉ. చేతము పొంగగా జిజియ చెప్పె శివాజికి "వీరపుత్రుడా!
ఆతత ధైర్య సాహస గుణాదులతోడ పురోగమింపుమా!
ఖ్యాతియు వచ్చు, నిత్యము జయమ్ము లభించు, వరించు లక్ష్మి, ని
ర్భీతిని ముందుకేగిననె ప్రీతి జగద్విజయమ్ము దక్కురా"

***228. కరణము వద్దు మా కనెడు కాలము వచ్చె నిదేమి వింతయో?***

చం. స్వర యుత వేదమాత కిల వర్ధిలు ఛందము పాదయుగ్మమౌ,
నరయగ కల్పమౌను వర హస్తయుగమ్ముగ, జ్యోతిషమ్ము నే
త్రరమ, నిరుక్తమౌ జెవులు, ఘ్రాణము శిక్ష, ముఖమ్ము దెల్ప వ్యా
కరణ మిటుల్ షడంగముల గాంచుచు నేర్తురు నాడు; నేడు వ్యా
కరణము వద్దు మాకనెడు కాలము వచ్చె నిదేమి వింతయో ?

***229. శవమున్ గాల్చెద రాలయమ్మున బ్రజా సంక్షేమమున్ గోరుచున్.***

మ. దివిజుల్ మెచ్చగ జీవి దేవు డనుచున్, దేహమ్మె దేవాలయ
మ్మవు నంచున్, త్యజియించుచుందు రిల తా మజ్ఞాన నిర్మాల్యమున్
కవులై సోఽహమటంచు రాచతపసుల్; కామాదులన్ వారు కే
శవ! మున్ గాల్చెద రాలయమ్మున బ్రజా సంక్షేమమున్ గోరుచున్.

***230. చల్లదనంబు నిచ్చెను కృశానుడు వేసవి మండుటెండలన్.***

ఉ. చల్లను జిల్కుచుండి యొక సాధ్వి, సుతుం డదె వంటయింటిలో
నల్లన ప్రాకి యగ్ని బడ, నగ్నినె వేడెను గాని, వెంటనే
వల్లభు లేపలేదు, పతిభక్తికి మెచ్చుచు చిన్ని బిడ్డకున్
చల్లదనంబు నిచ్చెను కృశానుడు వేసవి మండుటెండలన్.

**231. కోబ్రా తెమ్మని కోరె భార్య మగనిన్ కోర్కెల్ పిసాళింపగన్.**

శా. కోబ్రా కోరలలోన నున్న విషమే కొంగ్రొత్త కామౌషధ
మ్మౌ బ్రాయమ్మును బెంచు నందు, రిక బ్రహ్మానందమున్ పొందగా,
లే బ్రాయమ్మిది ధన్యతన్ గనగ, సంప్రీతిన్ బ్రయత్నించుచున్
కోబ్రా తెమ్మని కోరె భార్య మగనిన్ కోర్కెల్ పిసాళింపఁగన్.

**232. చర్చికి సంధ్య వార్చుటకు సాయబు పోయెను సత్వరమ్ముగన్.**

ఉ. చర్చలు మాని భక్తిమెయి సాగిరి వేగమ యేసుదాసు, తా
నర్చన జేయు వేళ యిది యంచును బ్రాహ్మణుడున్ గ్రమమ్ముగా
చర్చికి, సంధ్య వార్చుటకు; సాయబు పోయెను సత్వరమ్ముగన్
కూర్చును మేలటంచు సమకూరిన భక్తి మసీదు లోనికిన్.

(రెండవ పూరణ – ప్రశ్నోత్తరవిధానం)

ఉ. అర్చనజేయ నెచ్చటకు హాయిగ వెళ్లను క్రైస్తవుండు? తా
నర్చనవేళ బ్రాహ్మణులు నౌచితి దేనికి సిద్ధమౌదురో?
యర్చనకై మసీదుకు సమంచితరీతి నెవండు పోయెనో?
చర్చికి; సంధ్య వార్చుటకు; సాయబు పోయెను సత్వరమ్ముగన్.

**233. గజమునకున్ జనించి యొక గాడిద గంతులు వేసె నెల్లెడన్.**

చం. భుజ బలమందు నా సగర భూపతి యెన్న గజేంద్రుడై యయో
ధ్య జనుల నేలె, కేశికిని తాను వరింపగ నౌర్వు వాక్కులన్
కుజను డొకండు పుట్టి పసికూనల జంపెను నీట ముంచుచున్
గజమునకున్ జనించి యొక గాడిద గంతులు వేసె నెల్లెడన్.

**234. అమవస రోజు పూర్ణశశి యబ్బురమై కనుపించె నింగిపై.**

చం. సుమతుల సాధువాక్యములు శోభిలు నర్థము వెంట నంటి, వి
భ్రమ మిడి దివ్యులౌ ఋషుల వాక్కుల నర్థము వెంబడించెడిన్,
ప్రవిమల కాళిదాస కవి వాక్కుల సత్యము జేయ, కాళియే
విమలమనస్కయై విసరి వేసెను ముక్కెర నింగిలోన, నీ
యమవస రోజు పూర్ణశశి యబ్బురమై కనిపించు నింగిపై.

**235. మలము గనంగ ముక్తి కదె మార్గము జూపును భక్తకోటికిన్.**

చం. ఇల ఘన కష్ట మందుచు గజేంద్రుడు ద్రౌపది కుంతి యోర్పుతో
నలఘు పరీక్షిదాదులు మహాదశ నందిరి దైవభక్తులై,
సులభము భక్తిమార్గమని సూచన జేసిరి, వారివోలె ను
మ్మలము గనంగ ముక్తి కదె మార్గము జూపును భక్తకోటికిన్.
(ఉమ్మలము = కష్టము)

**236. నాగుల ముద్దులాడె లలనామణి యాత్మ వినోద కేళికై.**

ఉ. "ఏ గతి నశ్వపుచ్ఛ మగుపించును నల్లగ, నా సపత్నిపై
సాగును నాదు మాట యనిశ?" మ్మని కద్రువ నాగమాతయే
మూగిన బిడ్డలన్ గనుచు మోసము నేర్పుచు బుజ్జగించుచున్
నాగుల ముద్దులాడె లలనామణి యాత్మ వినోద కేళికై.

**237. నరు డయి జన్మ నెత్తె కరుణారహితుండయి ఫాలనేత్రుడే.**

చం. నరు డయి జన్మ నెత్తు కరుణాసహితుండగు విష్ణుమూర్తి, శ్రీ
హరికిని తోడు గావలయు నా ఖలు రావణు కామశీలునిన్
వర బల గర్వితున్ గెలువ, వైరి బలమ్మును గూల్తు నంచు వా
నరు డయి జన్మ నెత్తె కరుణారహితుండగు ఫాలనేత్రుడే.

**238. దూరముగా జరింపకుడు ధూర్తుల కుత్తములం ద్యజింపుడీ.**

ఉ. "దూరముగా జరింపు డిల దుర్జన సంగతికిన్, భజింపగన్
జేరుడు సాధుసంతతిని, జేయుడు పుణ్యములన్, స్మరింపుడీ
మీర లనిత్యనిత్యముల మేలగు" నంచు వచింపకుండ, దే
వారియు రాక్షసుండును దురాత్ముడు బోధ నొనర్చె నిట్టులన్
"దూరముగా జరింపకుడు ధూర్తుల కుత్తములం ద్యజింపుడీ"

(రెండవ పూరణ)

ఉ. చేరుచునుందు రుత్తములు శీఘ్రముగా మిము ధర్మవర్తులై,
దూరముగా జరించెదరు ధూర్తు లధర్మ పథానువర్తులై,
కూరిమి దుష్టులన్ గనగ గోరుచు దేవతలార! సర్వదా
దూరముగా జరింపకుడు ధూర్తుల కుత్తములం ద్యజింపుడీ.

**239. నన్నయ తిక్కనాదులె ఘనంబని మెచ్చిరి నా కవిత్వమున్.**

ఉ. మున్నిటు పల్కె వ్యాసముని పూజ్య సుధర్మ సభన్ "మహత్త్వ సం
పన్నతఁ దెల్గులోన ననువాదము జేయుచు వేద సార సం
పన్నము నాదు భారతమె పంచమ వేద మటంచు భక్తితో
నన్నయ తిక్కనాదులె ఘనంబని మెచ్చిరి నా కవిత్వమున్"

(రెండవ పూరణ)

ఉ. నన్ను నుతించినా రపర నన్నయ కీర్తిని గన్నవారు, ర
క్తి న్నుతి గూర్చినా రపర తిక్కన పేరున వెల్గువార లే
మన్నను శంకరాభరణ మందలి యాధునికుల్ ప్రసిద్ధులౌ
నన్నయ తిక్కనాదులె ఘనంబని మెచ్చిరి నా కవిత్వమున్.

**240. మండూకోదరమందు మానవుడు జన్మం బందె జిత్రమ్ముగన్.**

శా. రండీ! చూడగ నింద్రజాలమును, మీ రాశ్చర్యముం బొంది, మా
కిండీ తోచిన రీతిగా ధనము, మీ రీయంగ జీవింతు మే
మండీ! యబ్రకదబ్ర!" యంచనుచు జేయన్ గారడిన్, జూడగా
మండూకోదరమందు మానవుడు జన్మం బందె జిత్రమ్ముగన్.

**(రెండవ పూరణ)**

(పరీక్షిత్తు 'సుశోధన' అనే మండూక రాకుమారిని వివాహమాడినాడు. వారికి శలుడు, దలుడు, వలుడు అని ముగ్గురు కుమారులు)

శా. మండూక ప్రభు పుత్రి గర్వపడ ప్రేమన్ శ్రీ పరీక్షిత్తు "హే
మండూకాంగన! మోహ మందితి" ననెన్ మన్నించె నా నారియున్,
పండెన్ పుత్రుల పంట వారలకు దాంపత్యమ్ము వర్ధిల్లగా,
మండూకోదరమందు మానవుడు జన్మంబందె జిత్రమ్ముగన్.

**(మూడవ పూరణ)**

శా. మండూకాఖ్య మహర్షి చెప్పె "నయ మాత్మా బ్రహ్మ" యన్ వాక్యమున్
మాండూక్యోపనిషత్తు పేర, గణియింపన్ జ్ఞానపుత్రుండుగా
నుండెన్ మౌనికి మానవుం డొకడు సద్వ్యుత్పత్తితో, జూడగా
మండూకోదరమందు మానవుడు జన్మంబందె జిత్రమ్ముగన్.

**241. పితృవాక్పాలన మొక్కటే సుతుని బాపిన్ జేయు నెల్లప్పుడున్.**

మ. పితృవాక్పాలన గాన కేగి మనియెన్ విఖ్యాతి నా రాముడే,
పితృవాక్పాలన కీర్తి దల్లి నదె చంపెన్ జామదగ్న్యుండు, దా
పితృవాక్పాలన కండుడన్ మునియె చంపెన్ ధేనువున్ గీర్తులన్,
పితృవాక్పాల మొక్క టే సుతుని బాపిన్ జేయు నెల్లప్పుడున్?

***242. అందియు నందరాని దగు నందమె విందొసగున్ గదా సఖా!***

ఉ. అందము ఘూర్జరీ స్తనము లట్లు నిగూఢము గాక, పూర్తిగా
నందము నారబోయు ద్రవిడాంగన సుస్తన రీతి గాక, మా
కంద లతాంతరస్థమగు కాయ వలెన్ గనిపించనట్లుగా
ముందుగ గొంత కన్పడెడి ముగ్ధతరాంధ్ర వధూటి సుస్తనం
బంద; మిటుల్ గనన్ మెఱుపు నౌచు దళుక్కున దోచు కైత దా
నందియు నందరాని దగు నందమె విందొసగున్ గదా సఖా!

***243. ఖ్యాతిని గన్న వీరు డెవడన్నపు డుత్తరునే దలంచెదన్.***

(సంజయుడు ధృతరాష్ట్రునకు కురుక్షేత్ర విశేషములను చెప్పుట)

ఉ. ఈతడు పార్థసారథి మహిన్ ధృతరాష్ట్ర! సుబోధ జేయుదున్
ఖ్యాతిని గన్న దైవ మగు గాంచ రథమ్మున వెల్గు పూర్వుడౌ
నాతడు సూడ గాండివము నందిన యర్జును డుత్తరుం డగున్
ఖ్యాతిని గన్న వీరు డెవడన్నపు డుత్తరునే దలంచెదన్.

(పూర్వుడు = ముందున్నవాడు; ఉత్తరుడు = వెనుక నున్నవాడు)

***244. దీపము ముద్దిడన్ మదవతీ సుఖమబ్బు వియోగవేళలన్.***

(విరహార్త యగు రాధతో చెలికత్తె పలుకులు)

ఉ. "శ్రీపతి దివ్యవిగ్రహము శ్రీకర రూపము సుందరమ్ము సం
తాప మడంచు సాధనము ధాత్రి విరాజిలు కల్పవృక్షమున్
శ్రీపద మిద్ది శోకమను చీకటి దూరము సేయునట్టిదౌ
దీపము, ముద్దిడన్ మదవతీ! సుఖమబ్బు వియోగవేళలన్"

**245. ఎలుక వధించె నేనుగు నహీనబలంబున విక్రమించుచున్.**

చం. పిలిచెద రెల్ల హిందువులు వీర శివాజి యటంచు భక్తులై
యిలను శివాజి వ్యక్తి యని యెంచితి మీతడు శక్తి యౌచు దా
నలయక కోటలన్ గెలిచె, నఫ్జలుఖానును జంపె గోళ్ల జి
ట్టెలుక వధించె నేనుగు నహీనబలంబున విక్రమించుచున్.

**246. అయ్యయ్యో కడుపయ్యె నేమి కవినాథా నీకు జిత్రంబుగన్.**

శా. అయ్యారే సురమాయ! యీ కచుడు తా నందంగ సంజీవనిన్
నెయ్యం మ్మొప్పగ వచ్చి భస్మ మగుచు న్నిల్వంగ మత్కుక్షి న
క్షయ్యుం డయ్యె ననంగ శుక్రు గని రక్షస్సంఘమే పల్కె నే
"డయ్యయ్యో కడుపయ్యె నేమి కవినాథా! నీకు జిత్రంబుగన్?"

**247. అర్చన జేసె రాత్రి సమయమ్మున భక్తుడు సూర్యబింబమున్.**

ఉ. అర్చకు డన్నయట్లు కమలాప్తుని గూర్చి స్వదేశవాసినై
యర్చన జేయ నా సుతుడు నత్తఱి నిత్య ప్రసారమందు నే
గూర్చిన వీడియో గనుచు గొల్చెను బ్రధ్ను విదేశవాసియై
యర్చన జేసె రాత్రి సమయమ్మున భక్తుడు సూర్యబింబమున్.

**248. రాయలు కేల దాల్చె జెలి రమ్యపదమ్ముల నూపురమ్ములన్.**

ఉ. రాయలు సాహితీప్రియుడు, రాయలు సజ్జను, డాంధ్రభోజుడున్,
రాయలు ధర్మపాలకుడు, రాయ లహో కవిపోషకుం డిలన్,
రాయలు రాయలే; రసికరాజుగ నాట్యము నేర్చు వేళలన్
రాయలు కేల దాల్చె జెలి రమ్యపదమ్ముల నూపురమ్ములన్.

***249. శునకమ్మయ్యెను విష్ణుదేవుడు సురస్తోమంబు గీర్తింపగన్.***

మ. "చనునే యీ త్రిపురాసురుల్ బ్రతుకగా? సంహారముం జేతు వీ
రిని నేనే" యని పల్కగా శివుడు, కూర్మిన్ సాయ మందించ స్యం
దన మయ్యెన్ గద భూమి, సారథిగ తానయ్యెన్ గదా బ్రహ్మ, యీ
శున కమ్మయ్యెను విష్ణుదేవుడు సురస్తోమంబు గీర్తింపగన్.

**రెండవ పూరణ...**

మ. అనిలో గెల్వగ లేక, లీల విజయ మ్మాశించుచున్, నేరుగా
దునుమం జాలక తారకాక్షు ఖలు, విద్యున్మాలి యన్ నీచు, దై
త్యుని దుష్టున్ గమలాక్షు; నేర్పు మెయి తా యోచించి యోచించి యీ
శున కమ్మయ్యెను విష్ణుదేవుడు సురస్తోమంబు గీర్తింపగన్.

***250. రక్తము ద్రాగెదన్ జెలియ! రమ్మని పిల్చె బ్రియుండు ప్రేమతో.***

ఉ. యుక్తమె రోదనల్ సలుప యోధులు భర్తలు గాంచుచుండ? నీ
నక్తమె కీచకున్ దునుమ నర్తనశాలకు బిల్వుమా ప్రియా
యుక్తిగ, భీమశక్తిని మహోగ్రత జూపి వధింతు నేనె, త
ద్రక్తము ద్రాగెదన్ జెలియ! రమ్మని పిల్చె బ్రియుండు ప్రేమతో.

(నక్తము = రాత్రి)

***251. చంద్రునిలోని లేడి తినసాగెను ధారుణిపై దృణంబులన్.***

ఉ. ఇంద్రసుతుండు చాపమున నేయగ వ్రాలె మృగాంకమౌళి, తా
నింద్రుడె యైన నోడిన గణింపక గడ్డిని మేయు గాన, నా
చంద్రుని మౌళి దాల్చు పతి శర్వుడె యోడె నటంచు, వెంటనే
చంద్రునిలోని లేడి తినసాగెను ధారుణిపై దృణంబులన్.

**252. పుంస్త్వము లేని భర్త యవు బో కొమరున్ సతి గాంచె నెట్లొకో?**

ఉ. పుంస్త్వము నంది యుద్ధమున బోరుచు వచ్చెను నేడు; నాడు తా
పుంస్త్వము లేనివా డితడె పో రణతిక్కన వెన్ను జూపె, నీ
పుంస్త్వవిహీను జూచుచు నపూర్వముగా సతి దూటె నత్తటిన్
పుంస్త్వము లేని భర్త యవు బో కొమరున్ సతి గాంచె నెట్లొకో?

(ఛందో వైవిధ్యము)

కం. సుమతిన్ గైకొనె దత్తత
విమలు నొకని పెంచుకొనగ విజ్ఞతతో, పుం
స్త్వము లేని భర్త యవు బో
కొమరున్ సతి గాంచె నెట్లొకో శుభమయ్యెన్.

**253. రతియే మూలము సర్వధర్మముల సంరక్షింప లోకమ్మునన్.**

మ. హిత భావోన్నత ధారణాశుమతి బ్రాహ్మీరూప సత్కీర్తి యా
తత లీలారతి శ్రీ సరస్వతి మహా తత్త్వాంత సజ్జ్యోతియున్
సతమున్ సద్గతి మాతృమూర్తి యగు, నా సంగీత సాహిత్య భా
రతియే మూలము సర్వధర్మముల సంరక్షింప లోకమ్మునన్.

**254. అభవు ముఖంబు జూడదట యద్రితనూజ తపోనిమగ్నతన్.**

చం. శుభమిదు చంద్రశేఖరుని జూడగ నెంతురు భక్తి నందఱున్
శుభముల నంద; భాద్రపద శుద్ధ చతుర్థి గణించి చంద్రునిన్
విభుని శిరమ్మునన్ గనిన వింతగ నిందలు వచ్చునంచు తా
నభవు ముఖంబు జూడదట యద్రితనూజ తపోనిమగ్నతన్.

***255. కనకకశిపు పూజయే జగమ్ము బ్రోచు నెప్పుడున్.***

(ప్రహ్లాదుడు గురుకులమందలి బాలురతో...)

ఉత్సాహ. వినుడు మీరు బాలులార! విష్ణువున్ స్మరింపుడీ
కనుడు విష్ణుమూర్తియే జగమ్ము బ్రోచు నెంచుడీ
చెనటి మాట నిచటి గురులు చెప్పుచుందు రిట్టులన్
"గనకకశిపు పూజయే జగమ్ము బ్రోచు నెప్పుడున్".

***256. కరినిం జంపియు నక్రముం గరుణతో గాచెన్ ముకుందుం డొగిన్***

మ. ఉరు శాపమ్మున నక్రరూపమున హూహూ నామ గంధర్వుడే
సరసిం బట్టె గజేంద్రు, జక్రమున నా శాపమ్మునే త్రుంచె శ్రీ
హరి, కాచుం గద దైవ మందఱిని స్నేహమ్మొప్ప, జూపించెగా
కరినిం; జంపియు నక్రముం గరుణతో గాచెన్ ముకుందుం డొగిన్.

***257. హర్మ్యంబందున నీదులాడె నవె మత్స్యంబుల్ గనన్ వింతయే.***

శా. ధర్మ్యంబౌ పితృదత్తమైన తటి నుద్వాహంబు నా బాటయున్
భర్మ్యంబౌ నను మత్స్యగంధియు, దలంపన్ మత్స్యరా జిట్లు సా
ధర్మ్యం బొప్పగ నుందు రీ యమునలో, దద్గేహసీమన్ నదీ
హర్మ్యంబందున నీదులాడె నవె మత్స్యంబుల్ గనన్ వింతయే.

***258. జారులు ప్రస్తుతింప హరి శైలజ గూడె సురాళి మేలుకై.***

ఉ. ధీర! సహోదరీ! విజయ! దేవకి లోపల శేషతేజమై
చేరితి, నాదు తేజమును శీఘ్రమె కైకొని రోహిణీసతిన్
జేరుచు, నామె కుక్షి నను జేర్చు మటంచు వచింప బిల్చె; పూ
జారులు ప్రస్తుతింప హరి శైలజ గూడె సురాళి మేలుకై.

***259. తనయను జెల్లెలిన్ హరుడు దారలుగా గ్రహియించె జూడుమా.***

చం. తన యనుకంపతో ప్రజల ధన్యుల జేయును మాత, నాదు చిం
తన, యనుమాన మెందుల కుదారలు వీరె యటంచు నాచికే
తనయను డా త్రిమాతలను ధన్యత జూపెను, వాణి మేనకా
తనయను జెల్లెలిన్ హరు డుదారలుగా గ్రహియించె జూడుమా.

***260. ద్రౌపది సీత లిద్ద ఱొక తండ్రికి బుట్టిన బిడ్డలే కదా!***

ఉ. ద్రౌపది సీత లిద్దఱు సతమ్ము నయోనిజ లన్న పేరునన్
దోప, 'నయోని' యన్నదియె తోచెను వారల తండ్రి పేరుగా,
జ్ఞాపకశక్తి పోయినది జ్ఞానము కొంత నశించె, చెప్పుమా
ద్రౌపది సీత లిద్ద ఱొక తండ్రికి బుట్టిన బిడ్డలే కదా!

***261. పద్యము రాదనెన్ గరికిపాటికి గోపము హద్దు మీఱగన్.***

ఉ. పద్యము ప్రాణమౌ గరికిపాటి నృసింహుడు కాకినాడలో
పద్యము నేర్పె పిల్లలకు, పద్య పరీక్షలలోన నందఱున్
పద్యము వ్రాయుచుండ నొక బాలుడు వ్రాయగ లేక "నాకు నే
పద్యము రా" దనెన్ గరికిపాటికి గోపము హద్దు మీఱగన్.

***262. వాల్మీకికి రాజమండ్రి వాసమ్ము గదా***

(రాజమండ్రి సందర్శకులతో గైడ్ అత్యుక్తి)

కం. పల్మాఱు రామ యనుచున్
కల్మష మది లేక యాదికవి యయ్యె నిటన్
వల్మీకభవుడు మెలగెను
వాల్మీకికి రాజమండ్రి వాసమ్ము గదా!

***263. శుకయోగీంద్రున కల్లు డయ్యె గద భీష్మం డంద ఱుప్పొంగగన్.***

మ. సుకమున్ బొందగ పామరుం డడిగెడిన్ శుద్ధాత్ముడై మ్రొక్కుచున్
శుకయోగీంద్రున; "కల్లు డయ్యె గద భీష్మం డంద ఱుప్పొంగగన్
సుకృపాశీలికి హోత్రవాహనునికిన్, శోభిల్లె గాశీపురం
బకటా! తెల్పుము పెండ్లి ముచ్చటల మా కందింపుమా చెచ్చెరన్".

***264. ఎక్కడ దిక్కు లేదు మఱి యిప్పుడొ యక్క! మగండె దిక్కగున్.***

(భర్తను విడువవలె ననుకొను మహిళ కామె చెల్లెలి యుపదేశము)

ఉ. "నిక్కము తల్లి దండ్రియు గణింప సుతుండు మితమ్ముగానె నీ
కెక్కడనైన గోరినది యిత్తురు; తోడుగ భర్త యున్నచో
మక్కువ దక్కు నీ కమితమైన సుఖమ్ము, త్యజింపవద్దు, నీ
కెక్కడ దిక్కు లేదు మఱి యిప్పుడొ యక్క! మగండె దిక్కగున్".

***265. తలలో స్వర్గము జూపువాడె కవియౌ ధాత్రీతలం బందునన్.***

మ. కలి పాపమ్ము దొలంగ జేయుము మహత్కార్యమ్ములన్ బూజలన్
విలసద్దాన జపమ్ములన్ దపములన్ వేదోక్త యజ్ఞమ్ములన్
బొలుపారన్ శుభమందు మంచును సదా పుణ్యప్రదంబైన వ్రా
తలలో స్వర్గము జూపువాడె కవియౌ ధాత్రీతలం బందునన్.

***266. చెవిలో బువ్వుల బెట్టువాడె గుణసంశీలుండు ముమ్మాటికిన్.***

మ. భవమున్ ధన్యము జేయునట్టి సుమతిన్ పద్యమ్ములో జెప్పె, దా
"నవనిన్ బెట్టిననాడె వచ్చు నిల నానార్థమ్ము" లంచున్ మహా
కవియౌ బద్దెన; గాన పెట్టినను వీకన్ బెట్టకున్నన్ సదా
చెవిలో బువ్వుల, బెట్టువాడె గుణసంశీలుండు ముమ్మాటికిన్.

***267. తురకల్ జందెము దాల్చి యజ్ఞముల నెంతో శ్రద్ధతో జేతురే.***

మ. "అరి యంచున్ గచు భస్మమున్ గలిపి నా కందించగా నెంచి యి
త్తుర కల్? జందెము దాల్చి యజ్ఞముల నెంతో శ్రద్ధతో జేతురే
యరయన్ మోసముతోడ?" నంచు నిడె శుక్రాచార్యు డీ శాపమున్
"సుర ద్రాగన్ ఘన పాప మబ్బు నికపై జూడంగ ధాత్రీస్థలిన్".

***268. దారుణ కృష్ణసర్పము సుధల్ వెలి గ్రక్కుచు నుండె సత్కవీ!***

(హిరణ్యాక్షుడు చచ్చెనని విలపించుచున్న తల్లితో హిరణ్యకశిపుని మాటలు)

ఉ. "శూరుడు పుత్రు డేగెనని శోకము నందకు మమ్మ! యీశుడే
కారణ మమ్మ యన్నిటికి కల్ల జగమ్మిది తల్లి! భ్రాంతితో
పోర" కనెన్ హిరణ్యకశిపుం డిది చూడగ నిట్లు దోచెడిన్
దారుణ కృష్ణసర్పము సుధల్ వెలి గ్రక్కుచు నుండె సత్కవీ!

***269. చందురు లిద్ద రున్న గన జాలము చంద్రిక లయ్యొ దైవమా!***

ఉ. అందము చిందు భాష మన యందటి భాష తెలుంగు భాష, యే
మందుము నాడు పొందిన మహర్దశయే చనె; తెల్గుతల్లి యా
క్రందన నెంచ రీ తెలుగు రాష్ట్రము లేలెడి పాలకోత్తముల్
చందురు లిద్దరున్న గన జాలము చంద్రిక లయ్యొ దైవమా!

***270. శత్రుచయం బొసంగును బ్రశాంతిని నిత్యము మర్త్యకోటికిన్.***

ఉ. చిత్ర విచిత్ర మీ జగము చిన్మయరూపము శాంతిధామ మీ
సూత్ర మెఱింగి చిత్తమును, చొక్కెడి యింద్రియ కామ వర్గమున్
బాత్రత వైరులంచు నరిభంజన జేయ జగమ్ము భిన్న దు
శ్శత్రుచయం బొసంగును బ్రశాంతిని నిత్యము మర్త్యకోటికిన్.

**271. పతి యల్లుండుగ బుత్రియే సవతిగా బ్రాప్తించె జిత్రంబుగన్.**

మ. నుతులం బొందు సమస్య లిచ్చుట తగున్, నూత్నమ్ముగా నెంచి స
న్నుతులం బొందెడి పద్య పూరణల నెన్నో చేయుటల్ బాగు, స
మ్మతమే యిట్టు లధర్మబంధము నిడన్? మాన్యా! సుధీ! యెచ్చటన్
బతి యల్లుండుగ బుత్రియే సవతిగా బ్రాప్తించె జిత్రంబుగన్?

**272. అరయగ నింతి గుబ్బ గవ యగ్ని శిఖావృతమై వెలింగెడిన్.**

చం. నరక చతుర్దశిన్ మగువ నాట్యము జేయుచు దీపమాలికన్
కర మనురక్తి బెట్టినది, కాల్చె టపాసుల, చిచ్చుబుడ్డులన్
కరములలోన నుంచుకొని కాల్చగ నగ్ని ప్రమాదమయ్యె, మే
మరయగ నింతి గుబ్బ గవ యగ్ని శిఖావృతమై వెలింగెడిన్.

**273. భరతుడు పెండ్లియాడె గద భామిని సీతను ప్రేమ మీఱగన్.**

చం. వరదుడు ధర్మవర్తనుడు పావను డాశ్రిత రక్షకుండు దా
శరథి కృతజ్ఞుడున్ హితుడు సత్యము బల్కెడివాడు నిత్య స
చ్చరితుడు రాము డీశ్వరుని చాపము నెత్తినవాడు కీర్తి లా
భ రతుడు పెండ్లియాడె గద భామిని సీతను ప్రేమ మీఱగన్.

**274. అడ్డం బయ్యెను ధర్మవర్తనము కట్టా కార్య సంసిద్ధికిన్.**

శా. ఒడ్డెన్ ధర్మజు డగ్రజుండు మము దా నోడెన్ సతిన్ గూడ, నా
కడ్డే లేదని యీ సుయోధనుడు నే డాశించె నీ ద్రౌపదిన్
విడ్డూరమ్ముగ, వాని జంప దలతున్ భీముండ, యోచింప నా
కడ్డం బయ్యెను ధర్మవర్తనము కట్టా కార్య సంసిద్ధికిన్.

**275. చక్రము ద్రిప్పె నర్జునుడు చక్రి సమక్షమునందు శూరుడై.**

ఉ. "అక్రమ మేమొ కృష్ణ! స్వజనాదుల జంప" ననన్ కిరీటికిన్
సక్రమ మార్గదర్శకుడు శౌరియె గీతను బోధ జేయగా,
నక్రమ శోకమే తొలగ నాహవమందు నిమిత్తమాత్రుడై
చక్రము ద్రిప్పె నర్జునుడు చక్రి సమక్షమునందు శూరుడై.

**276. చెల్లెలి బెండ్లియాడె నట శిష్టజనావళి సూచి మెచ్చగన్.**

ఉ. ఎల్ల జగాల ప్రేమసుధ నేలెడి విష్ణువు కృష్ణమూర్తియై
యుల్లములోని లక్ష్మి సుగుణోన్నత రుక్మిణిగా జనింప, శ్రీ
వల్లభు డంత రాక్షస వివాహమునన్ గ్రహియించి రుక్మికిన్
జెల్లెలి బెండ్లియాడె నట శిష్టజనావళి సూచి మెచ్చగన్.

**277. జలమున నగ్ని పుట్టగనె సంబర మందెను మత్స్యజాలమే.**

చం. ఇల నొక డైంద్రజాలికుడు హేలగ "నబ్రకదబ్ర" యంచు దా
బలుకుచు, మత్స్యజాలముగ బాగుగ మార్చుచు ప్రేక్షకావళిన్,
జలమున నగ్ని పుట్టును ప్రశంసల జూడు దనంగ, నచ్చటన్
జలమున నగ్ని పుట్టగనె సంబర మందెను మత్స్యజాలమే.

**278. వాణిని రాణిగా గొనియె భర్గుడు లోక హితానుకారియై.**

ఉ. ప్రాణ సమాను నాథుని శుభంకరు దండ్రియె నింద సేయ, శ
ర్వాణి స్వదేహమున్ విడిచి పావనియై, మఱు జన్మమందు నా
స్థాణుని భర్తగా బడయ, శైలజగా జనియింప, నాటి శ
ర్వాణిని రాణిగా గొనియె భర్గుడు లోక హితానుకారియై.

***279. సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దుర్నిరీక్ష్యతన్.***

చం. సరములు పెక్కు లున్న విల సత్యము నెంచగ శిష్యవర్య! పూ
సరములు కేసరమ్ములును సహ్యము లయ్యెను, క్రోధ లోభ మ
త్సరములు దుర్గుణమ్ములు సతమ్ము కపాల వినిర్మితమ్ము లా
సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దుర్నిరీక్ష్యతన్.

***280. పరమేశుం గొలువంగ బాపములు వే పండంగ నిక్కమ్ములే.***

మ. "చిరకీర్తిన్ శిశుపాలు తేజము హరిన్ జేరన్ గతం బేమి? స
త్కరుణన్ దెల్పు" మనంగ ధర్మజుడు, వీకన్ నారదుం డిట్లనెన్
"నరనాథా! విను వైరమైన భగవన్నామమ్మునే పల్కుచున్
బరమేశుం గొలువంగ బాపములు వే పండంగ నిక్కమ్ములే"

***281. సత్యము బల్క నార్యు లపచార మటందురు శాస్త్రసమ్మతిన్.***

(కౌశికునకు ధర్మవ్యాధుని బోధ)

ఉ. స్తుత్యము వేదవాక్కు విను సూక్ష్మము ధర్మము జూడు కౌశికా!
నిత్యము భూతసంతతికి నీవు హిత మ్మొనరింప బొంకినన్
సత్య ఫలమ్మె దక్కు, ననిశమ్మును భూతభయాస్పదమ్మనౌ
సత్యము బల్క నార్యు లపచార మటందురు శాస్త్రసమ్మతిన్.

***282. అడ్డుగ గోడ గట్టిరి సమైక్యత నందెద మంచు నందఱున్.***

ఉ. బిడ్డల వోలె చేరుచును ప్రీతిని క్షీర సముద్ర సీమ "మా
కడ్డిక లేదు లే దమృత మందిన" నంచును దేవదానవుల్
దొడ్డగ వైరభావమును దూరము జేయ మనస్సునందు తా
మడ్డుగ గోడ గట్టిరి సమైక్యత నందెద మంచు నందఱున్.

***283. పలుకగ లేనివాడె ఘన పండితు డంచు గడించు గీర్తులన్.***

చం. పలుకుము సత్యముం దలచి, పల్కుము లోకహితమ్ము నెంచుచున్,
పలుకుము ధర్మబద్ధముగ, పల్కుము ముందుగ నాచరించుచున్,
పలుకుము మందహాసమున, పల్కు ప్రియమ్ముల, నప్రియమ్ములన్
బలుకగ లేనివాడె ఘన పండితు డంచు గడించు గీర్తులన్.

***284. సారము లేని తిండి దిని శక్తిని గూర్చుకొనంగ వచ్చులే.***

ఉ. ధీరత రామచంద్రుడు వధించెను రావణు, ద్రాగె దా నకూ
పారము గుంభసంభవుడు, భానుడు నింగిని సంచరించెడిన్,
మారుడు గెల్చు లోకముల మాన్యత సత్త్వము గల్గి, యోగులే
సారము లేని తిండి దిని శక్తిని గూర్చుకొనంగ వచ్చులే.

***285. మూషిక మొండు పిల్లి గని ముద్దు లొసంగెను ప్రేమతోడుతన్.***

ఉ. రోషము లుండబో విచట రూఢిగ నాశ్రమసీమలందు, సం
భాషణలందు శాంతి సమభావము లుండును, జాతివైరముల్
దూషణ లుండబోవు, మది దోషము లుండవు గాన జూడగన్
మూషిక మొండు పిల్లి గని ముద్దు లొసంగెను ప్రేమతోడుతన్.

***286. వెలది యురమ్మునందు వటవృక్షము మొల్చె మహాద్భుతమ్ముగన్.***

చం. మలచెను శిల్పి వేగముగ మానిని విగ్రహమున్, మనోజ్ఞతన్
దలచుచు వక్షమందు గన, దానికి సన్న పగుళ్లు దోప నా
వల బడవైచె, కాలగతి వర్షము లేగిన యంత జూడ నా
వెలది యురమ్మునందు వటవృక్షము మొల్చె మహాద్భుతమ్ముగన్.

***287. పుట్టినరో జటంచు గడు పూనిక శోకసభన్ రచింపరే.***

ఉ. పుట్టెను రాజశేఖరు, డపూర్వముగా ప్రజ నేలినాడు, చే
పట్టెను కీర్తిరాశిని, శుభమ్ముల గూర్చెను, ధాత్రి వీడి కా
ల్వెట్టెను స్వర్గమందు, దివి వేడుక సాగెను, వారి స్ఫూర్తికిన్
పుట్టినరో జటంచు గడు పూనిక శోకసభన్ రచింపరే!

***288. చీకటిలోన సూర్యు గని చేడియ నవ్వె మనోహరమ్ముగన్.***

ఉ. శ్రీకర భాస్కర గ్రహణ సిద్ధి యగున్ పరిపూర్ణమై, కనం
బోకు మటంచు నాథు డనె, పూజ్యుల వాక్కులు నిత్యసత్యముల్
చీకటి యయ్యె పట్టపగలే, వెస నద్దము నడ్డు పెట్టి యా
చీకటిలోన సూర్యు గని చేడియ నవ్వె మనోహరమ్ముగన్.

***289. ముదిమిని బొందగా మురిసి ముద్దియ ముద్దు లొసంగె భర్తకున్.***

(పూరుడు తన తండ్రి పురూరవుని వృద్ధాప్యమును తాను పొందిన విషయమును తన భార్య కౌసల్యతో చెప్పిన సందర్భము)

చం. ఇది యని పూర్వగాథ వచియింప యయాతిసుతుండు "పత్ని! నా
ముదిమిని స్వీకరింపుడని పుత్రుని నన్నడుగంగ తండ్రి, నే
ముదమున సమ్మతించితి నపూర్వమునౌ పితృవాక్యపాలనన్
ముదిమిని బొందగా" మురిసి ముద్దియ ముద్దు లొసంగె భర్తకున్.

***290. దేవుడు లేడు లేడనుచు దెప్పుచు నుండెద రాస్తికుల్ గదా!***

ఉ. దేవుని జూడగా బలు ప్రదేశములన్ దిరుగంగ నేల? స
ద్భావము భక్తి గల్గి భగవానుని సాక్షిగ మంచి చేయుడీ,
దేవుడు నిత్యుడున్ సకల దేహి హృదంతరవాసి; యెక్కడో
దేవుడు లేడు లేడనుచు దెప్పుచు నుండెద రాస్తికుల్ గదా!

**291. సీమంతంబును జేసి రెల్ల రపుడున్ సీతాసతీ భర్తకున్.**

శా. శ్రీమంతుండన రుక్మిణీవిభు డనన్ సీతాపతీ భర్తయౌ
రాముం డన్నను మోహినీసతి యనన్ రాజిల్లు నా విష్ణు, వా
భామన్ మోహినిఁ గూడ శంకరుడు, శుంభన్మోహినీ దృష్టికిన్
సీమంతంబును జేసి రెల్ల రపుడున్ సీతాసతీ భర్తకున్.

**292. సాగరమందు నీరమది చక్కెర తీరున దియ్యనౌ జుమీ.**

ఉ. త్యాగము చిత్తశుద్ధి వరధర్మము శీలము భక్తిభావమున్
బాగుగ నున్న యోగికి శుభమ్మగు, లోకము వశ్యమౌ, రుచిన్
సాగును జీవిత, మ్మిల నసాధ్యము సాధ్యముగా జెలంగగన్
సాగరమందు నీరమది చక్కెర తీరున దియ్యనౌ జుమీ.

**293. పాపాత్ముల కెల్ల నిశ్చయముగా గైవల్యమే ప్రాప్తమౌ**
(ఛందో గోపనము)

మ. శయనైకాదశి నేడు భక్తి నుపవాస మ్ముందు, నీ రాత్రి నీ
దయ జాగారము జేసి ద్వాదశి తిథిన్ దామోదరా! మ్రొక్కెదన్;
నియమం బొప్పగ నేడు చేయగ నిటుల్ నిశ్చింతగా బూజ నీ
కయి పాపాత్ముల కెల్ల నిశ్చయముగా గైవల్యమే ప్రాప్తమౌ.

**294. హయశృంగంబుల నెక్కి లెక్కిడెను తారానీక మంధుం డొగిన్.**

మ. జయమున్ బొందెను చిత్రసీమ విఠలాచార్యుండు చిత్రమ్ముగన్
మయ నిర్మాణము నాడు చేసి, మది సంభావింపగా నందు ని
ర్భయుడై పంగువు దాటె గొండ, పలికెన్ వాచాలుడై మూగయున్,
హయశృంగంబుల నెక్కి లెక్కిడెను తారానీక మంధుం డొగిన్.

***295. భార్యను జూచినంత బరభామినిపై మనసాయె భర్తకున్.***

ఉ. కార్యములందు దాసి, సరిగా కరణమ్ముల మంత్రి, లక్ష్మి సౌం
దర్యమునందు, భూమి క్షమ, దల్లియు భోజనవేళ, రంభయౌ
భార్య సుఖమ్మునందు నని భావన జేయగ నట్లు లేని యా
భార్యను జూచినంత బరభామినిపై మనసాయె భర్తకున్.

***296. దమయంతిన్ దగ బెండ్లియాడెను గదా ధర్మాత్ము డా రాముడే.***

మ. అమరెన్ మన్మథు మాత సీతగను తా నందమ్ముచే దైత్యరాట్
దమనమ్మున్ గొనసాగ జేయుటకునై దండింపగా రావణున్;
విమలుండై శివచాప మెత్తి ఘనతన్ విష్ణ్వంశ సంభూతు డా
దమయంతిన్ దగ బెండ్లియాడెను గదా ధర్మాత్ము డా రాముడే.
(తన అందముచే ఇతరులను దమింప జేయునది 'దమయంతి')

***297. రాతికి బుట్టె బుత్రుడు సురల్ మును లెల్లరు సంతసింపగన్.***

ఉ. భీతిని గూర్చు తారకుని వే వధియించెడి నా మహేశు సం
జాతు డటంచు, దేవతలు సాధులు జేరి యుమామహేశులన్
బ్రీతిని గూర్చి పెండ్లి జరిపించిరి; తత్ఫలితమ్ముగా బురా
రాతికి బుట్టె బుత్రుడు సురల్ మును లెల్లరు సంతసింపగన్.

***298. కాంతయె కారణమ్మగును గాదె ధరన్ గలహమ్ము లేర్పడన్.***

ఉ. కంతుని గెల్వుమా! పరుల కాంతల జోలికి వెళ్ళబోకుమా!
పంతము బూని కామమున బర్వుచు రావణుడున్ సుయోధనుం
డంతకు జేరినారు వినుమా! పరకాంతను గోరుకొన్న నా
కాంతయె కారణమ్మగును గాదె ధరన్ గలహమ్ము లేర్పడన్.

***299. అమృతమ్మున్ జవి జూచి చచ్చిరి సురల్ హా స్వర్గలోకాధిపా!***

("మనకే దక్కవలసిన అమృతము రాక్షసులకు కూడ దక్కినది. ఇక మనము చచ్చినట్లే" అని దేవతలు అనుకొన్న సందర్భము)

మ. సుమతిన్ గూర్చొని రా సురాసురు లటన్ జూడంగ వేత్వేఱుగా,
విమతిన్ రాహువు శంకతో సురునిగా వేషమ్మునే దాల్చి య
క్రమతన్ జేరెను దేవతావళిని, వీకన్ మృత్యువున్ గెల్చినా
డమృతమ్మున్ జవి జూచి, చచ్చిరి సురల్ హా స్వర్గలోకాధిపా!

***300. పడతి పడంతినే కద వివాహము గావలె శాస్త్రపద్ధతిన్.***

చం. నుడువగ దేవు డొక్కడె మనోహరుడున్ పురుషుండు భర్తయున్,
గడను గలట్టి దంతయును గాంచగ స్త్రీ యని పెద్దలందు రీ
పుడమిని; గాన చిత్రముగ పూరుష రూపములోన నున్న యీ
పడతి పడంతినే కద వివాహము గావలె శాస్త్రపద్ధతిన్.

***301. రమ్మును గ్రోలి నప్డె మునిరాజని మెత్తురు గాదె సజ్జనుల్.***

ఉ. "రమ్మ్మ సుబోధ గూర్తు, మునిరాజును జేసెద, నీకు శాస్త్ర సా
రమ్మును దెల్పెదన్, సుగుణరాశిగ మార్చెద నిన్ను, ధర్మ సా
రమ్మును జెప్పెదన్, వినుము రక్తిని శిష్యవరేణ్య! వేద సా
రమ్మును గ్రోలి నప్డె మునిరాజని మెత్తురు గాదె సజ్జనుల్".

***302. సాగర మబ్ధి తోయనిధి సంద్రము వారిధి ద్వీపవంతమున్.***

ఉ. "ఈ గతి నెత్తిమీద వసియించెడి గంగను వీడుమయ్య! తా
నాగని కోప మందినది యంబయె"; "గంగ కికేది దిక్కగున్?"
వేగముతోడ షణ్ముఖుడు వింతగ నుత్తర మిచ్చె గోపియై
"సాగర మబ్ధి తోయనిధి సంద్రము వారిధి ద్వీపవంతమున్"

**303. పురుషార్థమ్ముల లెక్కిడన్ దెలిసె పో మూడంచు నా బుద్ధికిన్.**

మ. ధరలో సాధన జేసి పొందగవలెన్ ధర్మార్థకామమ్ములన్
స్థిరమై చేకురు మోక్ష మన్నది స్వతస్సిద్ధమ్ముగా సాధ్యమై,
సరిగా ధర్మము నర్థకామముల నే సాధింపగా బూని యా
పురుషార్థమ్ముల లెక్కిడన్ దెలిసె పో మూడంచు నా బుద్ధికిన్.

**304. తలగడ మంత్ర మింతులకు దప్పక మేలొనరించు నెచ్చెలీ!**

చం. "ఇల నిది శంకరాభరణ మేమని వచ్చెనొ? భర్త దీనినే
పలుమరు జూచు, న న్గనడు, పద్యమొ పాడొ కలమ్ము వీడ, డా
కులత నెఱుంగబో" డనుచు కోమలు లాడుచు నున్నవా, "రికన్
దలగడ మంత్ర మింతులకు దప్పక మేలొనరించు నెచ్చెలీ!"

**305. వాలిని జంపె యుద్ధమున బార్థుడు కంసుడు గాంచి మెచ్చగన్.**

ఉ. బాలురు నాటకమ్ములను బాగుగ వేయుచునుండ, వాటిలో
లీలగ రామలీలలను బ్రీతిగ బార్థుడు జూచె, కంసుడున్
మేలని చూచె, వాలివధ మెప్పును బొందెను, రామచంద్రు డా
వాలిని జంపె యుద్ధమున బార్థుడు కంసుడు గాంచి మెచ్చగన్.

**306. ధర్మము నాచరించు నెడ దప్పదు దండన మెట్టివారికిన్.**

ఉ. "శర్మము నంద నా కెపుడు స్వార్థయుతమ్మగు రాజధర్మమే
వర్మ" మనెన్ సుయోధనుడు, వంచన జేయుటఁ బొందె దండనన్,
నిర్మల బుద్ధి లేక కనె నీచుడుగా నపకీర్తి, నట్టిదౌ
ధర్మము నాచరించు నెడ దప్పదు దండన మెట్టివారికిన్.

***307. టంటం టంట టటంట టంట టటటం టంట మ్మనెన్ భేరులే.***

శా. కంటిన్ డిండిమభట్టు వాదపటిమన్, ఖండించి శ్రీనాథుడన్
గొంటిన్ నేన్ కవిసార్వభౌమ పదవిన్, కొంగ్రొత్త శబ్దమ్ములన్
వింటిన్ మత్కనకాభిషేక సభలో, వేవేగ భగ్నమ్ములై
"టంటం టంట టటంట టంట టటటం టంట" మ్మనెన్ భేరులే.

***308. యతులున్ బ్రాసలు లేని పద్యములె మేలంచున్ గురుల్ సెప్పరే!***

మ. యతులున్ బ్రాసలు నిల్పి పద్యముల వ్రాయం బూన నాంధ్రమ్మునం
దతి కష్టం బని పల్కువార, లిక శ్రేయమ్మున్ బ్రసాదింప సం
స్కృతమందున్ విరచించి మించి విబుధ స్వీకారముం గాంచుడీ,
యతులున్ బ్రాసలు లేని పద్యములె మేలంచున్ గురుల్ సెప్పరే!

***309. పజ్క్తిముఖుం గనుంగొని యపారభయమ్మును బొందె రాముడే.***

ఉ. పజ్క్తిగ వచ్చి యేకజట వంటి మెలంతలు పల్కినా రటన్
పజ్క్తిముఖుండు క్రూరుడని; పల్కి రిటుల్ "నడిరేయి మా కలన్
పజ్క్తిముఖుండు నీ విభుని పట్టెను కొట్టెను, సీత! సత్య మా
పజ్క్తిముఖుం గనుంగొని యపారభయమ్మును బొందె రాముడే".

***310. సిగరె ట్టింపనె వేంకటేశుడు సురల్ సేవింప దద్వాసనల్.***

మ. "అగరున్ ధూపముగా సమర్పణము సేయన్ మేలిటుల్ ప్రొద్దుటన్,
జగతిన్ భక్తులు ధూప సేవ లిటులే సాయంత్రమున్ జేయగా
దగు, జేయంగను నా కృపన్ ఫలితముల్ తథ్యమ్ము సిద్ధించు వా
సిగ రెట్టిం" పనె వేంకటేశుడు సురల్ సేవింప దద్వాసనల్.

**311. ఒక్కడె భర్త ద్రౌపదికి నొక్కతె పెండ్లము కృష్ణమూర్తికిన్.**

ఉ. చక్కని పూర్వగాథ లివి, శక్రుని యంశలె పంచపాండవుల్
నిక్కము భర్తలై రిలను నిశ్చిత మిద్దియె, పాకశాసనుం
డొక్కడె భర్త ద్రౌపదికి; నొక్కతె పెండ్లము కృష్ణమూర్తికిన్,
దక్కెను లక్ష్మి రుక్మిణిగ నాథుని వీడదు జన్మజన్మలన్.

**312. శ్రీకృష్ణుం గటు భాషణమ్ములను గర్హించెన్ గుచేలుం డయో!**

శా. శ్రీకృష్ణుం డిల జేయు చేష్టలు కృపాలీలల్ గదా! క్రీడలన్
జేకొంచున్ వడి లాగుచుండ జినిగెన్ చేలమ్ము, మిత్రుం డటన్
"నా కీ దుర్గతి గల్గ కారణము కృష్ణా! నీవె" యంచున్ వెసన్
శ్రీకృష్ణుం గటు భాషణమ్ములను గర్హించెన్ గుచేలుం డయో!

**313. దాహము వేసినప్పుడె కదా నుయి ద్రవ్వగ నొప్పు జ్ఞానికిన్.**

ఉ. ఊహల మున్గు వారలకు నొప్పు పగల్ నిశ యౌను మౌనికిన్,
దేహులు నిద్రబోవు నెడ ధీరత మేల్కొను సంయమీశ్వరుం
డీహలు మాఱు లోకులకు నెంచగ జ్ఞానికి నిట్లు, గావునన్
దాహము వేసినప్పుడె కదా నుయి ద్రవ్వగ నొప్పు జ్ఞానికిన్.

**314. పాలను జూచి పిల్లి వడి బాఱెను తీవ్ర భయార్తి జెందుచున్.**

ఉ. లీల బ్రజాళి పెంచె గడు బ్రీతిగ బిల్లుల రా జొసంగుటన్,
వేళకు రామకృష్ణు డిడె వేడిగ పాలను మూతి గాల, నా
లీలనె చూప గొల్చువనను, లేవక లేవక లేచి వచ్చి యా
పాలను జూచి పిల్లి వడి బాఱెను తీవ్ర భయార్తి జెందుచున్.

**315. స్వేచ్ఛ లభించె దాస్య ఘన శృంఖలముల్ దెగ వేమి చెప్పుదున్?**

ఉ. స్వేచ్ఛగ సంచరింప గనిపించదు మార్గము నేటికిన్, హిమ
స్వచ్ఛ మనమ్మునన్ మెలగ సంకటముల్ వెస చుట్టుముట్టు, మా
యిచ్ఛ ఫలింప దెల్లదొర లీయగ డెబ్బది యేండ్ల పూర్వమే
స్వేచ్ఛ లభించె, దాస్య ఘన శృంఖలముల్ దెగ వేమి చెప్పుదున్?

**316. కోడలి పొందు గోరె గుణకోవిదు డామెయు సమ్మతించెగా.**

ఉ. వేడె మహా కవీంద్రుడుగ పిల్లలమఱ్ఱిగ కీర్తి నందుచున్
తోడుగ నుండ వాణి బరితోషమునన్ పిన వీరభద్రు డా
నాడు ప్రసిద్ధి కెక్కె, గరుణన్ జగమేలెడి విష్ణుమూర్తికిన్
గోడలి పొందు గోరె గుణకోవిదు డామెయు సమ్మతించెగా.

**317. సవతియె లేని కాపురము సవ్యముగా గొనసాగు టెట్టులో?**

చం. అవనిని జన్మ సార్థకత నందగ సజ్జన సంగమమ్ముతో
బ్రవిమల విద్యతో వినయ భావముతో నిజ ధర్మపత్నితో
స్తవ గుణరాశితో జిర యశమ్ము గడింపుము వత్స! కీర్తి యన్
సవతియె లేని కాపురము సవ్యముగా గొనసాగు టెట్టులో?

**318. పశ్చాత్తాపము వీడి పుణ్యమునకై పాపక్రియన్ సల్పుమా.**

శా. పశ్చాత్తాపము గూర్చు పాప మనుచున్ భావించు మారీచుడే
యాశ్చర్యమ్మున స్వప్నమందు గనె తా నాత్మప్రబోధ మ్మిటుల్
"దుశ్చర్యున్ నిను జంపు దాశరథి సంతోషమ్ము బుణ్యమ్మగున్
పశ్చాత్తాపము వీడి పుణ్యమునకై పాపక్రియన్ సల్పుమా"

***319*. కొండ నలంకరించి సుమకోమలి మోదము నందె జిత్రమే.**

ఉ. పండుగ జిన్ని కృష్ణు గని బంగరుకొండ యటంచు బిల్చి, పూ
దండను వెన్నముద్ద మొలత్రాడును తాయెత బట్టుపుట్టమున్
మెండుగ మ్రోయు గజ్జెలను మించుచు గూర్చె యశోద, ప్రేమ నా
కొండ నలంకరించి సుమకోమలి మోదము నందె జిత్రమే.

***320*. పగవానిన్ సతి పెండ్లియాడి పడసెన్ భాగ్యోన్నతిన్ బ్రీతితో.**

మ. పగ లేకుండెడి వాడు సత్కరుణతో వర్ధిల్లువా డీశు డా
పగనే యాపగ జాలువాడు, విషమున్ భక్షించి కష్టాల నా
పగ నేర్చున్ శివు డంచు నారదు డనన్, వాడే మనోవీథి దో
పగ, వానిన్ సతి పెండ్లియాడి పడసెన్ భాగ్యోన్నతిన్ బ్రీతితో.

***321. శవమం దా శశిలోని షోడశ కళా సల్లక్షణమ్ముల్ గనెన్.***

మ. భవమున్ బాపెడి విష్ణుమూర్తి భువి గావన్ రామభద్రుండుగా
నవనిన్ సంభవమంద, "రామ! గుణధామా!" యంచు కౌసల్య మా
ధవునిన్ బిల్చుచు రామచంద్రు ముఖమున్ దర్శించుచున్ వాని శై
శవమం దా శశిలోని షోడశ కళా సల్లక్షణమ్ముల్ గనెన్.

***322*. పోతన కావ్యమందు రసపోషణ సుంతయు గానరాదయో!**

ఉ. "పోతన నేనె" యన్ కుకవి పుస్తక మొక్కటి వ్రాసె గర్వియై,
యీ తరమందు నెంచ రసహీన మదే, నుతియించు నిట్టు లా
కైతను కాకిపిల్ల యన కాకికి ముద్దగు నట్టు "లెంత సొం
పో", తన కావ్యమందు రసపోషణ సుంతయు గానరాదయో!

***323*. పిల్లి జనింపగా బులికి వింతగ జెప్పుకొనంగ నొప్పునా?**

(పులి వంటి వాయుదేవునకు జనించిన ఆంజనేయుడు లంకలో ప్రవేశించునపుడు పిల్లి పరిమాణాన్ని పొందిన సందర్భం)

ఉ. తల్లడమందు పుత్రు గని దారుణ నిశ్చల దీక్ష బూనె దా
నెల్లెడ భీతి గూర్చు పులి యెన్నగ నప్పటి వాయుదేవుడే,
పిల్లియె లంకలో నడుగుపెట్టెడి వేళను వాయుపుత్రుడున్
పిల్లి జనింపగా బులికి వింతగ జెప్పుకొనంగ నొప్పునా?

***324*. కలిగెన్ గోరిక శ్రీసతీ విభునకున్ గైలాసమే యేలగన్.**

మ. బలిమిన్ రావణు డెత్త గోరి వెస జేపట్టంగ గైలాసమున్,
గలిగెన్ శూలికి భార్య కౌగిలియె, భాగ్య మ్మబ్బెగా వింతగా,
గలుగన్ జాలునె యట్టి భాగ్యమని వీకన్ యోచనన్ జేయగా
గలిగెన్ గోరిక శ్రీసతీవిభునకున్ గైలాసమే యేలగన్.

***325*. కంటికి దీపమౌ సుతుడె కాలయముండుగ నయ్యె నయ్యయో!**

ఉ. కంటిని మిమ్ము పుత్రకుల గంటిని కీర్తిని, నేడు రేణుకన్
గంటిని దోషయుక్తగను కావున జంపు డనంగ తండ్రి, నే
గంటిని ధర్మమంచు తల ఖండన జేసెను జామదగ్నియే;
కంటికి దీపమౌ సుతుడె కాలయముండుగ నయ్యె నయ్యయో!

***326*. ప్రాఙ్నగ శృంగభాగమున భానుడు గ్రుంకె నదేమి చిత్రమో?**

ఉ. దిఙ్నగ రాశి మారును విదేశము లేగిన, క్యాలిఫోర్నియా
ప్రాఙ్నగ మన్నచో మనకు పశ్చిమ పర్వత రాశి, వారికిన్
ప్రాఙ్నగ మౌనుగా మన సుపశ్చిమ పర్వత రాశి, వారిదౌ
"ప్రాఙ్నగ శృంగభాగమున భానుఁడు గ్రుంకె నదేమి చిత్రమో?"

**327. మేకను వండి సాధువులు మేలని మెచ్చుచు నారగింపరే.**

ఉ. మా కిడలేదు సాధువులు మంత్రము నంచును నిల్వలుండు దా
వీకను భోజనమ్మునకు బిల్చును సాధుల, జంకు గొంకులే
లేక సహోదరుం డచట ప్రీతిగ మేకగ మార, పెట్టు నా
"మేకను వండి, సాధువులు మేలని మెచ్చుచు నారగింపరే."

**328. వనరాడ్వాహన మయ్యె మూషికము దివ్యశ్రేణి మేల్మేలనన్.**

మ. ఘన గంధర్వుడు క్రౌంచు డాఖు వయిపోగా నింద్రు శాపాన, త
ద్వినతిన్ గైకొని బ్రోచె మూషికమునే విఘ్నేశ్వరుం డెల్లెడన్
తనతో పాటుగ పూజ లందుకొన సన్మానించె, నంతన్ జనా
"వనరాడ్వాహన మయ్యె మూషికము దివ్యశ్రేణి మేల్మేలనన్."

**329. చెల్లికి వల్లభుం డగుటచే జను లెల్లరు మోద మందిరే.**

ఉ. ఎల్లెడ కృష్ణు నాథునిగ నెంచుచు బంపెను ప్రేమలేఖనే,
యుల్లము నందు రుక్మిణియె యున్నది కృష్ణునికిన్, మనోజ్ఞ సం
పల్లలితాంగి రాక్షస వివాహమునన్ గొనె, రుక్మి! తాను నీ
''చెల్లికి వల్లభుం డగుటచే జను లెల్లరు మోద మందిరే.''

**330. పుత్రిని గూడి శంకరుఁడు పొందెఁ గుమారుని మెచ్చ దేవతల్.**

ఉ. "పాత్రత నా మహేశ్వరుడు పార్వతి యొక్కటి గాగ, వారికిం
బుత్రుడు బుట్టు, తారకుని బోర వధించు" ననంగ సర్వభు
జ్నేత్రుని బార్వతిన్ గలిపె నేర్పున మన్మథు, డంత శైలరా
ట్పుత్రిని గూడి శంకరుఁడు పొందెఁ గుమారుని మెచ్చ దేవతల్.

**331. తేలును ముద్దులాడి యిక తేనియ లూరగ బల్కవే చెలీ!**

ఉ. పాలను ద్రాగి నీకు నొక పాలు మిగిల్చితి ద్రాగు మింక నీ
కాలము రాదు, కౌగిలి సుఖమ్మును బొందుచు నిమ్ము వేగ నీ
లీల జెలంగు శోభనము ప్రీతిగ, చిత్తము మోదవార్ధిలో
తేలును, ముద్దులాడి యిక తేనియ లూరగ బల్కవే చెలీ!

**332. లంకను పోరులో గెలిచి లక్ష్మణు డేలె సహస్ర వర్షముల్.**

ఉ. "లంకను గొన్న మేలు, నవరత్న సువర్ణ మయమ్ము చూడు మీ
లంక కయోధ్య నిత్తు" మని లక్ష్మణు డాడగ, "జన్మభూమియే
యింకను గొప్ప" దంచు వచియింపగ రాముడు, స్వప్న సీమ నా
"లంకను పోరులో గెలిచి లక్ష్మణు డేలె సహస్ర వర్షముల్."

**333. ద్వాపరమందు సోమక వధం బొనరించెను రాము డుద్ధతిన్.**

ఉ. ఆ పరమాత్మ యెత్తె నిల నద్భుతరీతి దశావతారముల్
చూపెను లీలలన్ విను విశుద్ధత నంచు గురుండు చెప్ప, నే
జూపెద నాదు తెల్వి నని శుంఠ యొకండు వచించె నిట్టులన్
"ద్వాపరమందు సోమక వధం బొనరించెను రాము డుద్ధతిన్."

**334. బలరామున్ దలమీఱు పాపి గలడే భావింపగా మేదినిన్?**

మ. విలసత్తేజుడు ధర్మజుం డనె నిటుల్ "విశ్వాత్మ! హే మాధవా!
యిల సన్న్యాసుల గొల్చు, యాత్రలకు దా నిచ్చన్ బ్రయాణించు, ధీ
కలితుండై వచియించు, గాన ప్రతియొక్కండెన్న దేవుండునై
బలరామున్ దలమీఱు; పాపి గలడే భావింపగా మేదినిన్?"

***335. అడచెన్ సోమక నామ దైత్యుని వరాహస్వామియై శూలియే.***

మ. విడువం డాతడు శూలమున్ శివుడుగా వేషమ్ములన్ వేయు తా
నడుగో శూలము చేత బట్టుచు వరాహస్వామి వేషమ్మునన్
పొడిచెన్ రాక్షసు వేదచోరు, మరచెన్ బో గాథలన్, గాన నే
డడచెన్ సోమక నామ దైత్యుని వరాహస్వామియై శూలియే.

***336. రవిబింబం బుదయించె నుత్తరదిశన్ రాత్రిన్ మహాశ్చర్యమై.***

మ. పవలే వేసెను తూర్పు గోడ పయి దీవ్యద్బ్రహ్మ చిత్రమ్ము, శ్రీ
ధవు చిత్రమ్మును వేసె దక్షిణ దిశన్, దర్శింపుడీ వేసెగా
శివు చిత్రమ్మను పశ్చిమమ్మున ; లిఖించెన్ రాత్రి సూర్యున్, భళీ!
రవిబింబం బుదయించె నుత్తరదిశన్ రాత్రిన్ మహాశ్చర్యమై.

***337. దేహిని బెండ్లియాడె గద దివ్యులు మౌనులు మెచ్చు రీతిగన్.***

ఉ. ఊహలు పండ సీతకు, నహో యనుచుండ స్వయంవరమ్ము, తా
బాహుబలమ్ము పండ రఘువర్యుడు చాపము నెత్తుచుండ, దా
సోఽహ మటంచు నా జనకు డౌననగా, రఘురాము డంత వై
'దేహిని బెండ్లియాడె గద దివ్యులు మౌనులు మెచ్చు రీతిగన్'.

***338. రాముడు నాకు దైవ మని రావణు డంగదు తోడ చెప్పెరా.***

ఉ. రాముడు వానరుల్ చనిరి లంకకు, నంగద రాయబారమే
సామ మటన్న, నేగి వరుసన్ హితబోధల నంగదుండు శ్రీ
"రాముడు నాకు దైవ" మని ప్రజ్ఞ వచింపగ; "పార్వతీ మనో
రాముడు నాకు దైవ" మని రావణు డంగదు తోడ చెప్పెరా.

**_339. పతితో గ్రూరత బోరినట్టి సతికిన్ భక్తిన్ నతుల్ సేతురే._**

మ. పతి ప్రాణమ్ములతోడ నుండుటయె సౌభాగ్యమ్ముగా నెంచి, తా
నతి ఘోరమ్మగు మార్గ మందు జనె, న్యాయమ్మంచు సావిత్రియే
పతికై కాలుని వెంబడించి, నిజ ధీ వైశిష్ట్యమున్ జూపి ది
కృతితో గ్రూరత బోరినట్టి సతికిన్ భక్తిన్ నతుల్ సేతురే.

**_340. చీమ యొకండు తుమ్మగనె శీఘ్రమె దిక్కరు లెల్ల బాఱెనే._**

ఉ. సామము లేని లాడె నను సాయుధు డెన్న మహోగ్రవాది దు
ష్కామిగ జంపినా డమెరికా జన రాశిని; "వాడు కన్పడెన్
తామసు" డన్న వార్త విని తల్లడ మందిరి లోకపాలకుల్
చీమ యొకండు తుమ్మగనె శీఘ్రమె దిక్కరు లెల్ల బాఱెనే.

**_341. కోకిల 'కావు' 'కావు' మని కూసెను నేటి వసంత వేళలన్._**

ఉ. కోకిలయే కుహూ యనగ, కోయ తదర్థము నిట్లు చెప్పెడిన్
"మాకును చెట్లె జీవనము, మానవ! మానవ చెట్లు గూల్చుటల్,
వాకొనుచుంటి నే నరుకవద్దని చెట్లను కావు" మంచు, నా
కోకిల 'కావు' 'కావు' మని కూసెను నేటి వసంత వేళలన్.

**_342. పగలో మున్గినవారి పాపచయముల్ భస్మమ్ములౌ నెప్పుడున్._**

మ. సుగతిన్ వామనమూర్తి పాదమును విస్ఫూర్తిన్ దివిన్ నిల్ప, దా
నగుచున్ దానిని భక్తి బ్రహ్మ కడుగంగా, విష్ణుపాదోద్భవం
బగు నీరమ్మది ధాత్రి దివ్య నదిగా నయ్యెన్ గదా, యా సురా
పగలో మున్గినవారి పాపచయముల్ భస్మమ్ములౌ నెప్పుడున్.

***343*. మిడుగుఱు దారి జూపగను మింటను సూర్యుడు సాగె సూటిగన్.**

చం. విడువగ బ్రాణమున్ సతియె, వేగ శివాంశగ వీరభద్రుడే
వడి జని దక్షయజ్ఞమును ధ్వంసము జేయ, తదక్షిజాతముల్
మిడుఁగుఱు లంతటన్ మెఱయ, మేలగు నేగుట యంచు భీతితో
మిడుగుఱు దారి జూపగను మింటను సూర్యుడు సాగె సూటిగన్.

***344*. నగ్నముగా జరించిన ఘనంబుగ మేలని మెచ్చరే జనుల్.**

ఉ. నగ్నత స్నానమాడు సురనారులు జూచి రసంగుడౌ యను
ద్విగ్న శుకున్ జలింపకయె, వే గని వ్యాసుని సిగ్గు తోడ ను
ద్విగ్నత చీరలన్ గొనిరి వింతగ; నా శుకయోగి పోలికన్
నగ్నముగా జరించిన ఘనంబుగ మేలని మెచ్చరే జనుల్.

***345*. తాతకు దండ్రికిన్ దనకు దన్వి యొకర్తుక దార యయ్యెడిన్.**

ఉ. ఆతత కీర్తులన్ దశరథాఖ్యు డయోధ్యకు నాథు డయ్యె, వి
ఖ్యాతిని రాము డంతట మహాత్ము డయోధ్యకు నాథు డయ్యెగా,
పూతుడు నంతటన్ కుశుడు పూజ్యు డయోధ్యకు నాథు డౌట నా
తాతకు దండ్రికిన్ దనకు దన్వి యొకర్తుక దార యయ్యెడిన్.

***346*. బాస నశించె గారణము పండితులే కద తెల్గునేలపై.**

ఉ. వాసిగ నేటి పండితులు బాగుగ నిత్యము రాజకీయముల్
సేసెడి పాలకుల్, తెలుగు జెప్పుచు నుండిన ప్రాచ్య సంస్థలన్
మూసిరి యాంగ్లభాషపయి మోజున, నీ మన తెల్గు వారిదౌ
బాస నశించెఁ గారణము పండితులే కద తెల్గునేలపై.

***347. ముండా మ్రొక్కెద నీ పదమ్ములను నా మూర్ధమ్ముపై నుంచవే.***

శా. ముం–డాయంగను వేగ రమ్ము రఘురాముండా! మహద్ధర్మ కా
ముండా! కావుము ఘోర పాతక విరాముండా! ప్రభూ! వైరి భీ
ముండా! గౌతమపత్ని నేనె, జయరాముండా! లసత్కీర్తి ధా
ముండా! మ్రొక్కెద నీ పదమ్ములను నా మూర్ధమ్ముపై నుంచవే.

***348. పిల్లిని జంక బెట్టుకొని పెండ్లికి నేగుట పుణ్యకార్యమౌ.***

ఉ. పిల్లిని జంక బెట్టుకొని పెండ్లికి నేగ శుభమ్ము నాకు, నీ
పిల్లిని కృష్ణరాయ లిడె ప్రేమగ బెంచు మటంచు, రాజుగా
రుల్లము నందు మెచ్చుకొన నూరక భాగ్యము గల్గు, నాకు నీ
పిల్లిని జంక బెట్టుకొని పెండ్లికి నేగుట పుణ్యకార్యమౌ.

***349. ప్రకృతి వినాశనమ్మె కడు పావన కార్యము ధాత్రిలోపలన్.***

చం."సుకృతము విష్ణుకీర్తనము, చూడకు భేదము, తండ్రి!" యన్న "నీ
మొక" మని, పల్కె హేమకశిపుం డిటు "బాలక ! దేవతాళికిన్
సుకము తొలంగ జేయవలె, స్రుక్కగ జేయవలెన్ సురాళి, నెం
చకు మది పాపపుణ్యముల, సాధు వినాశన మస్మదీయమౌ
ప్రకృతి; వినాశనమ్మె కడు పావన కార్యము ధాత్రిలోపలన్."

***350. అంబలితో సమంబు లగునా చవి జూచిన బంచభక్ష్యముల్.***

ఉ. అంబలి యన్న వంటకము నందున రాగులు నూకలుండు, శ్రే
యం బగు దీని దిన్న, బల మబ్బును, పుష్టియు తుష్టి గల్గు నో
యంబ! గతమ్ము నందు నిదె యందఱి భోజన మౌచు నుండె నీ
యంబలితో సమంబు లగునా చవి జూచిన బంచభక్ష్యముల్.

**351. కలు సేవించుట శిష్టకార్య మనుచున్ గాంధీ యశంబున్ గొనెన్.**

మ. అల యక్టోబరు రెండు నాడు మన మోహన్ దాసు జన్మించె, మీ
రలు సేవింపుడు భారతాంబ నని చేరన్ బిల్చుచున్, నిత్యబో
ధలలోనన్ పురుషాళితో సమముగా ధైర్యమ్ముగా నమ్మల
క్కలు సేవించుట శిష్టకార్య మనుచున్ గాంధీ యశంబున్ గొనెన్.

**352. భీమునిభార్య తార యని వేమన వ్రాసెను భారతమ్మునన్.**

ఉ. వేమన యన్నచో నపర వేమన, భారతమన్న దేశమౌ,
శ్రీమతులైన కన్యలను జెప్పుచు పాపము పోవునట్లుగా
నీ మహిలో "నహల్య, గణియింపగ రావణుభార్య, సీతయున్,
భీమునిభార్య, తార" యని వేమన వ్రాసెను భారతమ్మునన్.

**353. శంకరు డెత్తె మంచుమల శైలజ భీతిలి కంప మొందగన్.**

ఉ. జంకును గొంకు లేక యనిశమ్ము జరించెడి రావణుండు, నా
కంకిలి లేదు నా కపజయమ్మును లేదని యెంచు వాడు, మీ
నాంకుని చేతిలో నపజయమ్మును పొందెడి వాడు, సాధు నా
శంకరు డెత్తె మంచుమల శైలజ భీతిలి కంప మొందగన్.

**354. కలవాడే యిలు నిల్లు గ్రుమ్మరుచు భిక్షన్ గోరె గ్రామంబునన్.**

మ. కల వాఁడే కనుపించె శుక్రునికి విక్రాంతుండునై, యన్ని వం
కల వాఁడే, భువి వామనుం డగుచు దీక్షామూర్తి విచ్చేసె, శ్రీ
కల వాఁడే బలిచక్రవర్తి నడుగంగా బోయెడిన్, మూడు పో
కల వాడే యిలు నిల్లు గ్రుమ్మరుచు భిక్షన్ గోరె గ్రామంబునన్.

***355. భార్యలు ముఫ్వురు రా పరమ పావనుడౌ రఘురామ మూర్తికిన్.***

ఉ. భార్యగ శత్రుఘాతకుని ప్రక్కన దా శ్రుతకీర్తి వెల్గెడిన్,

భార్యగ వెల్గె లక్ష్మణుని ప్రక్కన నూర్మిళ త్యాగశీలగన్,

భార్యగ వెల్గెగా భరతనారిగ మాండవి, హారతిచ్చి రా

భార్యలు ముఫ్వురు రా పరమ పావనుడౌ రఘురామ మూర్తికిన్.

***356. ఖగపతి కిచ్చె రావణుడు గాండివమున్ నృపకోటి జంపగన్.***

చం. ఖగపతి, రావణుండు, నృప, గాండివ మంచు గురుండు పల్కి, వ్రా

యగ నిడె సొంత వాక్యముల నర్థయుతమ్ముగ వేఱువేఱుగా,

వగవక జ్ఞానహీనుడయి వ్రాసె నొకండిటు లేకవాక్యతన్

'ఖగపతి కిచ్చె రావణుడు గాండివమున్ నృపకోటి జంపగన్'.

***357. ఖరమా! జీవన మందు సౌఖ్యముల కాగారమ్ముగా మారుమా!***

మ. ధరలో ప్రాణివధాదులన్ కలికి సంస్థానాలుగా నిచ్చుచున్

కర మాశన్ కలి గోర నిచ్చె నిను సాక్షాత్ శ్రీ పరీక్షిత్తు; క

ర్బురమా! వైరము పెంచకమ్మ! నిను నే పూజింతు నో అగ్నిశే

ఖరమా! జీవన మందు సౌఖ్యముల కాగారమ్ముగా మారుమా!

{అగ్నిః ఇవ శేఖరమ్ అస్య = అగ్నిశేఖరమ్ (బంగారము)}

***358. తిరుమలలోన వర్ధిలెను దేవుడుగా శశిమౌళి ప్రీతిగన్.***

చం. వరదుని కా రమేశునకు బ్రహ్మ యొనర్చెడి యుత్సవా లటన్

జరుగును నేటినుండియె ప్రశస్తముగా, గన రమ్ము పోద, మా

సిరి యురమందు నుండ విలసిల్లెడి విష్ణువె వేంకటేశుడై

తిరుమలలోన వర్ధిలెను దేవుడుగా, శశిమౌళి ! ప్రీతిగన్.

***359. వాలిని భార్యగా గొనిన స్వామి జగమ్ముల బ్రోచు నెప్పుడున్.***

ఉ. శ్రీ లలనా స్వరూపిణిని, సీతను, భూజను బెండ్లియాడి, దా
నాలము లోన రాక్షసుల నంతము జేయగ రామచంద్రుడున్
లీల జరించె, భావి నవలీలగ లంక దహింపజాలు తత్
జ్వాలిని భార్యగా గొనిన స్వామి జగమ్ముల బ్రోచు నెప్పుడున్.

***360. జ్ఞానము లేనివాడు ఘన గౌరవ దీప్తుల నందె సత్సభన్.***

ఉ. "శ్రీనిలయుండు శ్రీకరుడు శ్రేష్ఠుడు శిష్టుడు కృష్ణు డచ్యుతుం
డీ నరనాథనాథుడు ద్విజేశుడు పూజ్యుడు నగ్రపూజ స
న్మానము నందె జ్ఞాని" యని మాన్యు లనన్; శిశుపాలు డిట్లనెన్
"జ్ఞానము లేనివాడు ఘన గౌరవ దీప్తుల నందె సత్సభన్."

***361. మృత్యువు మానవాళికి నమేయ హితంబును గూర్చు నొప్పుగన్.***

ఉ. మృత్యువు లేని జీవనము మేలను దైత్యులు మందబుద్ధు, లా
మృత్యువు లేని దేవత లమేయునిలోన విలీనమౌదురే?
మృత్యువు దైవలీనతకు మెట్టగు, నే శ్రమ గూర్చనట్టిదౌ
మృత్యువు మానవాళికి నమేయ హితంబును గూర్చు నొప్పుగన్.

***362. ప్రమథులు విష్ణుభక్తిని దిరంబుగ దాలిచి రూర్ధ్వపుండ్రముల్.***

చం. అమలత నిత్యమున్ కడప యందలి దేవుని మందిరమ్ములో
సుమతిగ నిల్వునామముల శోభిలుచున్న గణేశు గాంచి, భా
వము గని, శ్రేష్ఠ మార్గ మని భక్తి భజించుచు వేంకటేశ్వరున్,
ప్రమథులు విష్ణుభక్తిని దిరంబుగ దాలిచి రూర్ధ్వపుండ్రముల్.

***363*. కాపురమున్ గ్రమించు నరకమ్మొక టున్నదె యెంచి చూడగన్?**

ఉ. కాపుర మౌను స్వర్గముగ కాంతుడు తోడుగ నున్న, నేడు నా
కాపురమందు తోడనగ కష్టమె, బంగరులేడి గోరి లం
కాపురమందు నొంటరిగ కాలము బుచ్చుచు నుంటి నిట్లు, నా
కాపురమున్ గ్రమించు నరకమ్మొక టున్నదె యెంచి చూడగన్?

***364*. అల్లుని జంపగా దలచె నాహవమందున మామ క్రుద్ధుడై.**

ఉ. "అల్లుడు నీకు, దేవకికి నష్టమ గర్భము నందు బుట్టినా
డెల్లర పూతనాదుల వధించినవా" డని నారదుం డనన్
ఝల్లనె గుండె కంసునికి, జంపగ నెంచెను కృష్ణు నంత; మే
నల్లుని జంపగా దలచె నాహవమందున మామ క్రుద్ధుడై.

***365*. నవరాత్రోత్సవముల్ గణింపగ దగున్ నాల్గౌ దినమ్ముల్ గనన్.**

మ. అవనిన్ బాలగ దర్శనమ్మిడెను, గాయత్రీ స్వరూపమ్ము క
న్గవకున్ గన్పడె, నన్నపూర్ణగను శ్రీ కాత్యాయనీ దేవిగా
నవలన్ గన్పడె దుర్గయే లలితగా, నాశ్చర్యమౌ మాకికన్
నవరాత్రోత్సవముల్ గణింపగ దగున్ నాల్గౌ దినమ్ముల్ గనన్.

***366*. స్నానంబున్ జప నిష్ఠ లేల? మడియున్ జందెంబు నాకేలరా?**

శా. నే నీ భక్తుడ, నీవె దిక్కని యెదన్ నీ సేవలో నుండు నీ
సేనన్ జేరితి, నన్ను బ్రోవుము దయన్ శ్రీ కాళ హస్తీశ్వరా !
నేనే తిన్నడ నేల నాకు తపముల్ నీ మంత్రముల్ తంత్రముల్?
స్నానంబున్ జప నిష్ఠ లేల? మడియున్ జందెంబు నాకేలరా?

***367. శాల్యోదన మిచ్చు నొక్కొ జవసత్త్వంబుల్?***

(కందపద్య పాదానికి మత్తేభవృత్తమున పూరణ)

మ. అమితామ్లమ్ముల, మాంసకృత్తులను మాంసాహార మందించు, మా
ది మహద్భోజన మెన్న మా యమెరికా దేశస్థు లీ మాంసమున్
దమితో దిందురు, కాంతురయ్య జవసత్త్వా, లేల మీమాంసలున్?
తమ శాల్యోదన మిచ్చు నొక్కొ జవసత్త్వంబుల్ సువిప్రోత్తమా?

***368. చిన్నయ సూరి చేత మృతి జెందె నయో మన తెల్గుబాసయే.***

ఉ. వన్నెల తెల్గులోన పరవస్తు రచించెను నీతిచంద్రికన్,
సన్నుతు లందినా డతడె చక్కగ వ్యాకరణమ్ము వ్రాసి, నా
చిన్నయసూరి సేవలను జెప్పక నిట్టుల బల్కవచ్చునే?
"చిన్నయ సూరి చేత మృతిఁ జెందె నయో మన తెల్గుబాసయే"

***369. అష్టమి నాడె యట్లతదియన్ జరుపందగు కాంత లెల్లరున్.***

ఉ. "ఇష్టుడు భర్త యౌను, వరియించును భాగ్యము మిమ్ము, చింతలున్
భ్రష్టములౌ నుమన్ బహుళ పక్షములో తదియన్ భజింప, నా
కిష్టమె యట్లతద్ది యని" యేర్పడ జెప్పితి ముందుగానె నే
నష్టమి నాడె; యట్లతదియన్ జరుపందగు కాంత లెల్లరున్.

***370. అందఱిలోన నొక్కడగు నందఱు నొక్కనిలో వసింతురే.***

ఉ. అందఱి బ్రోవ కృష్ణుడె యఘాసురు జంప, బరీక్ష బెట్టగా
నందఱి దాచె బ్రహ్మ, పరమాత్ముడు గోవులు గోపకాళియై
యందఱి రూప మందగనె యాతని జూచి యజుండు పల్కె "వీ
డందఱిలోన నొక్కడగు నందఱు నొక్కనిలో వసింతురే."

***371. ముదిత నపుంసకున్ గలసి పుత్రుని బొందుట చిత్ర మెట్లగున్?***

(నపుంసకుడైన జోస్యం చెప్పే వ్యక్తిని కలసి, తప్పిపోయినపుత్రుని జాడ తెలిసికొన్న తల్లి)

చం. "అదరకుమా నపుంసకుడటంచు, గనుంగొన నౌను పుత్రునిన్,
పద మహిమాన్వితుం డతడు బాగుగ జెప్పును జోస్యమిట్లు దా
రిది యని" యంచు పెద్ద లన నేగెను తల్లి సుతున్ గనంగ, నా
ముదిత నపుంసకున్ గలసి పుత్రునిఁ బొందుట చిత్ర మెట్లగున్?

***372. పుష్టిని దుష్టి నిచ్చు నట పుర్వుల మందులు ఖ్రింగ మేలగున్.***

ఉ. స్పష్టత నుక్తలేఖనము వ్రాయగ జెప్పితి నిట్లు వాక్యమున్
"పుష్టినిఁ దుష్టి నిచ్చు నఁట పూర్వుల మందులు మ్రింగ మేలగున్"
భ్రష్టత కొమ్ముదీర్ఘమును హ్రస్వముగా లిఖియించె వీడిటుల్
"పుష్టిని దుష్టి నిచ్చు నట పుర్వుల మందులు మ్రింగ మేలగున్."

***373. కోడిని బట్టి ముక్కలుగ గోసి భుజించిరి గాదె శ్రోత్రియుల్.***

ఉ. కోడిని బ్రాహ్మణోత్తములు కోరి భుజింతురు చూడు డంచు తా
నాడుచు, కేకు జన్మదిన మందున కుక్కుట రూపమొప్పగా
వాడుచు, పందెమున్ గెలిచె పద్ధతిగా నొక వాగ్మి ; సత్యమే
కోడిని బట్టి ముక్కలుగ గోసి భుజించిరి గాదె శ్రోత్రియుల్.

***374. హర్మ్యం బందున మట్టిచె ట్టెదిగె నాహా యూర్ధ్వమూలమ్ముగన్.***

శా. భర్మ్యంబా యని సంశయింప నొకడున్ భావింపగా లేడిటన్
ధర్మ్యం బియ్యది యెంచ నీ మయసభాతత్త్వమ్మె, యీ నీటిలో
హర్మ్యం బుండె నధోముఖ మ్మగుచు మాయన్, నేల నద్దాల నీ
హర్మ్యం బందున మట్టిచె ట్టెదిగె నాహా యూర్ధ్వమూలమ్ముగన్.

***375. మంచిని బెంచువార లిల మందమతు ల్గద యెంచి చూడగన్.***

ఉ. మంచిని బెంచినాడు గద మాటల జేతల జిత్తవృత్తి దా
నంచిత రీతులన్ పరమహంస మహాత్ముడు రామకృష్ణు, డా
మంచిని నాచరింపకయె మాటలు సెప్పుట యందు మాత్రమే
మంచిని బెంచువార లిల మందమతు ల్గద యెంచి చూడగన్.

***376. దీపావళి పండుగన్ జరుపనౌ గద పున్నమినాటి రాతిరిన్.***

(ఛందోగోపనము.)

ఉ. పావక లింగ రూపము శుభ మ్మరుణాచల మాశ్రితావళిన్
గావ శివుండు నిల్చె గిరిగా, నట పున్నమియే ప్రశస్తమౌ
నే విధి నైన నేగి వెలిగింపుము కార్తిక మాసమందు దీ
పావళి, పండుగన్ జరుపనౌఁ గద పున్నమినాటి రాతిరిన్.

***377. హలమున రాఘవుండు దనుజాధిపు జంపెను సంగరంబునన్.***

చం. లలనను గోలుపోయి, ఖల రావణ చౌర్యముఁ దా నెఱింగి, భూ
తలమున సీతకై వెదకి, తమ్మునితో ఘన వానరాళితో
జలధిని దాటి, లంకఁ జని, సాధ్వివిముక్తిని జేయ గోరి సిం
హలమున రాఘవుండు దనుజాధిపు జంపెను సంగరంబునన్.

***378. మాతలు మువ్వురైన నొక మాతనె కొల్చుట నీకు భావ్యమే?***

ఉ. మాత యనుజ్ఞ గైకొనక, మాత గతిన్ గనకుండ, నా జగ
న్మాతల మువ్వురిన్ గొలువ నమ్మెడి కౌశికు డేగి, వ్యాధునిన్
మాతను గొల్చువాని గనినా డట లోన దలంచె నిట్టులన్
మాతలు మువ్వురైన నొక మాతనె కొల్చుట నీకు భావ్యమే?

***379. నరక నిహంత యయ్యె గద నాగగళుం డగజాత మెచ్చగన్.***

చం. వరదుడు భక్తవత్సలుడు భర్గుడు ప్రాణము నిల్పు నొక్కచో,
కరుణను వీడి యా విలయ కాలుడె ప్రాణము దీయు నొక్కచో,
పురములు లోక పీడ నిడ పూర్తిగ వాటిని నుగ్గు జేయ వే
నరక, నిహంత యయ్యె గద నాగగళుం డగజాత మెచ్చగన్.

***380. తిమిరము నిండు నెల్లెడల దీపము లెన్నియొ వెల్గుచుండినన్.***

(నరకాసురుని భార్యయొక్క విలాపము)

చం. సమరము జేసె సత్య మనసా వచసా ఘన కర్మణా, భయం
బమరెను నాకు, నే విధవ నైతిని నాథుని గోలుపోయి, నే
డమరెను దీపకాంతులు ప్రజావళి గూర్పగ, నా మనమ్మునన్
తిమిరము నిండు నెల్లెడల దీపము లెన్నియొ వెల్గుచుండినన్.

***381. భరతుడు భ్రాతృవత్సలత బాదుక లిచ్చెను రామమూర్తికిన్.***

చం. శిరమున రామపాదుకల జేర్చిన భక్తుడు, నందిసీమ భా
సురమతి నన్నకై యెదురుచూచి చతుర్దశ వర్షముల్, మహా
వరమగు రామరాజ్యమని పల్కుచు, రాముడు వచ్చినంతనే
భరతుడు భ్రాతృవత్సలత బాదుక లిచ్చెను రామమూర్తికిన్.

***382. తోడం బుట్టిన చెల్లె లగ్రజునకున్ ద్రోహమ్ము జేసెన్ గదా!***

శా. వీడన్ బోవకు రాము, సీత గొనుమా! వీరాగ్రజా! రావణా!
యీడౌ నామె యటంచు, శూర్పణఖ భ్రాతృప్రేమ మించంగ మా
టాడంగా, యమబాధ గూర్చె భగినీహస్తమ్ము చిత్రమ్ముగా,
తోడం బుట్టిన చెల్లె లగ్రజునకున్ ద్రోహమ్ము జేసెన్ గదా!

***383*. లయమే శాంతిని గల్గ జేయును గదా రంజిల్ల సన్మార్గమై.**

మ. లయ మేరీతిని శాంతిగూర్చు ననుచున్ ప్రశ్నింపగా, బంధనా
లయమే యౌను ప్రపంచ మెన్న, ఘన వైరాగ్య ప్రద మ్మైన యా
లయమే చూడ శ్మశానభూమి యనె లీలన్ జూషువా; యీ భవా
లయమే శాంతిని గల్గ జేయును గదా రంజిల్ల సన్మార్గమై.

***384*. కప్పను గాంచి పాము వడకం దొడఁగెం గడు భీతచిత్తయై.**

ఉ. అప్పుడు నాకు నీకు మన కందఱికిన్ హరి విష్ణుమూర్తియై
యప్పుడు సర్వజీవులకు నప్పడుబ్రహ్మకు, బాలకృష్ణుడై
తెప్పున నాడి కాళియుని దిప్పలు పెట్టుచునుండ తాళలే
కప్పను గాంచి పాము వడకం దొడఁగెం గడు భీతచిత్తయై.

***385*. మాఘము సంక్రమించినది మార్గశిరమ్మున కార్తికం బనన్.**

ఉ. శ్రీ ఘన యజ్ఞకర్తగ విశిష్టత వృత్రు డపస్వరోక్తి పా
పౌఘము నంది చచ్చె నని యందురు పెద్దలు, పూజలోన పా
పౌఘము గల్గ మాసమును పల్కితి వేఱుగ, నాకు దోషనా
మాఘము సంక్రమించినది మార్గశిరమ్మున కార్తికం బనన్.

***386*. పందిని జూచి శంకరుడు పార్వతిగా దలపోసె ముగ్ధుడై.**

ఉ. అందఱి చిత్తమున్ గలచు, నందఱి నందము నందు మించు, తా
నందఱి కామవృద్ధికి మహత్తర రూపిణి యౌచు నిల్చు, నా
ముందర నిల్చె నిప్పు డని మోహిని నాట్య విలాస ముద్ర ని
ష్పందిని జూచి శంకరుడు పార్వతిగా దలపోసె ముగ్ధుడై.

{నిష్పందిని = స్పందన లేకుండా ఉన్నటువంటిది)

***387. చదువులు బాలబాలికల జ్ఞానము నాశ మొనర్చు వద్దురా.***

చం. చదువులు చక్కగా వినయ సంపద నీయ క్రమక్రమమ్ముగా
నది యిడు పాత్రతన్ ధనము నంతట సౌఖ్యము నాడు, నేటి యీ
చదువులు పాత్రమౌ వినయ సంపద నీయవు గాన, వద్దు యీ
చదువులు, బాలబాలికల జ్ఞానము నాశ మొనర్చు వద్దురా.

***388. మార్కండేయునికిన్ సుతుం డగుచు జన్మం బందె సామీరియే.***

శా. "అర్కున్ వ్యాకరణమ్ము నేర్పుమనె విద్యాసక్తుడై, వాయు సం
పర్కం బందిన యంజనాంబకు మహాభాగ్యమ్ముగా బుట్టె, యీ
తర్కం బే"లని మారుతిప్రభవ మంతా జెప్పె మిత్రుం డిటుల్
మార్కండేయునికిన్ "సుతుం డగుచు జన్మం బందె సామీరియే."

***389. గల గల బాఱునట్టి సురగంగను మున్గిన గల్గు బాపముల్.***

చం. కలి మల దోషు లెల్ల మునుగంగనె వారల పాప మంటుటన్
గల గల బాఱునట్టి సురగంగను మున్గిన గల్గు బాపముల్
వల దిట స్నానపానమని పల్కకు మూర్ఖత, సాధు సంతు లీ
జలమున మున్గ గంగ యగు శస్తముగా, మునుగంగ రమ్మురా.

***390. రణములె పండితోత్తముల రమ్యపు క్రీడలు సాహితీసభన్.***

చం. రణమును జేయు పృచ్ఛకులు ప్రశ్నల బాణము లేయ, పద్యతో
రణములతోడ, శబ్ద గత రమ్య చమత్కృతి తోడ, పూర్ణ ధా
రణముల తోడ సభ్య జన రాశి మనమ్ముల గెల్వ, జేయు పూ
రణములె పండితోత్తముల రమ్యపు క్రీడలు సాహితీసభన్.

***391. సహకారమ్మె తొలంగజేయును గదా శాంతిన్ సుఖమ్మున్ భువిన్.***

మ. "వహియించున్ గద రాము డీ భువి, నికన్ పట్టాభిషేక మ్మగున్,
గహనమ్మేగును బిడ్డడౌ భరతుడే, కైకా!" యనన్ మంథరన్
కుహనావాదిని గూడి కైక చెడె; నీకున్ ముప్పగున్ దుష్ట వా
క్సహకారమ్మె తొలంగజేయును గదా శాంతిన్ సుఖమ్మున్ భువిన్.

***392. బకమును మ్రింగుచున్న దొక బల్లి గనుంగొనుమయ్య! మిత్రమా!***

చం. అకట విచిత్ర మీ జగతి నాకలిబాధకు దాళలేక యం
తకులుగ మారు జీవు లిది ధర్మమె, కప్పను పాము మ్రింగు, దీ
నికి వగపేల? మక్షికము నిల్వగ మ్రింగియు వే తదీయ శా
బకమును మ్రింగుచున్న దొక బల్లి గనుంగొనుమయ్య! మిత్రమా!

***393. రమ్మని పిల్చె దండ్రి తొలిరాత్రికి కూతును ప్రేమ మీఱగన్.***

ఉ. "నెమ్మది నీవె పెంచితివి, నిత్యము బిడ్డగ నెంచి చెల్లెలిన్
సమ్మతి పెద్ద జేసితివి, చక్కగ పెండిలి జేసినావు; కో
పమ్మున చెల్లి పల్కెనను బాధను దీవెన లీయకుందువా?
రమ్మ"ని పిల్చె దండ్రి తొలిరాత్రికి కూతును ప్రేమ మీఱగన్.

***394. మోసము జేయు వారలకె మ్రొక్కదగున్ సుజనుల్ హితార్థులై.***

ఉ. ఆసగ చందమామ గని యార్తిని కోరగ, తెచ్చియిత్తు నీ
కోసము బువ్వ దిన్న యని గొప్పగ బిడ్డకు జెప్పు తల్లియున్,
వాసిగ రోగి యుండు నను వైద్యుడు, కావున మేలు గూర్చగా
మోసము జేయు వారలకె మ్రొక్కదగున్ సుజనుల్ హితార్థులై.

***395*. చల్లని నీటిచే నొడలు సర్వము గాలె నదేమి చిత్రమో?**

ఉ. చల్లని నీరిడున్ షవరు చక్కగ నిట్టులు త్రిప్ప , వేడినీ
రల్లన వచ్చెడిన్ సెగల నట్టులు త్రిప్పగ; నట్లు త్రిప్ప మా
చెల్లికి కాలెగా, తడుప జెల్లును దీని శరీర మెల్ల నీ
చల్లని నీటిచే, నొడలు సర్వము గాలె నదేమి చిత్రమో?

***396*. విద్యలు లేని మానవుడె విజ్ఞుడుగా జనమాన్యతన్ గనున్.**

ఉ. విద్యలు గూఢ గుప్త ఘన విత్తములౌ, వినయప్రదమ్ములౌ,
విద్యలు దైవతమ్ములగు, విద్యలు భోగయశస్కరమ్ములౌ,
విద్యలు రాజపూజ్యములు వీటిని గాంచినవాడె, క్షుద్రధీ
విద్యలు లేని మానవుడె విజ్ఞుడుగా జనమాన్యతన్ గనున్.

***397*. కనబడి రష్డు వానరులుగా కవివర్యులు తత్సభాస్థలిన్.**

చం. వనమున రామలీల కవివర్యులచే నటియింపజేయగా,
ఘన కపు లెల్ల జానకిని గాంచుటకై సభ దీర్చ, నంగదుం
డొనరిచె నిర్ణయమ్ముల నహో కపివర్యుల జూచి, వింతగా
కనబడి రష్డు వానరులుగా కవివర్యులు తత్సభాస్థలిన్.

***398*. వలలుని జంపె కీచకు డవక్ర పరాక్రముడై రణంబునన్.**

చం. 'వలలుడు జంపె కీచకు నవక్ర పరాక్రముడై రణంబునన్'
కలగక దీని మార్చు డిక కర్మణి వాక్యముగా ననంగనే;
తొలుత నొకండు వ్యాకరణ దోష మెఱుంగక మార్చె నిట్టులన్
'వలలుని జంపె కీచకు డవక్ర పరాక్రముడై రణంబునన్'.

***399. నల్లగ నున్న మల్లెలను నాతి ముదంబున దాల్చె గొప్పునన్.***

ఉ. మల్లెల బూజ జేసితిమి మాలల గట్టుచు నిన్ని రోజు, లీ
మొల్లల బంతులన్ కలువపూవుల నీ కనకాంబరాల నే
డల్లన పూజ జేసెద మటంచు సఖుల్ వెస వాటి నార్తితో
నల్లగ; నున్న మల్లెలను నాతి ముదంబున దాల్చె గొప్పునన్.

***400. చన్నులు లేని యావులు బ్రసన్నత బాల నొసంగె బానెడున్.***

ఉ. చన్నులు పాల నిచ్చు గద సంతతి బ్రోవ, నజా గళస్థమౌ
చన్నులు పాల నీవు గద, సార్థకతన్ గనజాలవెన్న డా
చన్ను లహో! యజాళి మెడచన్నుల వోలె నిరర్థకమ్ములౌ
చన్నులు లేని యావులు బ్రసన్నత బాల నొసంగె బానెడున్.

***401. కాశ్మీరమ్మున నుగ్రవాద మొసగున్ కళ్యాణ మిద్ధాత్రికిన్.***

శా. వేశ్మమ్మందున శాంతి లేక సుఖముల్ వెల్గొందునే, మేటి గ్లా
రశ్మల్ పండునె? త్యాగరాజ పదముల్ రాజిల్లునే? గుండె తా
నశ్మ మ్మట్టుల నుండు; శాంతి యిల ధ్యేయం బైనచో, మాయమౌ
కాశ్మీరమ్మున నుగ్రవాద, మొసగున్ కళ్యాణ మిద్ధాత్రికిన్.

***402. పతి పాదార్చన కార్తికమ్మున గడున్ భద్రమ్ము జేకూర్చులే.***

మ. అతిభక్తిన్ వర కార్తికమ్మున హరిన్ ప్రార్థించుచున్ ద్వాదశీ
వ్రతమున్ జేసెడి యంబరీషు గని దుర్వాసుండు శిక్షింపగా
మతి నెంచన్, మధువైరి చక్రమును బంపన్ భద్రముల్ గల్గె; శ్రీ
పతి పాదార్చన కార్తికమ్మున గడున్ భద్రమ్ము జేకూర్చులే.

**403. భయమున బాఱదే మదనపల్లె ప్రజాళి వధాన మన్నచో.**

చం. ప్రియమున నాముదాల మురళీ సభ కేగము, తద్వధానముల్
రయమున హృద్య పద్యముల రంజిల జేయును, కట్టివేయు నా
మయసభ వోలె, నేగినను మాగృహకార్యము లాగిపోవునన్
భయమునఁ బాఱదే మదనపల్లె ప్రజాళి వధాన మన్నచో.

**404. ఆంగ్లమునందు పోతన మహాకవి భాగవతమ్ము వ్రాసె బో.**

ఉ. ఆంగ్లమునందు భాగవతమన్నది లేదని యొక్కరుండు తా
నాంగ్లము నేర్చుకొంచు, మన యాంధ్రులె కాదు విదేశవాసులై
యాంగ్లము మాటలాడు జను లందఱు శాంతిని బొందునట్లుగాన్
ఆంగ్లమునందు "పోతనమహాకవిభాగవతమ్ము" వ్రాసె బో.

**405. పుత్రా రమ్మని పిల్చె భార్య మగనిన్ మోదమ్ము చెన్నారగన్.**

శా. "పుత్రా రమ్మని పిల్చె భార్య మగనిన్" పూరింపలేనయ్య! వాక్
పుత్రా! ప్రాసయు కష్టమయ్యె నిట సంపూర్ణమ్ముగా భారతీ
పుత్రా! పాత్ర! మదార్యపుత్ర! కిటుకున్ బోధింపుమా శారదా
పుత్రా! రమ్మని పిల్చె భార్య మగనిన్ మోదమ్ము చెన్నారగన్.

**406. రసమయ కావ్యమే జనుల రక్తి దొలంగగ జేయు నెప్పుడున్.**

చం. రసనలు దివ్య భాగవత గ్రంథ ఫలస్థ సుభక్తి వాక్సుధా
రసముల గ్రోల, పొందిరి విరక్తిని నాడు శుకాదు లెల్ల, దు
ర్వ్యసనము లెల్ల దూర మగురా! వినరా! నర! ముక్తి నిచ్చు, ద
ద్రసమయ కావ్యమే జనుల రక్తి దొలంగగ జేయు నెప్పుడున్.

**407. త్రాగిన మానవోత్తములు ధన్యత గాంతురు లోకమందునన్.**

ఉ. రాగము గూర్చు ద్వేషమిదురా విషవృక్షముగా ప్రపంచమే
సాగు, నొసంగు కావ్యసుధ సజ్జనసంగతి యన్ ఫలమ్ములన్;
వేగమె సజ్జనావళిని ప్రీతిగ జేరిన, కావ్యధీసుధన్
త్రాగిన మానవోత్తములు ధన్యత గాంతురు లోకమందునన్.

**408. ఎన్నుకొనంగ నొప్పు మన కేలికగా నొక దున్నపోతునే.**

ఉ. ఎన్నిక లందు గుర్తులుగ నిచ్చిరి తేలును దున్నపోతు, నీ
యన్నది దున్నపోతు గుఱుతయ్యె, విషక్రిమి తేలు మేలె? యా
మిన్నులు గూలినన్ స్థిరత మేలును గూర్చును దున్నపోతు, మీ
రెన్నుకొనంగ నొప్పు మన కేలికగా నొక దున్నపోతునే.

**409. కరణము నమ్ము వారలకు గల్గు శుభమ్ములు నిశ్చయమ్ముగన్.**

చం. త్వరపడి ముందు యుద్ధమని పల్కకు, సామము దాన భేదముల్
వరుసగ నుండె నమ్మగ, శుభప్రదముల్ జయ సిద్ధి గూర్చి సం
బరమిడు, మూడు రీతుల నుపాయములన్ ఫల సిద్ధి నందలే
క రణము నమ్ము వారలకు గల్గు శుభమ్ములు నిశ్చయమ్ముగన్.

**410. ఖరమును గౌగలించుకొనె గాంత యొకర్తుక సంతసంబునన్.**

చం. మురిసితి గర్భ మాయెనని, పుట్టవలెన్ మన బిడ్డ డెర్రగా,
కొఱత తొలంగ వర్ణమున, కుంకుమ పువ్వును తెమ్మనంగ నా
ర్తి రమణి, భర్త కృష్ణ వలె తెచ్చెను వృక్షమునే; తదగ్నిశే
ఖరమును గౌగలించుకొనె గాంత యొకర్తుక సంతసంబునన్.
(అగ్నిశేఖరము = కుంకుమ వృక్షము)

**411. పవనసుతుండు రాముని సభాస్థలి దా బరిహాస మాడెగా.**

చం. "అవనిజ జూడకున్న, జనకాత్మజ కుంగర మీయకున్న, నీ
వె వినగ సీత జాడ వినిపించక యున్నను, దీను లక్ష్మణున్
భువి బ్రతికింపకున్న కథ పూజ్య" మనెన్ గద నాటకమ్ములో
పవనసుతుండు, రాముని సభాస్థలి దా బరిహాస మాడెగా.

**412. ఓడినవారు నవ్వి రయయో యని గెల్చిన వార లేడ్చిరే.**

ఉ. వాడివి దొంగఓట్లనుచు, పంచెను డబ్బును కోట్లలోన నం
చోడినవారు తక్షణమె యోరిమి గోల్పడి కోర్టు కేగ, కా
పాడుచు కోర్టు న్యాయమును పల్కిన దెన్నిక చెల్లదం, చహో
యోడినవారు నవ్వి, రయయో యని గెల్చిన వార లేడ్చిరే.

**413. దేశము వీడిపోయిన నదృష్టము గల్గదె యెల్లవారికిన్.**

ఉ. "దేశము భారతమ్ము వినుతిన్ గనె, విశ్వవిజేత! పోకు మా
దేశము గెల్వ జాల" వని తెల్పెను గ్రీకుల తత్వవేత్త; "యా
దేశములోని మట్టి, వరతీర్థము గంగయు, రామగాథ, సం
దేశము నిచ్చు భారతము, దివ్య గురుండును ముక్తి నిచ్చు, నా
కాశియు" గాన, మా యమెరికా మనుమం డిటు పల్కినాడు "మా
దేశము వీడిపోయిన నదృష్టము గల్గదె యెల్లవారికిన్"

**414. రమణీ పాశురముల్ పఠించిన ధనుర్మాసంబునన్ బాపమౌ.**

మ. సుమతిన్ బొందుచు,జిత్తశుద్ధి గలుగన్ శోభిల్లుచున్, కృష్ణుపై
మమతన్ పాశురముల్ పఠించిన ధనుర్మాసంబునన్ పుణ్యమౌ;
సుమతిన్ వీడుచు, చిత్తశుద్ధి తొలగన్ క్షుద్రార్థముల్ గోరుచున్
రమణీ! పాశురముల్ పఠించిన ధనుర్మాసంబునన్ బాపమౌ.

**415. హను మద్వాలము ద్రొక్కె నర్జునుడు దా నత్యంత రౌద్రమ్మునన్.**

మ. కనుమా కోపము ప్రేయసీప్రియులకున్ గల్గున్ గదా యంతటన్
వినుమా నెచ్చెలి నాదు ప్రేమ కథనే విన్పింతు "నో పార్థ! చే
కొనుమా నీదు 'ఉలూచి' నంటి, వ్రతమున్ గోల్పోదునే యన్న యూ
హను మద్వాలము ద్రొక్కె నర్జునుడు దా నత్యంత రౌద్రమ్మునన్.

**416. బకమే చాలును ప్రాణముల్ గొనగ గర్వంబొంద నీకేటికిన్?**

మ. అకలంకుండగు రామచంద్రుడు ఘనుం డాదర్శశీలుండు తా
నొక బాణమ్మున గొట్టినాడు ఘన సాలౌఘమ్ము నా వాలి, నా
గక వార్ధిన్ భయపెట్టె, రావణ! నినున్ ఖండింప వచ్చెన్ తదం
బకమే చాలును ప్రాణముల్ గొనగ గర్వంబొంద నీకేటికిన్?

**417. కవి యొక్కండును గానరాడు గద యా కర్నూలునన్ జూడగన్.**

మ. స్తవ ముప్పొంగ నపర్ణ శ్రీ బులుసు వంశ ఖ్యాతినే పెంచగా
నవనిన్ జేసె శతావధానమును తా నా వాణియై, మేటి స
త్కవులై వెల్గిరి పృచ్ఛకుల్ ఘనులు సత్కారార్హు లచ్చోట కా
కవి యొక్కండును గానరాడు గద యా కర్నూలునన్ జూడగన్.

**418. ఒకడా ఇద్దఱ ముగ్గురా నలుగురా యూహింప నింకెందఱో?**

మ. ఇకపై ఒత్తిడి దూరమౌ చదువు నేర్పించంగ గర్తవ్యమౌ,
నకటా! ఒత్తిడి తోడ మాకు గతియౌ నయ్యాత్మహత్యల్, సఖుల్
వికలత్వంబున వీడినా రసువులన్ విద్యార్థులై; యెంచగా
నొకడా ఇద్దఱ ముగ్గురా నలుగురా యూహింప నింకెందఱో?

**419. చారును దూరముంచిననె సాగును జీవిత మద్భుతంబుగా.**

ఉ. 'చారుమతీ' సునామమున చక్కగ నుండెడి భామ యోర్తు, సం
సారము గూల్చు కొండెముల సంతతమున్ వచియించు, చారనన్
పేరును బెట్టి పిల్చినటు వేగమె వచ్చును, పిల్వబోకు మా
చారును, దూరముంచిననె సాగును జీవిత మద్భుతంబుగా.

**420. నెల జూపించి లతాంగి యేడ్చె నట కన్నీరొత్తుచున్ పయ్యెదన్.**

మ. అలవోకన్ నను ప్రేమ డించి చనె దుష్యంతుండు నాథుండు నె
చ్చెలి! రాడాయెను నేటికిన్, విరహమే సిద్ధించె నంచున్, శకుం
తల చంద్రున్ గని చింత నందె, ఘన బాధన్ గూర్చు వాడంచు వె
న్నెల జూపించి లతాంగి యేడ్చె నట కన్నీరొత్తుచున్ పయ్యెదన్.

**421. చీమల కేనుగుల్ గలిగె చిత్ర మదెట్టులో విప్పి చెప్పుమా!**

ఉ. పామర! వీర బ్రహ్మ గురువర్యుల వాక్కు ఫలించి నీటితో
నీ మహి దీపముల్ వెలిగె, నేనుగు పుట్టెను పందికిన్, భళీ
భామ వితంతువై ప్రజల బాగుగ నేలెను కాన నట్టులే
చీమల కేనుగుల్ గలిగె, చిత్ర మదెట్టులో విప్పి చెప్పుమా!

**422. వనమున లభ్యమౌ నఖిల భాగ్య సుఖంబులు మానవాళికిన్.**

చం. జను లిల మాతృభక్తి గుణ సంయుతులై, పితృభక్తియుక్తులై,
ఘన గురుభక్తియుక్తులయి, కామవియుక్తులు, దేశభక్తులై,
మునులయి, త్యాగశీలురయి మోదముతో జరియింప ధర్మజీ
వనమున; లభ్యమౌ నఖిల భాగ్య సుఖంబులు మానవాళికిన్.

***423. కన్నుల నీరు నింపుకొని కట్టెను తాళి వధూగళమ్మునన్.***

ఉ. సన్నుత వేదమంత్రముల జక్కగ బల్కు వరుండు భావమున్
మిన్నగ నెంచి, ధర్మ మిల మేలని యెంచుచు, తల్లిదండ్రులున్
మన్నన గూర్చుచుండ, మది నర్తిల, వర్తిల హర్షమోదముల్
కన్నుల నీరు నింపుకొని కట్టెను తాళి వధూగళమ్మునన్.

***424. దొండతీగకు బెండ కాయుట దుర్లభం బెటు లౌనురా?***

మత్తకోకిల

పిండి సైకత మందు తైలము వేగ దీయుదు నంటివే?
ఎండమావుల నీరు త్రాగెద నిచ్చ దీరగ నంటివే?
దండిగా శశకంపు కొమ్ముల ధాత్రి దెచ్చెద నంటివే?
దొండతీగకు బెండ కాయుట దుర్లభం బెటు లౌనురా?

***425. అంధుడు గాంచె నచ్చట మహాద్భుతమై వెలుగొందు రూపమున్.***

ఉ. "బంధములోన చిక్కితిని స్వార్థముతో ధృతరాష్ట్రుడన్, కృపా
సింధుడ వీవు, నాకు నిట శీఘ్రము చూపుము విశ్వరూపమున్
బంధువు" నన్న కృష్ణుడు "శుభ" మ్మని దృష్టి నొసంగ నంత నా
యంధుడు గాంచె నచ్చట మహాద్భుతమై వెలుగొందు రూపమున్.

***426. పతిని బరిత్యజించి యొక భామ పతివ్రతగా నుతుల్ గొనెన్.***

చం. గతమున దక్షయజ్ఞమున గాంతుని నింద భరించలేక, యే
గతి నిక మోము చూపగల కాంతుని కంచును క్రుంగిపోవుచున్,
చితిఁ బడిపోయె మానవతి జీవితనాథు దలంచుకొంచు; నౌ
పతిని బరిత్యజించి యొక భామ పతివ్రతగా నుతుల్ గొనెన్.

**427. చినవాడే యొనరించెనా యిటుల ఛీ ఛీ పెక్కు దుష్కృత్యముల్.**

మ. "చినవాడే? సరసుండు కృష్ణు డతిగా చిత్రమ్ముగా మమ్ము నే
చినవాడే" యనగా; యశోద యనె "మా చిన్నారి వ్రేపల్లెఁ బ్రో
చినవాడే, ఘన పూతనాదుల వెసన్ శిక్షించి మోక్షమ్ము ని
చ్చినవాడే యొనరించెనా యిటుల ఛీఛీ పెక్కు దుష్కృత్యముల్!"

**428. హరుడే సంతత లోక విత్త హరుడై యన్యాయమున్ జేసెడిన్.**

మ. హరుఁడే పల్కును భక్తపాపహరుడే యంచున్ హరిన్, మామనో
హరుఁడే వీడు త్రివిక్రముం డగుచు నే డాశించె ముల్లోకముల్,
హరుఁడే యన్నటు విక్రమించె, బలి నాహో దాతగా మార్చె, శ్రీ
హరుడే సంతత లోక విత్త హరుడై యన్యాయమున్ జేసెడిన్.

**429. చెడువా డీత డటంచు బల్కెద రయో శ్రీ రామమూర్తిన్ గవుల్.**

మ. చెడువా డంచు గురుండు బల్కగ వధించెంగా సుబాహున్, రమిం
చెడువా డీతడు యోగిమానసములన్, శ్రీరూప లక్ష్మిన్ వరిం
చెడువా డీతడు, ధర్మవర్తన మిలన్ క్షీణింపగా నుద్ధరిం
చెడువా డీతడు, దుష్టరాక్షసతతిన్ శిక్షింప మూర్తిన్ ధరిం
చెడువా డీతడు, భక్తపాలనకళాశ్రీమంతుడై వారి బ్రో
చెడువా డీతడు, సజ్జనావళి సదా సేవింపగా వారి గా
చెడువా డీతడు ప్రాణికోటికి తుదన్ శ్రీధామమౌ ముక్తి ని
చ్చెదు వాడంచు నుతింప; రావణుడనెన్ ఛీ మూర్ఖులై మోక్ష మి
చ్చెడువా డీత డటంచు బల్కెద రయో శ్రీ రామమూర్తిన్ గవుల్.

**430. కోపగించిన రాము డప్పుడు కోల నేసెను సీతపై.**

మత్తకోకిల

"పాపి రావణనేత రాముని భామనే హరియింపగా
కోపగించిన రాము డప్పుడు కోల నేసెను నేతపై"
ఈ పదమ్ముల వ్రాయు డన్న లిఖించె బాలకు డీ విధిన్
"కోపగించిన రాము డప్పుడు కోల నేసెను సీతపై"

**431. కష్టము లెల్ల దీరెనని కార్చిరి కంటను నీరు భీతితోన్.**

(సుఖములలో ఉన్న భక్తుల మనోభావన)

ఉ. కష్టము లున్నచో మనకు కల్గును నిత్యము దైవచింతనల్,
కష్టము లేనిచో కలుగు గర్వ మహంకృతి పాపభీతియున్,
'కష్టమె కోరె కుంతి' యనగా మనమెంత యటంచు సజ్జనుల్
కష్టము లెల్ల దీరెనని కార్చిరి కంటను నీరు భీతితోన్.

**432. కల్లోలమ్ము నిరంతరాయ మగుతన్ కాశ్మీరదేశమ్మునన్.**

శా. ఉల్లాసమ్మున హాస మొంది కమల మ్మువ్పొంగె, కాశ్మీరమే
యెల్లన్ వీడుచు భారతోర్వి జమ యయ్యెన్, మోది మోదించె, తా
నల్లాడెన్ ఖలుడొక్కరుండు తగదీ యన్యాయమం చిట్లనెన్
"కల్లోలమ్ము నిరంతరాయ మగుతన్ కాశ్మీరదేశమ్మునన్."

**433. మాతను భర్తగా గొని యుమాసతి గాంచెను కార్తికేయునిన్.**

ఉ. భూతపతిన్ మహానటు విభున్ శివు శంభుని శూలి నీశ్వరున్
భూతినిదాల్చు తాపసిని మోహనరూపుని కృత్తివాసునిన్
పూతుని చంద్రశేఖరుని పుంగవవాహను స్థాణు దక్షజా
మాతను భర్తగా గొని యుమాసతి గాంచెను కార్తికేయునిన్.

***434. కలిమి తొలంగినప్పుడె సుఖంబు లభించును మానవాళికిన్.***

చం. బలి నటు నిగ్రహింప గని, "వామనమూర్తి! త్రిలోకరాజ్యమున్
గొలిచి గ్రహించినాడ, విక కూరిమి జూపు" మటన్న బ్రహ్మతో
"కలిమి తొలంగ జేసెదను కావగ" నంచనె మాధవుం; డటుల్
కలిమి తొలంగినప్పుడె సుఖంబు లభించును మానవాళికిన్.

***435. మామకె మామగా నిలిచి మాన్యతఁ గన్న ఘనున్ స్తుతించెదన్.***

ఉ. మామగ మారె సాగరుడు మాసుత నిచ్చుచు విష్ణుమూర్తికిన్,
మామగ మారె విష్ణు వసమానుడు గంగ నొసంగి యబ్ధికిన్,
శ్రీమహితున్ జనార్దనుని శ్రీకరు పంచ వకార సంయుతున్
మామకె మామగా నిలిచి మాన్యతఁ గన్న ఘనున్ స్తుతించెదన్.

***436. మల్లెలలోన రేగినవి మంటలు బొబ్బలు పుట్టె నయ్యయో!***

ఉ. మల్లెల వంటి చిత్తముల, మాధవ పూజల జేయు గోపికల్,
మెల్లగ తొంగి జూచు ప్రియు మేను గనుంగొనలేక "రాత్రి మ
మ్మెల్లర వీడి పోయె" నని యెంచ, మదిన్ విరహాగ్ని పుట్టె, నా
మల్లెలలోన రేగినవి మంటలు, బొబ్బలు పుట్టె నయ్యయో!

# దూరదర్శన్ సమస్యాపూరణలు

***437. రణ మది యెల్లవారలను రంజిల జేసి ముదంబు గూర్చెడిన్***

చం. అణకువ గల్గి చేయుచు సహస్రవధానము నూత్నధారణా
ఫణితి వెలింగె నా గరికపాటి నృసింహుడు కాకినాడలో,
గణుతికి నెక్కె నీ జగతి, కాంచగ వారల యేకధాటి ధా
రణ మది యెల్లవారలను రంజిల జేసి ముదంబు గూర్చెడిన్

***438. మల్లెలు నల్లవారినవి మాలల నల్లెడి వేళ వింతలై***

(కందపద్యంలో పూరించాలి)

కం. చెలికాడు చేర రాడని

చెలరేగెను విరహవహ్ని, చెలికరముల మ

ల్లెలు నల్లవారినవి మా

లల నల్లెడి వేళ, వింతలై తాపమునన్.

# అవధాన సభలలో చెప్పిన సమస్యాపూరణములు

***439. బడులే కష్టములకెల్ల ప్రథమ పదంబుల్***

కం. కదు లంచము గొని లెక్కల

నడుగ పలుకలేక యొక్క డధికారుల వెం

బడి జనె నక్రమమగు రా

బడులే కష్టములకెల్ల ప్రథమ పదంబుల్

***440. స్త్రీ మీసమ్మున చీమ బారె నకటా చీకాకు బుట్టించుచున్***

శా. క్షేమం బంది. విహారయాత్ర సలుపన్ చెన్నొందు కాంతారమే

ధామం బయ్యెను తేనె పట్టు గని చేత మ్మాశ నుప్పొంగెనే

నామోదంబున నిద్రనందితిని బ్రహ్మానంద మందగ శా

స్త్రీ! మీసమ్మున చీమబారె నకటా చీకాకు బుట్టించుచున్.

***441. కీచకవధ జేయు చిన్ని కృష్ణుని గనుమా!***

కం. ఈ చిన్ని కృష్ణ మురళిని

దాచితి మిక నేమి చేయ దలచునొ యని, తా

యోచించి మురళి కొరకై

కీచకవధ చేయు చిన్నికృష్ణుని గనుమా.

(కీచక పదానికి వెదురు అని కూడా అర్థం)

***442*. కరి సింహము మీద నెక్కి కదనము జేసెన్**. (అల్లూరు 1980)

కం. అరిభీకర రూపముతో
వర శస్త్ర చయమ్ము లొప్ప వచ్చెన్ మహిషున్
గురు తెరిగి చంపగా, శాం
కరి సింహము మీద నెక్కి కదనము జేసెన్.

***443*. కారము బెట్టి బంధువుల కన్నులు చల్లగ జేసి రెంతయున్**
(నెల్లూరు)

ఉ. బేరము సార మంచు నిల పెద్దగ కట్నము కోరువారలే
సారెకు చూడగా తగిరి, చక్కని ప్రేమ వివాహ సంపదన్
మీరగ, బంధువుల్ కినియ, మేలిమి బంగరురాశితో నలం
కారము బెట్టి బంధువుల కన్నులు చల్లగజేసి రెంతయున్.

***444*. దర్పముతో కప్ప నల్లత్రాచును మ్రింగెన్ (ఎర్రగుంట్ల)**

కం. నేర్పరి యని తలచెద కం
దర్పుని, మరణించి కూడ తానే గెలిచెన్.
నేర్పున హరుపెండిలి గనె
దర్పముతో కప్ప నల్లత్రాచును మ్రింగెన్.

***445*. జారులతో హాలికులిల సంబర పడరే!** (హైదరాబాదు)

కం. పౌరులు భద్రత గోరుచు
చేరిరిగా రాజుకడకు, చేసిరి వినతుల్,
భూరిగ నియమించుటచేఁ
జారులతో హాలికు లిల సంబర పడరే!

**446. జారత్వమె శోభ గూర్చు జను లందఱకున్.**

కం. చారులు గూఢమగు సమా

చారములను ధైర్యమొప్ప సాధింపగ జే

కూరును క్షేమము, కనుకన్

జారత్వమె శోభ గూర్చు జనులందఱకున్.

(చారత్వమె అనుపదం ద్రుతసంధి వలన జారత్వమే అని మారినది)

**447. తల ఖండించిన వారె పో జగతి సత్కారార్హు లెల్లప్పుడున్**

మ. కులవర్గమ్ముల భేదభావములతో కోపించి సాధించి యీ

కలికాలమ్మున దుష్టనేతలు ప్రజన్ కష్టాలపాల్సేయ స

త్ఫల మందింపగ కల్కిరీతుల ప్రతాపమ్మొప్ప నా దుష్ట నే

తల ఖండించిన వారె పో జగతి సత్కారార్హు లెల్లప్పుడున్.

**448. మనమా యొద్దిక నాదుమాట వినుమా మర్యాద కాపాడుమా,**

మ. మనుమా శాంతిని, కోపమున్ విడువుమా, మన్నింపుమా సూక్తులన్,

కనుమా మంచిని “పోరు నష్ట”మనుచున్ కాంక్షింపుమా సామమున్.

చనుమా సంధికి “పొందు లాభ”మనుచున్, సౌజన్యమున్ చూపుమా!

మనమా ! యొద్దిక నాదుమాట వినుమా మర్యాద కాపాడుమా.

**449. పరులకు మేలు చేయకుమి, పాప మహాబ్ధి మునింగిపోకుమీ**

చం. పరులకు మేలు జేయుటకు పాత్రత నెంచుమి పుణ్య మందుమీ

పర ధన ధాన్య రూప గుణ భాగ్యములన్ గని కుళ్ళువారికిన్

గురుజన సూక్తులన్ వినని కూళలకున్,ఘనదుష్టచింతనా

పరులకు మేలు చేయకుమి, పాపమహాబ్ధి మునింగిపోకుమీ.

**450. పుంభావంబున భద్రకాళి వగుచున్ పోరాడు మో నెచ్చెలీ!**

శా. అంభోజాక్షి! గతమ్ము నెంచు మిక నీ వానాటి ఝాన్సీవి, ప్రా
రంభింపన్వలె పోరు కట్నములపై రాజ్యాంగబద్ధమ్ముగా,
సంభావింపుము నీ బలమ్ము నెపుడున్, సాధింపుమా హక్కులన్,
పుంభావంబున భద్రకాళి వగుచున్ పోరాడు మో నెచ్చెలీ!

**451. స్మితకున్ వందన మాచరింపుము కవీ! సిద్ధించు నీ కోరికల్.**

మ. హితమున్ గూర్చును,విద్యనిచ్చును, మహాతృప్తిన్ ప్రసాదించు, సం
తతమున్ తేజమునిచ్చు, భారతి సదా ధన్యత్వమున్ గూర్చు, స
న్నుతి సేయందగు వాణి గూర్చి,సతమున్ నోరారగా, నా శుచి
స్మితకున్ వందన మాచరింపుము కవీ! సిద్ధించు నీ కోరికల్.

**452. పాలిమ్మని భర్త కడకు బాలుని బంపెన్.**

కం. వేళాయె బడికి బంపగ,
బాలుని కిట పలక దొరికె, బలపము లేవీ?
చాలును పరిహాసము, బల
పా లిమ్మని భర్త కడకు బాలుని బంపెన్.

**453. మందు జనులకు నిజముగ విందుగాదె.**

తే.గీ. కోరి తిరుపతి సభలకు జేరుకొనుచు,
తెలుగు విశ్వరూపమ్మును దీక్షతోడ
గనుచు, తెలుగువంటకముల దినుచు, మోద
మందు జనులకు, నిజముగ విందుగాదె.

**454. ఆడపిల్లల గనుట యన్యాయమగును.**

తే.గీ. పరుల భార్యల నిత్యమ్ము భావమందు
గణన సేయుడు సోదరీమణులు గాను,
పాపకార్యమ్ము కామంపు వాంఛ తోడ
ఆడపిల్లల గనుట యన్యాయ మగును.

**455. కారము కన్నులన్ బడగ కల్గదె మోదమదెల్లవారికిన్.**

ఉ. శ్రీరమణీయమౌ తెలుగు చిత్తము నందున ముద్రవేయగా,
సారకవిత్వరాసుల ప్రసంగములన్ వరనాటకమ్ములన్
తీరుగ నీ మహాసభలతేజములన్ గన, తెల్గుతల్లి యా
కారము కన్నులన్ బడగ, కల్గదె మోదమదెల్లవారికిన్.

**456. రావణకుంభకర్ణులకు రాముడు పుట్టె గుణాభిరాముడై.**

ఉ. భావిని నిత్యమంగళము పల్కుచు సచ్ఛకునమ్ములాయెగా
పావనసాధుగేహముల భవ్యత రాక్షసులార! యింకపై
మీవిలయ మ్మటంచు ననిమిత్తము లాయె నకారణమ్ముగా
రావణకుంభకర్ణులకు. రాముడుపుట్టె గుణాభిరాముడై

**457. చర్చికి సంధ్యవార్చుటకు సాయబు వెళ్ళెను సత్వరమ్ముగా**

ఉ. అర్చనజేయ నెచ్చటకు హాయిగ వెళ్ళును క్రైస్తవుండు? తా
నర్చనవేళ బ్రాహ్మణులు నౌచితి దేనికి సిద్ధమౌదురో?
అర్చనకై మసీదునకు నంచితరీతి నెవండు వెళ్లెనో?
చర్చికి, సంధ్యవార్చుటకు, సాయబు వెళ్ళెను సత్వరమ్ముగా.

***459. విందాయెను కన్నుల కని విజ్ఞత బలికెన్***

కం. స్పందించె ధనుర్దాసుడు
''సుందర నయనాబ్జ నాదు సుందరి కంటెన్
సుందర నేత్రుడు రంగడు
విందాయెను కన్నుల ''కని విజ్ఞత బలికెన్

***460. శరదృతువె అమ్మవారి తేజమున మెరిసె.***

తే.గీ. పూర్తిగా తాము జలదానములను కురిసి
నీలిమేఘాలు తెల్లనై నింగి విరిసె
చందమామయు మిగుల స్వచ్ఛతను మురిసె
శరదృతువె అమ్మవారి తేజమున మెరిసె.

***461. ముని గని మ్రొక్కినది కాంత మోదము తోడన్***

కం. తన పతి యగు యా గౌతమ
ముని యిచ్చిన శాప మెడల, మోహన రూప
మ్మును జూప, నహల్యయు రా
ముని గని మ్రొక్కినది కాంత మోదము తోడన్

***462. వాలిని చంపుమా కడుపు భగ్గున మండెడు వానిఁ దల్చగన్.***

ఉ. జాలియు లేక నగ్రజుడు సజ్జను నన్ను బహిష్కరించె, దు
శ్శీలుడు నాదు భార్య గొనె, చేరితి నేనిటు ఋష్యమూకమున్
శీలగుణాన్వితా! కలిగె స్నేహము నీకును నాకు రాఘవా!
వాలిని చంపుమా కడుపు భగ్గున మండెడు వాని దల్చగన్.

***463. అర్కు డలరె చదల నర్ధరాత్రి***

ఆ.వె. హనుమ విద్య నేర్వ నలరిన దెవ్వండు?
అలరె నెచట తార లన్ని గలసి?
గాఢనిద్ర పట్టు కాలమ్ము గన నేది?
అర్కు డలరె చదల నర్ధరాత్రి.

***464. విప్లవ నామమ్ము బలికె విప్రుడు గుడిలో.***

కం. ఈ ప్లవగ వరుడు, మారుతి
యే ప్లవము భవార్ణవమ్ము నిలదాట ననెన్,
విప్లవ పరిహారార్థము,
విప్లవ నామమ్ము బలికె విప్రుడు గుడిలో.
(విప్లవ అనుపేరుగల సంవత్సరము)

***465. శరణు రామానుజాచార్య చరణయుగము.***

తే.గీ. రాజయోగమ్ము నెరుగ, విరక్తి నెఱుగ
జ్ఞానమార్గమ్ము నెరుగను, నేను స్వామి
పాదయుగమును నమ్మిన పామరుండ,
శరణు రామానుజాచార్య చరణయుగము.

***466. నారిని భర్తగా గొనిన నారిని లోకము ప్రస్తుతింపదే?***

ఉ. చేరగ దైత్యు డీశ్వరుని చెంతకు, హస్తము మస్తకమ్ముపై
జేరగ, పారె నా శివుడు, శ్రీపతి నారిగ మారి రాక్షసున్
జేరిచె గాలు పాలికి, విశిష్టత మోహన రూపమైన యా
నారిని భర్తగా గొనిన నారిని లోకము ప్రస్తుతింపదే?

***467. దంతంబుల విశ్వసింపదగు నిజభక్తుల్***

కం. శాంతుడు ప్రహ్లాదుడు, ని
శ్చింత నలరు నారదుడు, వసిష్ఠుడు ఘన వే
దాంతి యగును, వీరి మహో
దంతంబుల విశ్వసింపదగు నిజభక్తుల్.

***468. వరమును బొందకుము, వాస్తవ మెరుంగ దగున్.***

కం. వరమన మోక్షమె, కోరకు
వరముగ నీ తండ్రి యొడి నివాసము ధ్రువుడా!
హరి గాంచి యనిత్యంబగు
వరమును బొందకుము, వాస్తవ మెరుంగ దగున్.

***469. ముక్కున్ జూడన్ నరునికి మోక్షం బబ్బున్.***

కం. చక్కగ గోపిక యిట్లనె,
"చక్కని కృష్ణుండు నేడు చిక్కె, నితని నీ
చక్కని ముఖమును, కనులను,
ముక్కున్ జూడన్, నరునికి మోక్షం బబ్బున్."

***470. ధనమే గద ముక్తి నిచ్చు తగ మనుజులకున్***

కం. ఘన సద్గురువుగ శుకముని
వినిపించెను భాగవతము, వినిన పరీక్షి
జ్జన పతి ముక్తుడు, గురుబో
ధనమే గద ముక్తి నిచ్చు తగ మనుజులకున్.

**471. ప్రేమ లేని చోటె ప్రీతి నొసగు.**

ఆ.వె. అసలు ప్రేమ యన్న, నచ్చట నుండదు
స్వార్థ మన్న మాట, సత్య మన్న;
వాంఛ లమరి యెపుడు స్వార్థమ్ముతో నున్న
ప్రేమ, లేని చోటె ప్రీతి నొసగు.

**472. నమ్మాయే హేతు వౌచు నణచును ప్రగతిన్.**

కం. నమ్మము, బ్రహ్మము సత్యము
సుమ్ము, గన జగత్తు మిథ్య, సుమతీ! యెపుడున్
నమ్మకు మాయను, ముంచెడి
నమ్మాయే హేతు వౌచు నణచును ప్రగతిన్.

(అమ్మాయే = ఆ మాయయే)



**ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో 'సరస వినోదిని' సమస్యాపూరణ కార్యక్రమాన్ని ది. 30-8-2019 నాడు నిర్వహిస్తూ...**

# దత్తపది

***1. 'దేశము, కోశము, పాశము, నాశము' పదములను ప్రయోగించుచు దేశభక్తిని ప్రబోధించుచు ఉత్పలమాల...***

ఉ. **దేశము** భారతమ్ము, మన దేశము దివ్యము, సాధు రాశికిన్
**కోశము**, వేద భాసిత, మకుంఠిత తత్త్వ సుబోధకమ్ము నౌ,
**పాశము** ధర్మ బద్ధ మగు భవ్య కుటుంబ విధాన మందు, నే
**నాశము** నంద బోదు పరిణామము లందున, విశ్వకీర్తి యం
దాశ ఫలించు నంచు గణతంత్ర దినోత్సవ మందు బల్కెదన్.

యూట్యూబ్ లింక్ – https://youtu.be/pt2kd7I0Bx4

***2. 'అల, కల, తల, వల' అను పదములను అన్యార్థమున పాదాదిని ప్రయోగించుచు రామాయణార్థమున మత్తేభము...***

మ. **అల**ఘున్ రాముని జేరుకొందు, రఘునాథా! కంటి సీతమ్మ నే
**కల**తన్ దీర్చితినందు, రావణు తలల్ ఖండించుమా యందు, భూ
**తల** భారమ్మును దీర్చమందు, గుణపూతన్ నిన్ను జేపట్టగా
**వల**యున్ నాథుడవందు, నమ్ము మిక నా వాక్యాల నే మారుతిన్.

యూట్యూబ్ లింక్ – https://youtu.be/FCUjuDGkTFw

***3. 'మేరీ, యేసు, సిలువ, చర్చి' పదములతో శ్రీకృష్ణుని స్తుతించుచు మత్తేభ విక్రీడితము...***

మ. ముద **మేరీ**తిని గూర్చినావొ వసుదేవున్ దేవకిన్ బ్రోచి "యా
పద మా **యే, సు**ఖ మింక" నంచు, కరుణన్ భద్రమ్ము నాకి మ్మటుల్,
సదయా! సద్గుణ రాశి భా**సిలు వ**రా! సాయుజ్యమున్ గోరి నా
యెద **చర్చిం**చెద నీదు లీలల నికన్ హే కృష్ణ! రక్షింపుమా.

***4. 'తల, మెడ, కడుపు, వీపు' పదములను అన్యార్థమున ఉపయోగించుచు భారతార్థమున మత్తేభవిక్రీడితము...***

మ. **తల** పోయందగు ధర్మమార్గమును పార్థా! చక్కగా యోగ వి
దృల నార్జింపుము నీదు క్లైబ్య **మెడ** బాయన్, తత్త్వమున్ గాంచు వా
రల బాటన్ **కడు పు**ణ్యమబ్బును, స్థితప్రజ్ఞుండవై, యోగివై,
కలనన్ బోరగ నేర్తు **వీ పు**డమి, నీకై గీత బోధించితిన్.

***5. 'కిక్, లక్, చెక్, నెక్' పదములను భారతార్థమున ప్రయోగించుచు తేటగీతి...***

తే.గీ. జయము **లక్క**రలేదు, శస్త్రములతోడ,
**కిక్కి**రిసి యున్న శత్రుల **చెక్క**లేను,
కీర్తిశిఖరాల **నెక్క** నా కృషియె సున్న,
ఉత్తరాకుమారుడను నే నుత్తరుడను.

***6. 'హస్త, చిత్త, స్వాతి, మూల' పదములను స్వార్థమున (నక్షత్రములు అను అర్థమున) ఉపయోగించకుండ అన్యార్థమున ప్రయోగించుచు 'షడ్రసోపేతమైన భోజనము' గురించి మత్తకోకిలా వృత్తము...***

మత్తకోకిల

అన్ని వంటల నమ్మగారి సు**హస్త** వాసియె కమ్మనౌ,
నెన్న **చిత్త**ము తీపు కారము నెప్డు నుప్పును కోరుగా,
ఉన్న చే దొగ రున్నచో పులు పున్న **స్వాతి**శయమ్మగున్,
మిన్న షడ్రస **మూల**మౌ గద మేటి భోజన మిద్దియే.

***7. 'అప్పు, దొర, డబ్బు, వడ్డి' పదములను ప్రయోగించుచు భారతార్థమున ఉత్పలమాల...***

ఉ. "**అప్పు**డు పల్కినావు గద, యాయుధమున్ ధరియింప నంచు నీ
విప్పటి యుద్ధరంగమున, నెన్నగ లే **దొర** భీష్మధాటికిన్
తప్ప" దటంచు, చక్రమును దాల్చితి, వచ్యుతు **డబ్బు**రమ్ముగా
నిప్పుడు మాట తప్పెనన, నిల్చితి **వడ్డి** జయింప భీష్మునిన్.

(ఒర = సామ్యము)

***8. 'ఆట, పాట, బాట, మాట' పదములను ప్రయోగించుచు ముఖ్యమంత్రి శ్రీ చంద్రశేఖరరావు గారి బాట బంగారు బాట అని చెప్పుచు మత్తకోకిల....***

మత్తకోకిల

**ఆట** లాడిన రీతి, తెల్గు మహాసభల్ నడిపించుగా,
**పాట** పాడిన రీతి, కైతల బండి వెల్గుచు నుండగా,
**మాట** నిల్పుచు, ముఖ్యమంత్రిగ మాన్యు డయ్యె, జగాన నీ
**బాట** జూడగ చంద్రశేఖరు బాట బంగరు బాట యౌ.

***9. 'నది, మది, పది, గది' పదములను ప్రయోగించుచు గురు శిష్య సంబంధమును గురించి మత్తేభవృత్తము...***

మ. **మది** నజ్ఞానపు చీకటిన్ దునుము, శ్రీమద్ జ్ఞానతేజమ్మునన్,
**పది**లమ్మౌ పరతత్త్వ బోధ నిడు శోభన్ తానె శిష్యాళికిన్,
ముద మందింపగ**, ది**వ్య మార్గముల జూపున్, సద్గురుం డెన్న; వి
**న్నది** శ్రద్ధన్ మననమ్ము జేయు మదిలోనన్ శిష్యుడున్ భక్తితో.

***10. 'నిండుగ, పండుగ, మెండుగ, దండిగ' పదములను ప్రయోగించుచు అవధాన వైభవముపై ఉత్పలమాల...***

ఉ. **నిండుగ** ధార ధారణ సునిశ్చిత ధీయుత ధైర్య ధోరణుల్,

**పండుగ** జేయు చుండగను, పంచ ధకారములన్, వధాని తా

**మెండుగ**' తృప్తి గూర్చు గద, మేలను పృచ్ఛక ప్రేక్షకాళికిన్;

**దండిగ** కాన్క లందు, నవధాన సభాంగణ వైభవమ్మిదే.

***11. 'కన్ను, పన్ను, చెన్ను, దన్ను' పదములను ప్రయోగించుచు హనుమంతుని స్తుతించుచు మత్తకోకిల...***

మత్తకోకిల

**కన్ను**లన్ నిను జూడ మారుతి! కల్గు ధన్యత, నిత్యమా

**పన్ను**లన్ మము బ్రోవ వేడెద, పావనీ! యనిలాత్మజా!

**చెన్ను** మీరగ రామనామమె జీవన మ్మను స్వామి నీ

వున్న జాలును వెన్ను **దన్ను**గ నుండు రెండు సుఖమ్ములున్.

***12. 'ఏరు, పారు, ఊరు, మారు' పదములను ప్రయోగించుచు పల్లీయ సౌందర్యము వర్ణించుచు స్వేచ్ఛాఛందమున పద్యము...***

మత్తకోకిల

**ఏరు**లో యన కాల్వ లన్నియు నింపుగా కనిపించుచున్

**పారు** చుండగ, రాలు మోదపు బాష్ప వారియె, సర్వదా

**ఊరు** పచ్చగ పాడిపంటల నుండు పల్లెల నుండుమా

**మారు** పల్కక యన్నదాతగ, మారుమా ! హిత మెంచుమా!

భారతాంబకు పట్టుగొమ్మలు పల్లెలే యనె గాంధియున్.

***13*. 'వరంగల్లు, వెంకటగిరి, అల్లూరు, విడవలూరు' పదాలతో సభావిశేషములపై పద్యము...**

తే.గీ. ఆ **వరంగల్లు** గిరి గార లాదరింప,

అతిథి **వెంకటగిరి** కృష్ణు డలరుచుండె,

ఘనత **నల్లూరు** రాజశేఖరుడు చేరె,

గురువరేణ్యులు కంది శంకరులు నుండ,

**విడవలూరు** సభాస్థలి వెలిగె నేడు.

***14*. 'మార్చి, మే, జులై, డిసెంబరు' పదములను అన్యార్థమున వినియోగించుచు విళంబి నామ సంవత్సరమునకు స్వాగతము పలుకుచు నచ్చిన ఛందములో పద్యము...**

ఉ. మాయ గనన్, విడంబి! యిక మా తలరాతలు **మార్చి**, సర్వదా

మాయని కీర్తి నిచ్చి, శుభ మార్గము జూపుచు **మే** లు గూర్చ, వి

చ్చేయుము, జా**జులై** విరియ చిత్తము లెల్లరకున్, ధరిత్రి సు

శ్రీయుత ! నీ దయారసముచే ద**డిసెం బరు**లన్ జయింపుమా.

***15*. 'అమ్మ, అయ్య, అన్న, అక్క' పదములను అన్యార్థమున ప్రయోగించుచు రామాయణార్థమున పద్యము...**

(అన్నతో వనవాసమున కేగుచున్న లక్ష్మణునకు సుమిత్ర యుపదేశము)

ఉ. **అమ్మ**నుజాధిపున్ దశరథాధిపుగా గనుమయ్య రాము, నీ

కమ్మగ జెప్పుచుంటి గను **మయ్య**టవీస్థలినే యయోధ్యగా,

నమ్మగ జూడు లక్ష్మణ సుతా! జనకాత్మజ **నన్న** దా సుమి

త్రమ్మ కుమారు తోడ, విన **నక్క** జమౌ, నటు కాన కంపెగా.

***16. 'కన్ను, ముక్కు, చెవి, నోరు' పదములను అన్యార్థమున ప్రయోగించుచు భారతార్థమున స్వేచ్ఛాఛందమున పద్యము***

ఉ. రమ్మని బిల్చినాడు ధృతరాష్ట్ర డి **క న్ను** సి చేయ భీమునిన్,
నెమ్మది చంప నెంచె గద నేడిచటన్ నిజ **ముక్కు** కౌగిటన్
పిమ్మట, నంచు తా నినుప విగ్రహ ముం**చె వి**వేకి కృష్ణుడున్,
వమ్మొనరించు దుష్కృతుల, పాపుల **నోరు**చునే ధరాస్థలిన్?

***17. 'కుండ, దుత్త, చెంబు, గరిటె' పదములను అన్యార్థమున ప్రయోగించుచు భారతార్థమున స్వేచ్ఛాఛందమున పద్యము***

శా. శ్రీ మత్సైన్యము కోర**కుండ** నను గోరెన్ పార్థు డార్తుండు, తా
భూమిన్ గెల్చును, ధర్మ మెక్కడికి పోబో **దుత్త**ముల్ పాండవుల్,
క్షేమమ్మున్ విడి రాజరాజిటు తలం**చెం బు**ణ్యహీనుండు నన్
సామాన్యుండని, కౌరవుల్ త**గరిటెం**చన్ ధర్మ మార్గమ్ములన్.

***18. 'దేవకి, యశోద, సుభద్ర, రాధ' పదాలను ప్రయోగించుచు రామాయణార్థమున స్వేచ్ఛాఛందమున పద్యము...***

ఉ. ఆర్తుడ నే విభీషణుడ నర్థిని **దేవ! కి**రీట గర్వియై
వర్తిలు నాదు సోదరు డపాత్రుడు, క్షేమద! శ్రీ**యశోద**! నా
యార్తిని బాపు పాత్రుడ వనంత **సుభద్ర**ము లిచ్చు రామ! స
ద్వర్తన నేర్పు నీ చరిత దాశరథీ! ప్రవ**రా! ధ**రాపతీ!

(రెండవ పూరణ)

ఉ. శ్రీ రఘురామ! నీ దరికి జేరితి **దేవ! కి**రీట గర్వియౌ
క్రూరుని సోదరున్ విడిచి, కోరెద నీ కృపనే **యశోద**! యిం
పార **సుభద్ర**ముల్ గనెద నార్తజనావన! రామ! ప్రోవుమా
తారకనామ! నన్ గనుము దాశరథీ! ప్రవ**రా! ధ**రాపతీ!

***19. 'కామ, భామ, మామ, రామ' పదములను అన్యార్థమున ప్రయోగించుచు భారతార్థమున స్వేచ్ఛాఛందమున పద్యము...***

ఉ. శ్రీ యదునాయ**కా! మ**ది వసింపుము, నీదగు విశ్వరూపమున్
బాయక సన్నుతింతు బ్రతి**భామ**తి! నే ధృతరాష్ట్రుడన్ మహా
మాయను ద్రుంచివేయుమిక **మామ**క మోహ మదెల్ల వీడగా
జేయుచు బ్రోవ**రా మ**మత జేసిన తప్పులనే క్షమించరా!

***20. 'హర, గణేశ, కుమార, నంది' పదాలను అన్యార్థమున ప్రయోగించుచు చంపకమాలలో విష్ణుస్తుతి ...***

చం. హరసఖ! శ్రీ మనో**హర**! జనార్దన! కేశవ! హే త్రివిక్రమా!
స్థిర ఘన మోక్షదాయక! హృషీక **గణేశ**! ఉపేంద్ర! అచ్యుతా!
వర సు**కుమార** దేహ! నిజ భక్త జనావన! నందనందనా!
గరుడ విహార! మమ్ములను గావుము సన్నుతి **నంది** శ్రీహరీ!

***21. 'కల, తల, మర, వస' పదాలను అన్యార్థములో ప్రయోగించుచు పెండ్లి విందును గురించిన పద్యము...***

(అన్నపరెడ్డి సత్యనారాయణ రెడ్డి గారి కుమారుని పెండ్లి విందు)

మ. వరుడై వేంకట రామిరెడ్డి **కల**డీ ప్రక్కన్ మహావిష్ణువై,
వర లావణ్యయు చెం**త ల**క్ష్మి వలె శోభన్ జేరి యుండెన్, మహా
ద్వరమై 'అన్నపరెడ్డి' విం ద**మర** నాస్వాదించి మీ రందఱున్
వర గోవిందుడు బ్రో**వ, స**న్మతి నిటన్ పద్యాల దీవింపుడీ.

***22. 'అరి, ఉరి, కరి, గిరి' పదములను అన్యార్థమున ప్రయోగించుచు భారతార్థమున స్వేచ్ఛాచందములో పద్యము...***

చం. **అరి**గిరి పాండవుల్ వనికి, నంతట ద్వైతవనమ్ములోన తా
**మురి**కిరి దివ్య గాయకుల నుక్కడగించిరి, మేటి గర్వమే
**కరి**గె సుయోధనాదుల, కఖండ బలమ్ము జయమ్ము నంద సా
**గిరి** సుయశో విశాలురయి కృష్ణుని దివ్య కటాక్షవీక్షణన్.

***23. 'చేప, రొయ్య, నత్త, పీత' పదాలను ప్రయోగించుచు రామాయణ పరముగా పద్యము...***

శా. **చేప**ట్టెన్ శివకార్ముకమ్మును వెసన్ శ్రీరాము, డా సీతనే
చేపట్టెన్ ద్విజు లంద **రొయ్య**న శుభాశీర్వాదముల్ వల్కగన్,
చూపట్టెన్ సభ **నత్త**఼టిన్ శుభములే, శోభిల్లె కల్యాణమే,
చూపట్టెన్ హరి **పీత**వస్త్రధరుడై సొంపారుచున్ లక్ష్మితో.

***24. 'ఈశ, హర, శివ, భవ' పదములను అన్యార్థమున ప్రయోగించుచు దుర్గాదేవిని స్తుతించుచు ఉత్పలమాల...***

ఉ. **ఈ శ**రు గావుమమ్మ! దయ, **నీశ**మనోహరి! శైలపుత్రి! నా
యాశ ఫలింపగా న**హర**హ మ్మనెదన్ **హర** యంచు, దుర్గ! గౌ
రీ! **శివ**! ప్రేమరా**శి వ**యి ప్రీతిని జూడుము సిద్ధిదాత్రి! నీ
వే శరణంటి, ప్రా**భవ**ము నిమ్ము, సదా**భవ**వామభాగినీ!

(దత్తపదిలో ఇచ్చిన పదములను ఒకసారి అన్యార్థంలో మరొకసారి స్వార్థంలో ఉపయోగించడం ఈ పద్యంలో ఉన్న విశేషం.)

***25. 'హర, శివ, భవ, కపాలి' పదములను అన్యార్థమున ప్రయోగించుచు మత్తేభమున శ్రీకృష్ణ స్తుతి...***

మ. అరయన్ గోరుట నిన్ను నూ**హ ర**మణీయం బయ్యె శ్రీ కృష్ణ! శ్రీ
కరమౌ సద్గుణ రా**శి వ**ర్ధిలగ దీక్షాబుద్ధు లందించుమా!
కరుణాళో! **భవ** బంధ ముక్తి నిడుమా కాంక్షింతు కృష్ణాష్టమిన్,
మురవైరీ! యిక నీదు వీక్షణము మమ్మున్ సో**క పాలిం**పుమా!

***26. 'వన, జన, ధన, మన' పదములను అన్యార్థమున ప్రయోగించుచు రామాయణార్థములో చంపకమాల...***

చం. "**వన**నిధి దాటినారు, ఘన వానర సైన్యము తోడ నూఱు యో
**జన**ముల పాదయాత్ర నట సంతస మందుచు జేసినారు, బో
**ధన**లను గూర్చినారలు హితమ్మని, రావణు జంపినార, లే
**మన**దగు" నంచు బల్కె జనకాత్మజ రాములవారి నెంచుచున్.

***27. 'మూడు, ఆరు, ఏడు, పది' అను పదములను అన్యార్థమున ప్రయోగించుచు భారతార్థమున మత్తేభము...***

మ. అదిగో వారికి చావు **మూడు** త్వరలో నాడంగ జూదమ్ము, సం
పదతో నే నల**రారు**వాడ, వనిలో వారుండినన్ వేగ బా
యదె ప్రాణ, మ్మొక **యేడు** పాండవులకౌ నజ్ఞాతవాస, మ్మికన్
**పది**లమ్మౌ గద నాదు పీఠ మనుచున్ భావించె రారాజిలన్.

***28. 'ఏక్, దస్, సౌ, హజార్' ఈ పదములను ప్రయోగించుచు భారతార్థమున ఉత్పలమాల...***

ఉ. ఇచ్చెద నంచు బల్కితివి **యేక**మనేకము నైన కర్ణ! నిన్
మెచ్చెద, మెచ్చ సంపదల మేలని, **దస్త్ర**ము లొల్ల, వట్టిగా
బుచ్చకు, **సౌ**మనస్యమున పొంగుచు కోరిన దిమ్ము, కౌగిటన్
గ్రుచ్చెద, నిమ్ము నీ కవచకుండలముల్ వర దే**హజార్థ**ముల్.

***29. 'కాక, తాత, పాప, మామ' ఈ పదములను అన్యార్థమున ప్రయోగించుచు రామాయణార్థమున శార్దూలము...***

శా. కావంజాలుదు వెల్ల లోకముల నీ**కా క**ష్టముల్? భూజ! పూ
తా! విచ్చేయుము రామదూత నన చిం**తా? త**ల్లి! నే మారుతిన్
భావింపన్, నిను వెంట ర మ్మనుట **పాప**మ్మా? ననున్ నమ్ము మ
మ్మా! వేగన్ కొనిపోదు రామపదకా**మా! మ**ద్భుజమ్మెక్కుమా.

## అవధాన సభలో చెప్పిన దత్తపదులు

***30. 'వీడియోకాన్, క్రౌన్, డయనోరా, వనిడా' ఈ పదములను ప్రయోగించుచు మేనకా విశ్వామిత్రులపై మత్తేభము...***

మ. భయమున్ వీడియొ సిగ్గు వీడియొ సుశోభన్ **వీడియో కాన**లో
ప్రియమౌ **క్రౌం**చము లేగుచుండ నిను నే ప్రేమింప కాముండు రా
**డయ నోరా**రగ ముద్దు చేసెదను పాటల్ పాడి కామించెదన్
దయరాదా **వనిడా**య రమ్ము మునినాథా రమ్ము నే మేనకన్.

***31. 'రామ, జామ, సీమ, తేమ' ఈ పదములను ప్రయోగించుచు తేటగీతిలో రామస్తుతి.***

తే.గీ. **రామ**! నీ నామమే మధురమ్ము శుభము
భూమి**జా మ**తి నుందువు స్వామి నిజము
నా హృదయ **సీమ** వసియింపు నాథ! సతము
తృప్తి నీ గాథ సీతాప**తే! మ**హోర్వి.

***32. 'కోట, తోట, మాట, పాట' ఈ పదములను ప్రయోగించుచు కార్తీక మాస వైభవమును గురించి తేటగీతి.***

తే.గీ. కొలువగా శుభముల నిచ్చు తులసి **కోట**
హాయి గూర్చును హరి హర యనెడి **మాట**
భక్తి వెలుగును హృదయ పుష్పాల **తోట**
భాగ్య మిడును కార్తీక దీపాల **పాట**.

***33. 'మంజు, యంజు, సంజు, నంజు' ఈ పదములను ప్రయోగించుచు వివాహపు వేడుకను వర్ణించుచు తేటగీతి.***

తే.గీ. **మంజు** గతుల వివాహమ్ము రంజిలె, గురు
వా యరుంధతి **యం జు**క్క నచట జూపె
కలసికొన్న ఆ**సం జు**ట్టములు పలికిరి
యేడు గడిచి **నం జు**'క్కలరేడు పుట్టు.

***34. 'ఆపిల్, బనానా, ఆరంజి, పైనాపిల్' ఈ పదములను ప్రయోగించుచు గోపికతో కృష్ణుని మాటలను శార్దూలమున... (కావలి 1997)***

శా. **ఆ పిల్పం**దెను నిన్ను జేరుటకునై యత్యంత మోదమ్మునన్
తాప మ్మందుచు వచ్చినాడ నిట, చేదా యం**బనానా**మమే
రా పాదమ్ముల పట్టువాడ మన**మారంజి**ల్లు నీ లేమి**పై నా**
**పిల్పు**ల్ వృథయయ్యె గోపిక! లలిన్ భేదింప న్యాయంబొకో.

***35. 'చేప, చేప, చేప, చేప' చేపను ఖండించకుండా భారతార్థములో ఉత్పలమాల... (కావలి)***

ఉ. **చేప**ను గొట్టువాని కిట సిద్ధిలు ద్రౌపది, యంత్రబద్ధమౌ
**చేప** చలించుచుండె నిట శీఘ్రముగా గన రండు మీర లీ
**చేప**ల వంటి నేత్రముల చిన్నది మీకగు ధర్మపత్నిగా,
**చేప**యె నిర్ణయించు వరసిద్ధిని నేటి స్వయంవరమ్ములో.

***36. 'శవము, పాడె, చితిమంట, తర్పణము' ఈ అమంగళకరమైన పదములను మంగళకరముగా ప్రయోగించుచు దేవదాసు పార్వతి కలిసికొన్నట్లు వర్ణించుచు ఆటవెలది... (ప్రొద్దుటూరు)***

ఆ.వె. కే**శవ! ము**దమాయె, క్రీడింప పార్వతి
వచ్చె, **పాడె**ద నిట వరుస గలిపి,
మదిని గని వల**చితి, మంట** చల్లారె సం
**తర్పణమ్ము** మారు దలచి కూర్తు.

***37. 'వేదము, మోదము, ఖేదము, భేదము' ఈ పదములను ప్రయోగించుచు ఉత్పలమాలలో క్రికెట్ ఆటలో భారత విజయం (కడప)***

ఉ. **వేదము** గన్న భూమి యిది, వేడుకగా జయ మంద గల్గెడిన్.
**మోదము** గల్గ విశ్వగురుమూర్తిగ నిల్వగ నౌను, సర్వదా
**ఖేదము** లేక ఆ క్రికెటు క్రీడను గెల్వగ వచ్చు, భూమిపై
**భేదము** లేక శాంతిగని విజ్ఞత జూపిన కీర్తి దక్కెడిన్.

***38. 'టీ, పాలు, కాఫీ, చక్కెర' ఈ పదములను ప్రయోగించుచు భాగవతార్థమున శార్దూలము.***

శా. ఓ పుల్లాబ్జముఖీ! యి **టీ**యవె సఖీ! ఊహింతు నా **పాలు**గా,
**కాఫీ** రాగము లోన **చక్కెర** రుచుల్ కల్పింతు గానమ్ములో.
సాఫీగా నమరంగ జేసెద భవత్సంసారమున్, పాపమున్
మాఫీ జేసెద నంచు కృష్ణు డనుచున్, మన్నించె నా గోపికన్.

***39. 'పూరీ, సాంబారు, దోసె, వడ' ఈ పదములను ప్రయోగించుచు పార్వతీ పరమేశ్వరులు విషయముగా కందము...***

కం. '**పూ**రీతి శోభ గూర్చుచు
సారెకు నుమ తలచె నిటుల **సాంబా! రు**ద్రా!
కోరితి నిను, **దోసె**డు సుమ
హారమ్ముల **వడ**కకుండ నర్చింతు హరా!

***40. 'భీష్మ, కర్ణ, శల్య, ధర్మ' ఈ పదములను రామాయణార్థములో ప్రయోగించుచు తేటగీతి...(కడప 2001)***

తే.గీ. **భీష్మ**రవము జనించెను విల్లు త్రుంచ
**కర్ణ**పేయము సీతకు గాంచ నదియె
**శల్య**ములు క్రుంగె పర రాజ సరణి కపుడు
**ధర్మ**రూపుడు పెండ్లాడె ధరణిసుతను.

***41. 'మానవోదయము' నాలుగు పాదములలో ప్రయోగించుచు మత్తకోకిల.***

మ.కో. **మానవోదయ**వేళ నూతనమౌ సహస్రతమాబ్దిలో.
**మానవో దయ**లేని హింసను మానవత్వము నందుమా
**మా నవోదయ** వాంఛ పండగ మంచికాలము వచ్చుగా
**మానవోదయ** మౌనుగాక సమాజమందున సర్వదా.



**మైపాడులో శ్రీకృష్ణ మందిరంలో తేది. 23-8-2019 నాటి ధార్మికోపన్యాసం**

# న్యస్తాక్షరి

***1. అంశము - శివస్తుతి; ఛందము - తేటగీతి; న్యస్తాక్షరములు - 'శి, వ, రా, త్రి' అను నాలుగు అక్షరములను నాలుగు పాదములలో యతిస్థానములలో ఉండవలెను.***

తే.గీ. **శి**తిగళా! నిను దలచెద **శి**వము గల్గ,

 **వ**రద! చేసెద భక్తి భ**వ**త్ స్తుతి, శివ

 **రా**త్రి జాగర ముండెద, **రా**జమౌళి !

 **త్రి**నయనా! నిన్నె గొలిచెద **త్రి**పురవైరి !

(న్యస్తమైన అక్షరములను యతిస్థానములందు మాత్రమే కాకుండా పాదాదులయందు కూడా నిక్షేపించడం జరిగింది)

యూట్యూబ్ లింక్ – https://youtu.be/fKQRqXm4gTQ

***2. నాలుగు పాదములలో యత్రిస్థానమున క్రమముగా 'రా, రా, పో, రా' అను అక్షరములు వచ్చునట్లు కురుసభలో భీముని ప్రతిజ్ఞపై మత్తేభము..***

మ. రమణిన్ ద్రౌపది నిట్లు చేసియు సభన్ **రా**జిల్లు దుశ్శాసనున్

 శ్రమ లేకుండ వధించి యుద్ధమున నో**రా**రంగ రక్తమ్ము ద్రా

 వు మతిన్ వెల్గెద; గృష్ణ బిల్చు మదమే **పో**వంగ రారాజ వి

 క్రమముం గూల్చెద నూరుభంగమున క్రూ**రా**త్మున్ వధింతున్ ఖలున్.

యూట్యూబ్ లింక్ – https://youtu.be/XRktDB9uE0Y

***3. అంశము - దసరా సంబరములు; ఛందస్సు – మత్తేభము; న్యస్తాక్షరములు - 1వ పాదంలో 1వ అక్షరం 'ద', 2వ పాదంలో 6వ అక్షరం 'శ', 3వ పాదంలో 12వ అక్షరం 'హ', 4వ పాదంలో 16వ అక్షరం 'ర'.***

మ. **ద**సరా పండుగ సంబరాల సరదా దర్శించుడీ; దాండియా
యసమానమ్ము, **శ**మీ సమీపగతి పాయంజేయు బాపమ్ములన్,
దసరా వేషము మోదకారి, య**హ**మున్ దప్పించు మెప్పించుచున్,
లసదాత్మన్ జగదంబ భక్తులను లీలన్ జే**ర** నూరేగెడిన్.

యూట్యూబ్ లింక్ – https://youtu.be/NoqH9x8aTyA

***4. అంశము – సరస్వతీ ప్రార్థన; ఛందము – చంపకమాల; న్యస్తాక్షరములు - 'స, ర, స్వ, తి' అను అక్షరములు క్రమముగా నాలుగు పాదముల మొదట ఉండవలెను.***

చం. **స**తివయి బ్రహ్మనాల్కపయి చక్కగ నిల్చి, యశస్సు గూర్చు భా
**ర**తి! నిను భక్తితో దలచి, ప్రార్థన జేసెద సర్వదా సర
**స్వ**తి! వర రాగ భావముల సాగు కవిత్వ మొసంగు మమ్మ, ఖ్యా
**తి** తిరముగాగ, నా మది నుతింతును, వాణి! నమస్కరించెదన్.

***5. అంశము – అన్నమయ్య పద వైభవము; ఛందము – మత్తకోకిల; న్యస్తాక్షరములు - 'అ, న్న, మ, య్య' అను అక్షరములు క్రమముగా నాలుగు పాదాముల మొదట ఉండవలెను.***

మ.కో. **అ**న్నమున్ దిన చిన్నబిడ్డల కల్లె జాబిలిపాట, నె
**న్న** న్నుతిం గనె, జోలపాట ననంగ నిద్దుర వచ్చు, నే
**మ**న్న వేంకటనాథు కీర్తన లల్లి పాడిన యన్నమ
**య్య**న్నచో పదవైభవమ్మున కాద్యు డౌ నని మ్రొక్కెదన్.

***6. అంశము – నూతన సంవత్సర శుభాకాంక్షలు; ఛందము – శార్దూలము; న్యస్తాక్షరములు - 'క్రొ, త్త, సా, లు' అను అక్షరములు క్రమముగా యతిస్థానమున నుండవలెను.***

శా. కోరన్ నే డిల నాంగ్ల వత్సరములో **క్రొ**త్తన్, శుభాకాంక్షలన్,
తారాస్థాయి నుగాది పండుగనె చి**త్త**మ్మందు భావించెదన్,
జారన్ బోవ విదేశ సంస్కృతులకై, **సా**రూప్యమున్ గోరి, నా
లో రక్తిన్ మన భారతీయతకు మే**లు**న్ గూర్ప యత్నించెదన్.

***7. అంశము - చంద్ర గ్రహణము; ఛందము – ఆటవెలది; న్యస్తాక్షరములు - 'గ్ర, హ, ణ, ము' అను అక్షరములు క్రమముగా నాలుగు పాదముల చివర ఉండవలెను.***

ఆ.వె. చంద్రు మ్రింగు రాహు సరణియె చంద్ర **గ్ర**
హణ మటంచు పెద్ద లంద్రు; దే**హ**
ధారి కెన్న స్నాన దానాలతో న**ణ**
గు నిల కీడు; కలుగు గొప్ప ఫల **ము**.

***8. 'భ, ద్ర, గి, రి' అనే నాలుగు అక్షరములు క్రమముగా నాలుగు పాదములలో 4, 12, 15, 20 వ స్థానములలో వచ్చునట్లు సీతారాముల కళ్యాణ ఘట్టముపై చంపకమాల...***

చం. వరుదు **భ**వాబ్ధితారకుడు వచ్చెను విష్ణువు రాముడౌచు, సం
బరమున లక్ష్మి వచ్చినది భ**ద్ర**ము లీయగ సీతయౌచు, నా
విరజయు గౌతమీ నదిగ ప్రీతిగ నీ **గి**రి చెంత జేరె, దా
నరయగ నేడు భద్రగిరి యయ్యె వికుంఠము భద్రు కో**రి**కన్,
పరిణయ మాడె భద్రగిరి వాసిగ రాముడు సీత నిచ్చటన్.

***9. అంశము – వరలక్ష్మీ స్తుతి; ఛందము – చంపకమాల; న్యస్తాక్షరములు - మొదటి పాదము 1వ అక్షరము 'వ'; రెండవ పాదము 6వ అక్షరము 'ర'; మూడవ పాదము 12వ అక్షరము 'ల'; నాల్గవ పాదము 18వ అక్షరము 'క్ష్మి' ఉండవలెను.***

చం. **వ**రముల నిచ్చు తల్లి! వర భక్తుల పాలిటి కల్పవల్లి! సం
బరమున జే**ర** రమ్ము, మము పాలన జేయుము, మా గృహమ్మునన్
స్థిరముగ నుండుమా సతము, శ్రీ**ల** నొసంగుము శ్రీహరి ప్రియా!
చిరతర భక్తి నీ వ్రతము జేసెద శ్రీ వరల**క్ష్మి**! భాగ్యదా!

***10. అంశము - గురు వందనము; ఛందస్సు – చంపకమాల; న్యస్తాక్షరములు - 1వ పాదంలో 10వ అక్షరం 'గు', 2వ పాదంలో 2వ అక్షరం 'రు', 3వ పాదంలో 11వ అక్షరం 'దే', 4వ పాదంలో 18వ అక్షరం 'వ'.***

చం. నరుడుగ నుండియున్ వెలు**గు** నాలుగు మోములు లేని బ్రహ్మ, ధీ
ప**రు**డు ద్విబాహు వైన హరి, భర్గుడు గాంచ నఫాలనేత్రుడౌ,
దిరముగ వ్యాసరూప మగు **దే**వుడు గావున నీవు సద్గురున్
వరదుని జ్ఞానరాశి గని భద్రములన్ నిను బ్రో**వ** వేడుమా.

***11. విషయము - శ్రీకృష్ణ స్తుతి; ఛందస్సు – ఉత్పలమాల; న్యస్తాక్షరములు - 1వ పాదంలో 1వ అక్షరం 'ఏ'; 2వ పాదంలో 8వ అక్షరం 'సు'; 3వ పాదంలో 13వ అక్షరం 'క్రీ'; 4వ పాదంలో 17వ అక్షరం 'స్తు'.***

ఉ. **ఏ** మని యందు నీ మహిమ? కృష్ణ! కుచేలుని, భీష్ము, కుబ్జ, సు
త్రాముని, ద్రౌపదిన్, బ**సు**ల, ధర్మజు, బార్థుని, గోప భక్తులన్,
ప్రేమగ బ్రోచినావు కడు వేడుక **క్రీ**డ యనంగ; సర్వదా
నా మది నుండు మయ్య కరుణామయ! భక్తిని ప్ర**స్తు**తించెదన్.

***12. అంశము - పోలేరమ్మ స్తుతి; ఛందము - ఆటవెలది: న్యస్తాక్షరములు - నాలుగు పాదములలో ఆద్యక్షరములుగ 'పో, లే, ర, మ్మ' ఉండవలెను.***

ఆ.వె. **పో**కుమమ్మ వీడిపోకు **పో**లేరమ్మ
 **లే**రు నీకు సాటి, **లే**మి బాపు,
 **ర**క్తి బట్టితిని ధ**ర**ణి నీదు చరణ మ
 **మ్మ**! గతి నీవె య**మ్మ**! మమ్ము గనుము.

***13. విషయము - గీతోపదేశము; ఛందస్సు - ఉత్పలమాల; న్యస్తాక్షరములు -1వ పాదములో 6వ అక్షరం ''ప్ర''; 2వ పాదములో 1వ అక్షరం "జ్ఞా"; 3వ పాదములో 2వ అక్షరం "న"; 4వ పాదములో 8వ అక్షరం "ము". (నెల్లూరు అవధాన 2012)***

ఉ. "మౌనము వీడు **ప్ర**జ్ఞ నభిమానము నందుము క్షత్రియుండవై
 **జ్ఞా**నము నందుమా చటుల శస్త్రములందుము కర్మనందుమా
 ధ్యా**న**ము చేసి నన్నుగని తత్త్వము నందుము యుద్ధభూమిలో
 మానిత రీతి గాంచు**ము** సమస్థితి నిప్పుడు పార్థ ! మిత్రమా!"

***14. విషయము - వీరుని ఆత్మవిశ్వాసము; ఛందస్సు – శార్దూలము; న్యస్తాక్షరములు - 1వ పాదములో 3వ అక్షరము 'నా'; 2వ పాదములో 8వ అక్షరము 'రా'; 3వ పాదములో 15వ అక్షరము 'య'; 4వ పాదములో 5వ అక్షరము 'ణ'.***

శా. దేవా **నా** దగు భాగ్యరీతి కనగా దివ్యమ్ము భవ్యమ్ము నా
 భావం బందున చూడ **రా**జ్యరమయే భద్రమ్ముగా నిల్చు, నే
 చావంబోయెడివేళ వచ్చుననుటల్ చన్నే ? **య**మద్వారమున్
 భావింపన్. గు**ణ**రాశి నాదుబలమున్ వర్ధిల్లగా జేయుతన్.

# నిషిద్ధాక్షరి

***1. 'వ'కార నిషేధముతో విఘ్నేశ్వర స్తుతి మత్తేభ వృత్తము....***

మ. తలతున్ సిద్ధిని పొందగోరి గణనాథా! నిన్నె సిద్ధిప్రదా!

పిలుతున్ బుద్ధిని పొందగోరి సుముఖా! ప్రీతిన్ సుబుద్ధిప్రదా!

నిలుతున్ నీ కడ నోము నోతు గపిలా! నేర్పొప్ప లంబోదరా!

కొలుతున్ దిందును మొట్టికాయల నిదే గుంజిళ్ల నే బెట్టెదన్.

యూట్యూబ్ లింక్ – https://youtu.be/S0JSd-ObxlI

***2. వర్గ ద్వితీయ, చతుర్థాక్షరములను ప్రయోగించకుండ తెలుఁగు పద్య కవితా వైభవమును గురించి ఉత్పలమాల***

ఉ. పద్యము రమ్యమౌ యతుల, ప్రాసల, సద్గణ రాసులన్ సదా,

పద్యము రాగ రంజితము, పాత్రము, సంస్కృతి కాలవాలమున్,

పద్యము తెల్గుకే వరము, పండిత పామర రంజకమ్మునౌ,

పద్యము లోకపూజితము, పద్యము హృద్యము శాశ్వతమ్మునౌ.

(చిటితోటి విజయకుమార్ గారి సంస్కృతానువాదము)

యతి ప్రాస గణోపేతం పద్యం శ్రీ రాగ రంజితమ్ ।

సంస్కృతే రాస్పదం హృద్యం శాశ్వతం లోక పూజితమ్ ॥

యూట్యూబ్ లింక్ – https://youtu.be/FDYoQVvNvXc

***3. అంశము - స్వాతంత్ర్య దినోత్సవము***

***నిషిద్ధాక్షరము - సకారము***

ఛందస్సు – మత్తకోకిల

మ.కో. తెల్లవారలు పారిపోయిరి దేశభక్తుల దీక్షతో,
తల్లి భారతి ముక్తి నందుచు ధన్యయయ్యెను ప్రీతితో,
ఎల్లవారలు పొంగిపోయిరి హెచ్చె మోదము తృప్తితో,
ఎల్లవాడల మూడురంగులవే విరాజిలె కాంతితో.

యూట్యూబ్ లింక్ – https://youtu.be/N9hbwbmSrGc

**4. 'కకార' నిషేధముతో కుచేలుని వృత్తాంతమును మత్తేభ వృత్తము....**

మ. సహనమ్మున్ గల పేద బ్రాహ్మణు డిలన్, సాందీపు శిష్యుండునౌ,
బహుమాన్యుండును, వాసుదేవసఖుడున్ బాల్యమ్ము నందెన్న, శ్రీ
రహితుండైన ధనమ్ము గోరడు, సదారాధ్యుండగున్, గావునన్
మహితున్, ధన్యు, గుచేలు గొల్చెదను, సన్మార్గమ్మునే జూపగా.

**5. 'శ, ష, స, హ' అను అక్షరములు లేకుండ శివధనుర్భంగమును గూర్చి ఉత్పలమాల...**

ఉ. రంగుగ భీమచాపమును, రాముడు లీలగ నెక్కుపెట్టగా,
వంగిన విల్లు ముక్కలయి, వచ్చె రవమ్ము భయంకరమ్ముగా,
పొంగెను భూజయే, యితర భూపతులెల్ల, పరాజయమ్ముతో
క్రుంగిరి, రామచంద్రు డనురూపగుణన్ వరియించె జానకిన్.

**6. రకార, లకార, వకారములను ప్రయోగించకుండ వేంకటేశ్వరుని స్తుతించుచు పద్యము...**

ఉ. పాపిగ నుంటి, దిక్కనుచు భక్తిని నిన్ గొనియాడుచుంటి, నే
నాపద నుంటి, సంకటము నంతము చేసెడి నిన్ను గంటి, మం
గాపతి! కొండ నెక్కితి, సుఖమ్మును గంటి, ఫణీశశాయి! నే
నీ పద మంటి యుంటి, గమనింపుము నన్నిక పద్మనాభుడా!

***7. 'శ, ష, స' ల నిషేధంతో సంక్రాంతి సంబరములపై మత్తకోకిల...***

మ.కో. భోగిమంటలు వేయుచుందురు ముంగిటన్ గన వెచ్చగా
వేగ బొమ్మల కొల్వు లుండును పిల్ల లందరు మెచ్చగా
భోగి పళ్లను పోయుచుందురు ముద్దుబిడ్డలు చేరగా
భోగిపండుగ చూడగా నిల భోగమున్ కలిగించుగా.

రెండవ పద్యము...

మ.కో. చెంగునన్ మకరమ్ము లోనికి చేరు భానుడు హంగుగా
రంగవల్లులు వేయుచుందురు రాగముల్ చిగురింపగా
పొంగలిన్ దిన జేయుచుందురు పూర్తిగా ధన మందగా
పొంగి పెద్దల పూజ గూర్తురు మ్రొక్కి పెద్దల పండుగన్.

***8. 'శ,ష,స' ల నిషేధంతో నూతన సంవత్సర శుభాకాంక్షలు.***

తే.గీ. రెండువేల పద్దెనిమిది ప్రీతి గూర్చి
యేగ, ధన్యవాదాల నర్పించుచుంటి;
రెండువేల పందొమ్మిది ప్రేమ తోడ
రాగ, రమ్మనుచుంటిని రాగ మొప్ప.

***9. 'రక్షాబంధనోత్సవము' విషయముగా, 'ర'కార నిషేధముతో స్వేచ్ఛా ఛందములో పద్యము...***

చం. బలము జయమ్ము నిచ్చు గుణబంధము చేతికి గట్టగా, శచీ
లలనయె గట్టె నాథునికి, లాభము నందెను; లక్ష్మి కట్టె నా
బలికిని, విష్ణువున్ గొనియె భాగ్యము నందెను; నేడు కట్టుడీ,
యిల మనకెల్ల యోగమగు, నీ గుణబంధన మిచ్చు క్షేమమున్.

***10. 'జ, డ' అను అక్షరములను ప్రయోగించకుండ జడపై పద్యము....***

సీ. కేశబంధమ! నిన్ను కృష్ణమూర్తియె మెచ్చు
తన రంగు నీ రంగు దలచి తలచి
కుంతల బంధమా! కువలయాక్షులు మెచ్చు
కొందురు నిను తమ కొప్పు మలచి
కచ బంధమా! నిన్ను కాంతలు మది మెచ్చి
యాభరణ మ్మని యంద్రు వలచి
చికుర బంధమ! నిన్ను స్త్రీ లెల్లరును మెచ్చు
కొందు రందమ్ముల గూర్చి కొలిచి

తే.గీ. ప్రాణ సమమగు ఘన శిరస్త్రాణ మీవె
ఘనత విలసిల్లుదువు ముందు వెనుక నీవె
రమ్య రుచిర శిరోరుహ రాశి వీవె
నీవు లేకున్న నందమ్ము నిలువ దెన్న.



**అవధాని శ్రీ కోట రాజశేఖర్, గిరిజాకుమారి దంపతులను సన్మానిస్తున్న ప్రముఖ అవధాని శ్రీ మైలవరపు మురళీకృష్ణ గారు**

# అనుబంధము

## 1. సంగ్రహ రామాయణం

**సంక్షిప్త బాలకాండ**

మ. సమ ధర్మాకృతి నంది, దాశరథిగా జన్మించి, యా కౌశికో
త్తము వెంటన్ జని, తాటకన్ దునిమి, సిద్ధార్థుండవై దివ్య గౌ
తమ పత్నిన్ గని, యీశు విల్ విరిచి, సీతానాథుడన్ పేర శ్రీ
రమణిన్ గొంటివి, **బాలకాండ** యిది శ్రీరామా! దయారూపమా!

**సంక్షిప్త అయోధ్యకాండ**

మ. భ్రమ వీడన్ నిను తండ్రి రమ్మనె గదా పట్టాభిషేకార్థమై,
భ్రమ తోడన్ నిను కైక పొమ్మనె గదా వన్యాభిషేకార్థమై,
శ్రమియౌ నా గుహు బ్రోచి, శ్రీ భరతుడే ప్రార్థింప నీ పాదుకల్
క్రమతన్ గూర్ప **నయోధ్యకాండ** యిది, శ్రీరామా! దయారూపమా!

**సంక్షిప్త అరణ్యకాండ**

మ. చెవులున్ ముక్కును గోసి శూర్పణఖనే శిక్షింపగా, రావణుం
డవనీజన్ హరియించె స్వర్ణహరిణ మ్మందించి, నీవున్ జటా
యువు మాటన్ విని, సీతకై వెదుకగా నోహో శబర్యర్చనా
ర్ణవమే యబ్బె **నరణ్యకాండ** యిది శ్రీరామా! దయారూపమా!

**సంక్షిప్త కిష్కింధకాండ**

మ. అరయన్ నీ విల ఋష్యమూకమున సీతాన్వేషణన్ జేయగా,
వర సుగ్రీవుడు మిత్రుడయ్యె హనుమద్ వాగ్ధాటిచే నగ్ని సా
క్షి, రణోన్మాదిని వాలి జంపితివి, **కిష్కింధాఖ్యమౌ కాండ** నుం
గరమున్ మారుతి కిచ్చి నావు, ప్రియవాగ్రామా! దయారూపమా!

**సంక్షిప్త సుందరకాండ**

ఉ. సుందర మూర్తి యా హనుమ సుందర రీతుల దాటి సంద్రమున్,
సుందరమైన లంక జని, సుందర సీతను గాంచి, యిచ్చెగా
సుందర మంగుళీయక మశోకమునంద, శిరోమణిన్ గొనెన్,
సుందరమౌ హితమ్ము మది జూడని రావణు లంక గాల్చి, నీ
ముందర జేరి "చూచితిని భూమిజ" నంచనె రామ! దూతగా,
**సుందరకాండ** సుందరము సుందర నామ! దయాస్వరూపమా!

**సంక్షిప్త యుద్ధకాండ**

మ. హనుమన్ కౌగిట జేర్చి, సేతు వమరన్, నీవబ్ధి దాటన్, విభీ
షణు జేరంగొని, పోరు సల్పితివి భాస్వద్బాను పూజించి, రా
వణు నిర్జించితి, సీత గొంటివి దయన్, పట్టాభిరామాఖ్య! కా
రణ జన్మా! వర **యుద్ధ కాండ** యిది శ్రీరామా! దయారూపమా!

**సంక్షిప్త ఉత్తరకాండ**

మ. అపవాదమ్మున కాన కంపితివి సీతమ్మన్ సుశీలన్, మహా
నృప! వాల్మీకియె ప్రోవగా లవకుశుల్ నీ యందు జన్మించి, నీ
కృప నీ గాథను పాడ, భూమిజయు సంతృప్తిన్ ధరన్ జేర, ధీ
ర పతీ! బ్రహ్మయె పిల్వగా నట మహాప్రస్థానమున్ జేసి తౌ
ర! పరా! ఉత్తరకాండ యియ్యదియె శ్రీరామా! దయారూపమా!



## 2. నవదుర్గలు

**శైలపుత్రి :**

తే.గీ. తెలిసి మదిలోని కోర్కెల దీర్చు తల్లి
యర్ధచంద్రుండు తలపైన నలరుతల్లి
వృషభగామి! శూలమును ధరించుతల్లి
శైలపుత్రి ! యశస్విని జయముతల్లి

**బ్రహ్మచారిణి :**

తే.గీ. అక్షమాల నీ కుడిచేత నమరి యుండ
నెడమచేత కమండల మెపుడు నుండ
బ్రహ్మవిద్యల బోధించు ప్రజ్ఞ యుండ
దయ గనుము ''బ్రహ్మచారిణీ'' తపము పండ

**చంద్రఘంట :**

తే.గీ. ఆయుధమ్ములు పదిచేతులందు నమర
నర్ధచంద్రుండు ఘంటగా నలరు తలను
శత్రులన్ ఘంటశబ్దమ్మె చంపు ధరను
కావు మము చంద్రఘంటాఖ్య నీవు కృపను

**కూష్మాండ :**

తే.గీ. వర కమండలము, ధనుస్సు, బాణము, గద,
చక్ర, మమృతకలశము, లసత్కమలము,
ఏడు చేతుల; జపమాల ఎనిమిదవ క
రమున రాజిల్లు కూష్మాండ! ప్రణుతి ప్రణతి.

**స్కందమాత :**

తే.గీ. బాలుడగు స్కందుడే ఒడి లీల నుండ
రెండు చేతుల పద్మమ్ము లుండ, నీవు
పూర్తిగా వెల్గుచుందువు కీర్తిచేత,
జనని! శుభముల గూర్చుమా స్కందమాత!

**కాత్యాయని :**

తే.గీ. ధరణి కాత్యాయనమహర్షి తనయ వీవె,
యా త్రిమూర్తుల తేజమ్ము నందినావు,
యమున దరి గోపికల పూజ నలరినావు
మదిని దలతు, కాత్యాయనీ! మమ్ముఁ బ్రోవు.

**కాళరాత్రి :**

తే.గీ. నిజముగా జీవకోటికి నీవె ధాత్రి
వాశ్రయించిన భక్తుల కభయదాత్రి
వెన్న గార్దభవాహన! హే త్రినేత్ర!
కరుణజూడు శుభంకరి! కాళరాత్రి!

**మహాగౌరి :**

తే.గీ. సాంబశివు గోరి, శ్వేత వస్త్రాల నమరి,
పూజ్యమాతగ, వర చతుర్భుజగ నలరి,
యభయ హస్తగ, వృషభవాహనగ దనరి,
వెలుగు నిన్ను ''మహాగౌరి! '' కొలుతు చేరి.

**సిద్ధిదాత్రి :**

తే.గీ. సిద్ధ గంధర్వ యక్షులు సేవ జేయ
నణిమ మొదలగు సిద్ధుల నందజేయ
శివుని యర్ధాంగివై దరి జేరు సదయ
సిద్ధిదాత్రివై మమ్ము రక్షింపుము దయ.

**ఫలశ్రుతి :**

తే.గీ. ఇచ్చ నీ నవ దుర్గల నెంచి యెడద
నీ స్తుతిన్ శ్రద్ధతో నిల నెవ్వరేని
వ్రాసి, పఠియించి, దర్శించి, భక్తిని, విని
దేవి కృప నందగలరు సద్భావము గని.




**నెల్లూరులోని శ్రీ రాజరాజేశ్వరి దేవాలయంలో టి.టి.డి. వారి 'మన గుడి' కార్యక్రమంలో వరలక్ష్మీ వ్రత ప్రాశస్త్యమును వివరిస్తున్న సందర్భం (౯-౮-౨౦౧౯)**

## ౩. శ్రీ మాత్రే నమః

విజయా! శారద! మాధవీ! కుముద! నీవే దిక్కు  నారాయణీ!
భజియింతున్ నిను భద్రకాళి! మది నంబా! దుర్గ! హే మాధవా
నుజ! యీశాన! అజేయ! మాయ! కని నిన్నున్ గన్యకా! చండికా! నిజ
మాయన్ తొలగింప గొల్చెదను నిన్నే కృష్ణ! హే వైష్ణవీ!

**అష్టవిధ ఆయుధములతో అష్టభుజి అమ్మవారు**

శూల గదాసి చాప శర సుందర సారస శంఖ చక్రముల్
లీలగ జేతులన్ మెరయ, ప్రీతిని గూర్తువు శిష్ట రాశికిన్,
కాళ నిశీథి వోలె భయకంపము గూర్తువు దుష్ట రాశికిన్,
వాలిన భక్తి మ్రొక్కెద, భవాని! మదంబ! యుమా! మహేశ్వరీ!

ఎరుగన్ మంత్రము, దాని యర్థమును, ధ్యానింపంగ నీ శ్లోకమే
నెరుగన్ ముద్రను, దండకమ్ము మది నర్చింపంగ బీజాక్షర
మ్మెరుగన్, స్తోత్రము, నామమున్, గవచమే, యీ దీను నీ పుత్రునిన్
మరువన్ బోకు భవాని! నీవె గతి శ్రీమాతా! జగన్మోహినీ!

**అహింసా ప్రథమం పుష్పంఅనే శ్లోకభావంతో ...**

సరిగా ముందుగ నీ పదమ్ముల కహింసా పుష్పమున్ గూర్చెదన్,
వరమౌ నింద్రియ నిగ్రహమ్మును, దయాభావమ్ము, నోర్పున్, శుభం
కరమౌ శాంతి తపస్సు ధ్యానమును వేడ్కన్ సత్యమున్ గూర్తు, నీ
శ్వరి! పూజించెద తల్లి! యష్టవిధ పుష్పాలన్ రమా! మాధవీ!

# 4. అల్లూరు గ్రామ దేవత శ్రీశ్రీశ్రీ పోలేరమ్మ స్తుతి

## (నవరత్న మాలిక)

తే.గీ. అంబ! అల్లూరు వాసినీ! ఆదిశక్తి !
భార్గవీ ! దుర్గ ! కళ్యాణి! భద్రమూర్తి!
వాణి ! శర్వాణి ! వైష్ణవీ! భవ్యదీప్తి !
కావుమమ్మ పోలేరమ్మ! కరుణ గనుమ.

తే.గీ. ఖలుల ఖండించగల మహాకాళి వీవె
రాసులుగ సిరులిడు మహాలక్ష్మి వీవె
వాక్కునిచ్చు మహాసరస్వతివి నీవె
కావుమమ్మ పోలేరమ్మ! కరుణ గనుమ.

తే.గీ. గ్రామదేవత! ప్రేమతో గనెడిమాత!
ప్రజ్ఞతో మార్చగలవుగా బ్రహ్మ వ్రాత.
నభయమును కోరుచుంటి నే నందుచేత,
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

తే.గీ. దుష్ట శిక్షణ చేతువు దోషమరసి
శిష్ట రక్షణ జేతువు సేవనరసి.
ఘనముగా సేవ జేతుము కలసి మెలసి.
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

తే.గీ. తప్పుజేసితి తెలియక దైవమనక.
తప్పుజేసితి తెలిసియు ధర్మమనక.
దేవి! అందరకును నీవె దిక్కుగనుక,
కావుమమ్మ, పోలేరమ్మ ! కరుణ గనుమ.

తే.గీ. నిత్యశుభముల నిచ్చును నీదుగరిమ.
నిజము చల్లగ జూచును నీదు ప్రేమ.
నేను వర్ణింపజాలను, నీదు మహిమ.
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

తే.గీ. చేరి పల్లకీసేవను చేతుమమ్మ,
విరుల పూలంగిసేవ గావింతుమమ్మ,
కోరి కుంకుమ పూజల గొలుతుమమ్మ,
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

తే.గీ. శ్రీకరమ్ముగ తిరునాళ్ళ జేతుమమ్మ.
తరతరాలు నీ జాతర తలతుమమ్మ.
నీదు చరణమే శరణు, మమ్మాదుకొమ్మ.
కావుమమ్మ పోలేరమ్మ! కరుణ గనుమ.

తే.గీ. ఘన కుటుంబిని లోకాల గన్నతల్లి!
కామితార్థము లిచ్చెడి కల్పవల్లి!
నీదు సన్నిధి పెన్నిధి, నిజము తల్లి!
కావుమమ్మ పోలేరమ్మ ! కరుణ గనుమ.

తే.గీ. శ్రద్ధ నీ స్తోత్రమాలిక చదువువార
లాయురారోగ్య భాగ్యాల నందగలరు.
పూర్ణఫలమును శాంతిని పొందగలరు.
కావుమమ్మ పోలేరమ్మ! కరుణ గనుమ.

## 5. తెలుగు వెలుగు

ఉ. తీయనిభాష యీ తెలుగు తేజముగూర్చెడి భాష, శీలమే
ధ్యేయమటన్నభాష, వరతీర్థముబోలినభాష, కమ్మనౌ
గేయములందు పద్యముల కీర్తనలన్ పద గద్యరాసులన్
బాయనిభాష, యీతెలుగుభాష విరాజిలుగాక సర్వదా.

ఉ. జీవముతో వెలుంగుచు, విశిష్టపథమ్ముల నిల్చుచున్, సుహృత్
భావమునేర్పి తానమృతభాషగ నిల్చుచు తేనెలొల్కుచున్
భావితరాల కీ తెలుగుభాష సుకీర్తులనందజేయుచున్
పావనమైన యీ తెలుగుభాష విరాజిలుగాక సర్వదా

సీ. వెయ్యేళ్ళపైబడి వెలుగుచు నున్నట్టి
తీయనిభాష నా తెలుగుభాష
వరకవీశుండు సుబ్రహ్మణ్యభారతి
తెలిసి పొందిన భాష తెలుగుభాష
భారత జాతీయభాష కాగలదని
తెలిపె శ్రీశ్రీ. ధన్య తెలుగుభాష
ఆ యునెస్కోవార లన్న దబద్ధమ్ము
అద్భుత మిదియె నా దమృతభాష
తే.గీ. కళలతోడను రాజిల్లు తెలుగుభాష
దివ్యమైనది యిల మన తెలుగుభాష
తలప నిత్యమ్ము జగముల వెలుగుభాష
తీయనిది వెనుదీయని తెలుగుభాష

ఉ. మాన్యులు సత్కవుల్ గుణసమంచిత యోగులు తాపసోత్తముల్
మాన్యత తెల్గుభాష నసమానపథమ్మున నిల్పినా రసా
మాన్యులు వారిసూక్తులను మంచిగనెంచుము భాగ్యమందగా
ధన్యతనందగా తెలుగుతల్లికి వందన మాచరింపుమా

సీ. మంచిని బోధింప మన తెల్గువారికి
సొమ్ముగా రామాయణమ్ము గలదు.
వేదసారమ్మనే విన తెల్గువారికి
సొమ్ముగా వరభారతమ్ము గలదు.
ఘనముక్తి నందింప మనతెల్గువారికి
భక్తపోతన భాగవతము గలదు.
మహితభక్తి వెలుంగ మనతెల్గువారికి
సుమతి నీయగ పురాణములు గలవు.
తే.గీ. నీతిశాస్త్రాలు కావ్యాలు నృత్యగతులు
కథలు గాథలు కీర్తనల్ కళలు గలవు.
తత్త్వములు గీతములు నిత్యధర్మకృతులు
కలవు తెలుగున, చదివిన కలుగు శుభము.

ఆ.వె. సంస్కృతమ్ము దివ్య సంస్కృతి నిడు భాష
మహిని భాషలకును మాతృభాష
సంస్కృతమ్ముతోడ జక్కగా గలిసిన
తెలుగుభాష సతము వెలుగు భాష

సీ. విజ్ఞానసర్వస్వ వేదమై మన పెద్ద
బాలశిక్ష గలదు లీల గనగ
తెలుపద్యమ్ముల తీయగా నేర్వగా
శతక సాహిత్యమ్ము చాల వెలుగు
నిర్దుష్టభాషను నిర్ణయింపగ వ్యాక
రణశాస్త్ర మున్నది ప్రజ్ఞనిడగ
ధర్మార్థకామాల ధన్యత చేకూర్ప
గావ్యాలు తత్త్వాలు కలవు వినగ
తే.గీ. మాతృభాషయే ముఖ్యమ్ము మహిని వెలుగ
తెలుగుభాషలో మహిమను తెలిసికొనగ
దృష్టిసారింపుమా? తెల్గు నిష్టపడగ
తెలుగుతల్లియు పులకించు నిల నిజముగ.

సీ. నా భాష తెలుగు మనము తెల్గువారల
మనుస్పృహతో మన మలరవలయు
మన కళాశాలలు మన మాతృభాషకు
ప్రాముఖ్యము నొసంగి వరలవలయు
మన పాఠశాలల మాతృభాషా మాధ్య
మమున బోధన సదా యమరవలయు
మనరాష్ట్రమందున మనతెల్గుభాషను
ప్రథమభాషగ జేసి పలుకవలయు

తే.గీ. నన్నికళలకు ప్రోత్సాహ మందవలయు
చక్కగా తెల్గుపండుగల్ జరుగవలయు
నాంధ్రదేశమ్ము తేజమ్ము నందవలయు
విశ్వమున తెల్గువెలుగు వ్యాపించవలయు.

సీ. పాలనలో నవలీల తెలుగును నూ
టికి నూరుపాళ్ళు పాటింపవలయు
మొత్తమ్ము పాలనన్ పూర్తిగా వెస నుత్త
రమ్ములు తెలుగులో వ్రాయవలయు
పూర్తిగా నాంధ్రప్రభుత్వ చట్టమ్ములు
ముందుగా తెలుగులో నుండవలయు
నధికార కార్యాలయమ్ముల వివరమ్ము
లెంచ తెల్గున కనిపించవలయు
తే.గీ. నన్నికళలకు ప్రోత్సాహమమరవలయు
చక్కగా తెల్గుపండుగల్ జరుగవలయు
ఆంధ్రదేశమ్ము తేజమ్ము నందవలయు
విశ్వమున తెల్గువెలుగు వ్యాపించవలయు.

ఉ. తెలుగున మాటలాడుము ప్రదేశము మారిన వేళనైన, నీ
తెలుగున వ్రాయుమా, సతము తెల్గుప్రబంధములన్ బఠింపుమా,
తెలుగును ప్రేమతో గనుము తెల్గుప్రపంచ మహాసభాస్థలిన్
వెలుగుము, తెల్గుతేజమును విశ్వమునందు వెలుంగజేయుమా.

## ౬. గాంధీజీ

ఉ. కోరవు నీవు నీ కొఱకు, కోరవు నీ సతికోస, మెప్పుడున్
కోరవు నీ సుతాళికయి, కోరుదు వీ భరతోర్వి కోసమై,
కారణజన్మ నందితివిగా! పరపాలన బారద్రోలగా;
భారతదేశ జాతిపిత! బాపుజి! గాంధి! మహాత్మ! మ్రొక్కెదన్.

కం. భాసుర సత్యాహింసలె
వాసిగ నాయుధము లనుచు భాసిలు మోహన్
దాసు కరంచంద్ గాంధీ!
మీ సము లెవరయ్య? బాపు! మీ కివె ప్రణతుల్.

కం. స్వాతంత్ర్య సమర యోధుడ!
నీ తంత్రము మంత్రము గని, నిశ్చేష్టులునై
స్వాతంత్ర్య మిచ్చి వెళ్లిరి,
పాతకులా తెల్లదొరలు; బాపూ! ప్రణతుల్.

సీ. గుజరాతులో బుట్టి గుణరాశి జేపట్టి
పోరుబందరు జన్మభూమి యనుచు,
మురికిని పోగొట్టి సిరులను చూపెట్టి
శుభ్రత నేర్పించు సుమతి వగుచు,
కొల్లాయినే గట్టి కోరి పట్టును బట్టి
చేత కర్రను బట్టి నేత వగుచు,
వైరుల కనిపెట్టి పోరును మొదలెట్టి
భారత స్వాతంత్ర్య పథము గనుచు,

తే.గీ. సరిగ దొరలను భయపెట్టి తరిమికొట్టి,
కన్నతల్లికి స్వేచ్ఛను కట్టబెట్టి
ఖ్యాతి నందిన భారత జాతిపితవు
కష్టముల బాపు, బాపు! నీ కంజలులివె.

మ. పుతలీబాయియె పొంగె, ధన్యత గనెన్ పుణ్యాలపంటై జనిం
చితి వీ వంచు, మహాత్మ! గాంధి! భరతశ్రీ పొంగెగా, నీదు సం
గతి నీ పత్నిగ జన్మ ధన్యత గనన్ కస్తూరిబా పొంగె, స
మ్మతి స్వాతంత్ర్యము పొంగె భారతమునన్, మా దైవమా! మ్రొక్కెదన్.

సీ. ఆయుధాల్ పట్టక యా తెల్లదొరలతో
పోరాడి గెలువగా పుట్టినావు,
రాతల మార్చును గీతయే యని భగ
వద్గీత సతము చేపట్టినావు,
ఆ ఉప్పు సత్యాగ్రహమ్మున ఆంగ్లేయ
వీరుల కడు భయపెట్టినావు,
భారతదేశ త్రివర్ణ పతాకను
విన్వీథిలో నిలబెట్టినావు,
తే.గీ. పట్టుదలలోన నీయంత బలుడు గలడె?
సూనృతము బల్క నీయంత సుమతి గలడె?
నీతి నియమాల నీయంత నేత గలడె?
ఘనత నీ సాటి నీవె, ఓ గాంధితాత!

కం. కరణములు సహాయనిరా
కరణ, విదేశీయ వస్తు గణ కార్య బహి
ష్కరణ, భరత వస్తు తతుల
వరణ, మనెను దేశభక్తిపరుడై గాంధీ.

కం. "నూలును వడకచు, రాట్నము
కేలను ద్రిప్పుచు, విశేష కృషి జేసి, సదా
లీలగ ఖద్దరు దాల్చుట
మే"లను గాంధీ! ప్రణతులు మీకివె బాపూ!

శా. "మీరల్ రావలె దేవలోకమునకున్ మేల్గూర్ప" నంచున్ సురల్
కోరన్ మీ దరి జేరిరేమొ? శుభమున్ గూర్పంగ నా స్వర్గమున్
జేరన్ వెళ్లితివేమొ? పంపినది గాడ్సే పాపమో? పుణ్యమో?
ధీరా! బాపు! మహాత్మ! జాతిపిత! గాంధీ తాత! మీ కంజలుల్.



# 7. సీ పీ బ్రౌన్ గారి తెలుగు భాషాసేవ

శా. శ్రీపాత్రమ్ముగ సంస్కృతాంధ్రముల నీ చిత్తమ్ము లగ్నమ్ముగాన్,
తాపమ్మున్ విడి తాళపత్రకృతు లీ ధాత్రిన్ ప్రకాశింపగా,
దీపమ్మైతివి తెల్గుభాషకు మహాతేజమ్ము చేకూర్చుచున్,
సీ పీ బ్రౌను దొరా! ప్రణామములు, మీ సేవల్ ప్రశంసార్హముల్.

శా. ఏమాశ్చర్యము? నీవు తెల్లదొరవై యీ నేల కావ్యమ్ములన్
శ్రీమద్రీతి పరిష్కరించితివి, యేరీ సాటి నీకెన్న నా
వేమన్నన్ గని వారి పద్యముల నీ విశ్వమ్ములో నిల్పితే,
ధీమన్! నీదు నిఘంటువుల్ వెలయ కీర్తిన్ వెల్గె మా తెల్గు, హే
శ్రీమన్! బ్రౌను దొరా! ప్రణామములు మీ సేవల్ ప్రశంసార్హముల్.

మ. గురుదేవుండుగ వెల్లఫూడి బుధుడౌ కోదండరాముండు శ్రీ
కరమౌ తెల్గును నేర్ప, నా కడపయే కైమోడ్పులందింప, సుం
దరమౌ భాష వెలుంగ జేసితివి శ్రద్ధన్ తెల్గు సూర్యుండవై,
సిరివై, బ్రౌను దొరా! ప్రణామములు, మీ సేవల్ ప్రశంసార్హముల్.

శా. ధీపాత్రా! బడులెన్నొ పెట్టితివిగా తేజమ్ము చేకూర్పగా,
కాపాడన్ వికలాంగులన్ ధనము సౌకర్యమ్ము నందించితే!
ఆపద్బాంధవ! దానధర్మముల జేయన్ మేటి వైనావు, ఓ
సీ పీ బ్రౌను దొరా! ప్రణామములు, మీ సేవల్ ప్రశంసార్హముల్.

శా. వీసంబంతయు స్వార్థమున్ గనని సర్వేపల్లి బృందమ్ము, మా
యాసల్ పండెనటంచు నేటి సభ నిన్నర్చించె నీ కైతలన్,
వాసింగాంచిన తెల్గు సేవకుల సంభావించి సన్మానముల్
చేసెన్, బ్రౌను దొరా! ప్రణామములు, మీ సేవల్ ప్రశంసార్హముల్.

# 8. మానవత్వపు విలువలు

**ఆత్మోపదేశము**

శ్లో. ఆహార నిద్రా భయ మైథునాని
సామాన్య మేతత్ పశుభి ర్నరాణాం ।
జ్ఞానం నరాణా మధికో విశేషః
జ్ఞానేన హీనాః పశుభి స్సమానాః ॥

**పద్యాను వాదము**

మ. మనకున్ ధారుణి సర్వజీవులకు సామాన్యమ్మె త్రాసమ్ము, చే
తన యాహారము నిద్ర మైథునము సంతానమ్ము పంచత్వమున్
గన జ్ఞానమ్మధికమ్ముగా మనకు సౌఖ్యమబ్బ సిద్ధించు గా
వున నా జ్ఞానము లేనివాడు పశునైపుణ్యంబునన్ గ్రాలడే.

ఉ. చప్పున మంచి చెడ్డలను జక్కగ భావన చేసి మంచినే
తప్పక యాచరింపవలె ధైర్యముగా నని జ్ఞానమార్గమున్
చెప్పుటయన్నచో సులువు చేయుట కష్టము జ్ఞానశీలివై
తప్పుల మాని యొప్పులనె తప్పక జేయుము మానవుండవై

ఉ. తల్లియు తండ్రియున్ మనకు దైవములంచుతలంపుమయ్య యా
తల్లికి తండ్రికిన్ తగిన ధార్మిక సేవలు చేయుమయ్య యా
పిల్లలు తల్లిదండ్రులను వృద్ధుల యాశ్రమ మందు నుంచుటల్
చెల్లునె? మానవత్వమె యిసీయని నవ్వదె? యూహసేయుమా

ఉ. భార్యయె ఆటవస్తువని బానిస యంచు తలంపబోకుమా!
భార్యను, తోడునీడను, శుభావళిలో సహధర్మచారిణిన్
ఆర్యను, వంశవర్ధనిని హాయికి పాదును, స్నేహశీల స
త్కార్యను, ప్రేమతో గనుము ధాత్రిని మానవతా పథమ్మునన్

ఉ. లీలగ నాడువారి గనురీతుల క్షేమము నందగా పర
స్త్రీలను మాతృభావము వసింపగ గాంచుమ యమ్మవారుగా,
బాలగ, పార్వతీసతిగ, భారతిగా, జనకాత్మజాతగా
కాళిగ, జూచి భద్రములకై ప్రణమిల్లుము మానవుండవై.

చం. వరమని యెల్లెడన్ సమయపాలన జేయుము మాటమీదనే
నిలబడు మాదర మ్మెడద నిండగ భవ్య పరోపకారమున్
సలుపుము, కోపతాపముల జంపుము, నిత్యము దీన సేవలో
మెలగుము, మానవత్వమె యమేయ ధనమ్మని చాటిచెప్పుమా!

చం. ఇతరులలోని దోషముల నెంచక దుర్గుణమున్ ద్యజించెదన్
హితమతినై చరించెద గణించుచు దీనుల నాదరించెదన్
మతి నిదె శారదా సతిని నమ్మెద మానవతా ప్రమాణమున్
సతతము పెంచనెంతు మనసార ప్రమాణము నాచరించెదన్

ఉ. ఈ భరతావనిన్ మన నరేంద్రుడు పల్కెనుగా దరిద్రదే
వోభవయంచు నా పలుకు పుణ్యతమంబని యాచరించ లే
మా? భయముల్ తొలంగ భువి మానవ సేవల చేయుబూన లే
మా? భవసార్థకత్వమగు మాధవసేవ యిదేగదా సదా!

ఉ. మంచి నరుండు చేయగనె మంచిని గూర్చును వేయిరెట్లుగా
నెంచుచు దైవమెప్పుడు మహిన్, చెడుజేసిన వేయిరెట్లుగా
నెంచుచు చెడ్డజేయు నిదియేగద కర్మఫలంబు; కావునన్
మంచిగ కర్మచేయుమిక మానవతా గుణరాశి పండెడిన్

ఉ. మానవ! తోడివారల నమానుషరీతుల గష్టపెట్టుటల్
మానవ, ద్వేషరోషములు మానవ, నీ మది దుష్టభావముల్
మానవ, సర్వజీవుల సమానముగా గనుమయ్య, నిత్యమై
మానవజాతి వర్ధిలును మానవతా విభవమ్ము వెల్గెడిన్

## ౯. భారత సైనికుడు

ఉ. భారత దేశ భక్తుడవు, ప్రాణము లొడ్డుచు, దేశ రక్షణన్
గోరుచు, తల్లిదండ్రులను గూరిమి బంధుల నాలుబిడ్డలన్
దూరము జేసికొంచు, బరితోషము నందెడి త్యాగమూర్తి! మా
భారము మోయు దైవమ ! శుభమ్మగుగాక జయమ్ము సైనికా !

ఉ. కోరవు రాజభోగముల కోరవు నీదు శరీర సౌఖ్యముల్
కోరవు బంధువర్గముల కోరవు వేళకు నన్నపానముల్
భారత మాతృ సేవ యను భాగ్యమె కోరుచునుండి వైరితో
బోరెద వీవు ప్రాణములు పోవుచు నున్న, జయమ్ము సైనికా !

## 10. అమృత తత్త్వమ్ము దేహ సమర్పణమ్ము

తే.గీ. ఈ సమాజము నాకేమి యిచ్చెననక
ఈ సమాజమునకు నేమి యీయగలనొ
యనుచు దేహమునర్పించు నమరులార
యమృతతత్వమ్ము దేహసమర్పణమ్ము

తే.గీ. ఆర్తులను గావ దేహసమర్పణమ్ము
నవయవసమర్పణము చేయునట్టివారు
ఘనులు మృత్యుంజయులు నుపకారపరులు
మరణమందియు జీవించు మౌనివరులు

తే.గీ. దేహమాంసమ్ము నిడి శిబి తేజమందె
వెన్నెముకనిచ్చిన దధీచి విమలుడయ్యె
దేహమిచ్చి కపోతమ్ము దివ్యమయ్యె
నమృతతత్త్వమ్ము దేహసమర్పణమ్ము

తే.గీ. అవయవమ్ముల నర్పించునట్టినీవు
శ్రేయమిడుదువు ప్రాణమ్ము పోయగలవు
సృష్టికి వసుధ ప్రతిసృష్టి చేయగలవు;
అమృతతత్త్వమ్ము దేహసమర్పణమ్ము

తే.గీ. కాయమను పండు చెడ బారవేయకుండ
విత్తనాలను నవయవాలిత్తు ననుచు
నుపకరించు ముగింపు మహోన్నతమ్ము;
అమృతతత్త్వమ్ము దేహసమర్పణమ్ము

## 11. మాతృదేవో భవ

మ. నవమాసమ్ములు మోయుచున్, గడుపులోనన్ దాచుకొంచున్, సదా
యవనిన్ నీదగు ప్రాణముల్ పణముగా నర్పించుచున్, బ్రేమతో
నవజీవమ్ము నొసంగుచున్, జగతికానందమ్ము చేకూర్చుచున్,
స్తవనీయంబగు దైవమైతివి గదా, తల్లీ! నమస్కారముల్

ఉ. పుట్టినబిడ్డ దేడ్వ బరిపూర్ణ కృపారసరాశి పొంగ, నా
పట్టికి పాలుపట్టి, కడుపారగ భద్రముగూర్చి, సేవకున్
బెట్టని కోటయన్నటుల ప్రేమగ సేవలొనర్చి, స్వార్థమె
ప్పట్టునలేక, పెంచు, మనపాటికి దైవము కన్నతల్లియౌ.

ఉ. చుట్టు సమస్యలున్న, మనసున్న మనీషిగ, జీవనమ్మునే
నెట్టుచు, కన్నబిడ్డకయి నిత్యము కష్టమునోర్చి, బిడ్డ తా
దిట్టిన, కొట్టినన్ మరచి, దీవెనలిచ్చెడి, కన్నతల్లి కా
ల్పట్టి నమస్కరించెదను, భక్తిని గొల్చెద మాతృదేవతన్.

## 12. భారతమాత

ఉ. శ్రీరమణీయ పూరుషుల, సిద్ధుల, యోగుల, త్యాగమూర్తులన్,
సారవిచార తత్పరుల, సాధుల, సంతుల, దేశభక్తులన్,
ధీరుల, వీరశూరగుణ దీప్తుల, సంతుగ గాంచినట్టి, మా
భారతమాత పాదముల, భక్తి, నమస్కృతులాచరించెదన్.

## 13. శ్లోకమునకు అనువాదము

శ్లో. రాధా పునాతు జగ దచ్యుత దత్తచిత్తా
మంథాన మాకలయతీ దధిరిక్త పాత్రే।
తస్యాః స్తన స్తబక చంచల లోలదృష్టిః
దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్॥

**అనువాద పద్యము**

ఉ. శ్రీహరి నెంచుచున్ పెరుగు లేని ఘటమ్మును జిల్కెరాధ, తా
నూహల రాధ నెంచి హరియున్ వృషభమ్మును గట్టి వింతగా
దోహన కార్యమగ్నుడుగ తోచెను. దన్మయతన్ విమోహతన్,
శ్రీహరి రాధ లీ జగతి బ్రీతిని గూర్తురు పావనమ్ముగా.

## 14. 'అరయన్ శంతను...' పోతన గారి పద్యానికి అనుకరణ

మ. అవనీశా! గుహుపై, మునీశ్వరులపై నా కాకిపై నా జటా
యువుపై, రాక్షస రాశిపై, శబరిపై, నూహింప సుగ్రీవుపై,
పవమానాత్మజుపై, విభీషణు పయిన్, వర్షించు నీ సద్దయన్
లవమాత్రమ్ముగ నా పయిన్ నిలుపుమా! రామా! దయారూపమా

## 15. వాయసోపదేశం

ఉ. కావు జగాలు నిత్యములు, కావు ధనమ్ములు శాశ్వతమ్ములున్,
కావు దలంప సత్యములు కంటికి గన్పడు దేహబంధముల్,
కావు న నీవు దైవమును కావు మటంచును వేడ, బల్కెడిన్
కావని కావుకావు మని కాకి స్వకీయ మహోపదేశమున్.

# 16. పంచేంద్రియముల సార్థకత

ఉ. కన్నులు మీ స్వరూపమును గాంచగ, నాసిక మీపదమ్ములం
దున్న సుమాల గంధములతో సుఖమందగ, శ్రోత్ర మెంచి వి
ద్వన్నుత! నీదుకీర్తనల వాంఛ వినంగను, నాదు జిహ్వ మి
మ్మెన్నుచు నామమున్ బలుక, నీ తనువున్ నిను చేర గోరి, యా
పన్నశరణ్య! చారులుగ వర్తిలె నో పరమాత్మ! ప్రోవుమా.

__oOo__



**నెల్లూరు పద్య సారస్వత పరిషత్ వారు గ్రంథావిష్కరణ సభలో**

**శ్రీ కోట రాజశేఖర్ గారికి సన్మానపత్రం అందజేస్తున్న దృశ్యం**

# శాశ్వత దిన దర్శిక　　PERMANENT CALENDAR　　శాశ్వత దిన దర్శిక



**Methods of Calculation :** 1. First locate the required year and serial number of the month in the vertical line corresponding. Then locate the required date in the corresponding box of dates in the top. You can find the day in the line vertically corresponding to it. 2. Divide the year of Christian Era by 400. If the remainder is less than 300 add 2000 to it. If the remainder is more than 300 add 1600 to it. Locate the figure in years. Find the day as 1 above.

State Level Best Teacher Awardee Kota Rajasekhar Avadhani, M.A., Rtd., Sanskrit Lecturer, Ramakrishna Junior & Degree College, Allur - 524 315, Nellore District, A.P., India.
( House Address : Plot No. 30, 3rd Cross Road, 1st Street, K.R.R. Nagar, Padugupadu, Kovur, Nellore Dt., - 524 137. A.P. India Cell : 09966236604)

| RAHU TIMINGS | వారములు | DAYS | తేదీలు | | | DATES | | | తేదీలు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 4.30 - 6.00 | ఆదివారము | SUNDAY | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 | 31 3 10 17 24 | 30 2 9 16 23 |
| 7.30 - 9.00 | సోమవారము | MONDAY | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 | 31 3 10 17 24 |
| 3.00 - 4.30 | మంగళవారము | TUESDAY | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 |
| 12.00 - 1.30 | బుధవారము | WEDNESDAY | 4 11 18 25 | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 |
| 1.30 - 3.00 | గురువారము | THURSDAY | 5 12 19 26 | 4 11 18 25 | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 | 6 13 20 27 |
| 10.30 - 12.00 | శుక్రవారము | FRIDAY | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 | 7 14 21 28 |
| 9.00 - 10.30 | శనివారము | SATURDAY | 7 14 21 28 | 6 13 20 27 | 5 12 19 26 | 4 11 18 25 | 3 10 17 24 31 | 2 9 16 23 30 | 1 8 15 22 29 |
| * 22 50 78 06 34 62 90 02 30 58 86 * 26 54 82 | | | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 |
| 1900 23 51 79 07 35 63 91 03 31 59 87 * 27 55 83 | | | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 |
| * 24 52 80 08 36 64 92 04 32 60 88 * 28 56 84 | | | 6 | 9 12 | 1 4 7 | 10 | 5 | 2 8 | 3 11 |
| * 25 53 81 09 37 65 93 05 33 61 89 01 29 57 85 | | | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 |
| * 26 54 82 10 38 66 94 06 34 62 90 02 30 58 86 | | | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 |
| * 27 55 83 11 39 67 95 07 35 63 91 03 31 59 87 | | | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 |
| * 28 56 84 12 40 68 96 08 36 64 92 04 32 60 88 | | | 1 4 7 | 10 | 5 | 2 8 | 3 11 | 6 | 9 12 |
| 01 29 57 85 13 41 69 97 09 37 65 93 05 33 61 89 | | | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 |
| 02 30 58 86 14 42 70 98 10 38 66 94 06 34 62 90 | | | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 |
| 03 31 59 87 15 43 71 99 11 39 67 95 07 35 63 91 | | | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 |

| సంవత్సరములు YEARS సంవత్సరములు | నెలలు | | | MONTHS | | | నెలలు |
|---|---|---|---|---|---|---|---|
| 04 32 60 88 16 44 72 * 12 40 68 96 08 36 64 92 | 5 | 2 8 | 3 11 | 6 | 9 12 | 1 4 7 | 10 |
| 05 33 61 89 17 45 73 * 13 41 69 97 09 37 65 93 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 |
| 06 34 62 90 18 46 74 * 14 42 70 98 10 38 66 94 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 |
| 07 35 63 91 19 47 75 * 15 43 71 99 11 39 67 95 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 |
| 08 36 64 92 20 48 76 * 16 44 72 * 12 40 68 96 | 3 11 | 6 | 9 12 | 1 4 7 | 10 | 5 | 2 8 |
| 09 37 65 93 21 49 77 2100 17 45 73 * 13 41 69 97 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 |
| 10 38 66 94 22 50 78 * 18 46 74 * 14 42 70 98 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 |
| 11 39 67 95 23 51 79 * 19 47 75 * 15 43 71 99 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 |
| 12 40 68 96 24 52 80 * 20 48 76 * 16 44 72 * | 9 12 | 1 4 7 | 10 | 5 | 2 8 | 3 11 | 6 |
| 13 41 69 97 25 53 81 * 21 49 77 2200 17 45 73 * | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 |
| 14 42 70 98 26 54 82 * 22 50 78 * 18 46 74 * | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 |
| 15 43 71 99 27 55 83 * 23 51 79 * 19 47 75 * | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 |
| 16 44 72 2000 28 56 84 * 24 52 80 * 20 48 76 * | 10 | 5 | 2 8 | 3 11 | 6 | 9 12 | 1 4 7 |
| 17 45 73 01 29 57 85 * 25 53 81 * 21 49 77 2300 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 |
| 18 46 74 02 30 58 86 * 26 54 82 * 22 50 78 * | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 | 6 |
| 19 47 75 03 31 59 87 * 27 55 83 * 23 51 79 * | 6 | 9 12 | 4 7 | 1 10 | 5 | 8 | 2 3 11 |
| 20 48 76 04 32 60 88 * 28 56 84 * 24 52 80 * | 2 8 | 3 11 | 6 | 9 12 | 1 4 7 | 10 | 5 |
| 21 49 77 05 33 61 89 01 29 57 85 * 25 53 81 * | 5 | 8 | 2 3 11 | 6 | 9 12 | 4 7 | 1 10 |

ఉపయోగ విధానములు : 1) మొదటి సంవత్సరాన్ని గుర్తించాలి. ఆ తరువాత కుడివైపు వరుసలోగల నెలను గుర్తించాలి. ఆ తరువాత పై వైపుగల తేదీని గుర్తించాలి. ఆ తరువాత ఎడమవైపు వరుసలో చూస్తే మనము కోరిన తారీఖునకు వారము తెలుస్తుంది. 2) క్రీస్తు శకంలోని సంవత్సరమును 400 చే భాగించి శేషము 300 కంటే తక్కువగా ఉంటే 2200 కలపాలి. 300 కంటే ఎక్కువగా ఉంటే 1600 కలపాలి. వచ్చిన సంఖ్యను సంవత్సరములలో గుర్తించి ముందువలె వారం తెలుసుకోవచ్చు.

**బ్రహ్మశ్రీ కె.ఎస్.రామానుజాచార్యులు** (రిటైర్డ్ ప్రిన్సిపాల్, వేద సంస్కృత కళాశాల, మూలాపేట, నెల్లూరు) గారికి ఈ క్యాలెండర్ అంకితం.

తయారుచేసినవారు : **రాష్ట్రస్థాయి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత అవధాని కోట రాజశేఖర్,** ఎం.ఎ., విశ్రాంత సంస్కృత ఉపన్యాసకులు రామకృష్ణా జూనియర్ & డిగ్రీ కళాశాల, అల్లూరు, నెల్లూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

చిరునామా : ఫ్లాట్ నెం. 30, 3వ అడ్డరోడ్డు, 1వ వీధి, కె.ఆర్.ఆర్. నగర్, పడుగుపాడు, కోవూరు, నెల్లూరు జిల్లా – 524 137, సెల్ : 9966236604



నెల్లూరు విఆర్ సి సెంటర్ లోని సత్యసాయి మందిరంలో
అష్టావధానం నిర్వహిస్తున్న కోట రాజశేఖర్



రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డ్ అందుకొంటున్న

శ్రీ కోట రాజశేఖర్ (05-09-2013)



ఆత్మీయ బంధువులు




నెల్లూరు పురమందిరంలో పద్యకళా పరిషత్ వారిచే నిర్వహింపబడిన కవి

పండిత సత్కారాలలో భాగంగా అవధాని శ్రీ కోట రాజశేఖర్ గారికి సన్మానం

లేగుంటపాడులో ఫిబ్రవరి 2017 లో 10 రోజుల పాటు జరిగిన వాల్మీకి రామాయణ ప్రవచనముల సందర్భంగా అవధాని కోట రాజశేఖర్ గారికి జరిగిన ఘన సన్మానం.






డా. చీమకుర్తి వేంకటేశ్వర రావు గారు, శ్రీ కంది శంకరయ్య గారు, శ్రీ కోట రాజశేఖర్ గారు, శ్రీ యల్లంరాజు దుర్గాప్రసాద రావు గారు



కోట రాజశేఖర్ గారి పెద్దకుమారుడు చి॥ **రూపానంద కుమార్**, కోడలు సౌ॥ **ప్రియదర్శిని**
మనుమడు చి॥ **శివాంశ్**



కోట రాజశేఖర్ గారి చిన్నకుమారుడు చి॥ **సారంగపాణి**, కోడలు సౌ॥ **సౌమ్య**
మనుమరాలు చి॥ **దార్విశ్రీ**, మనుమడు చి॥ **రిషిక్**

# స్వీయ పరిచయము



| | |
|---|---|
| నామధేయము | : కోట రాజశేఖర్ |
| తల్లి | : కీ॥శే॥ కోట సక్కుబాయమ్మ |
| తండ్రి | : కీ॥శే॥ కోట సారంగపాణి |
| జన్మస్థలము | : అల్లూరు, నెల్లూరు జిల్లా |
| ప్రాథమిక విద్య | : సుబ్బయ్య బడి, రామకృష్ణా జూనియర్ కళాశాల, అల్లూరు |
| సంస్కృత ఎంట్రన్స్ | : వేద సంస్కృత కళాశాల, నెల్లూరు |
| 2ఏ, విద్వాన్ | : శ్రీ మళయాళ స్వామి ఓరియంటల్ కళాశాల, ప్రొద్దుటూరు |
| యం.ఏ. (సంస్కృతము) | : ఆంధ్రా యూనివర్సిటీ, విశాఖపట్టణం |
| సహధర్మచారిణి | : విద్వాన్ కోట గిరిజాకుమారి |
| జ్యేష్ఠ పుత్రుడు | : కోట రూపానంద కుమార్, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్<br>క్యాలిఫోర్నియా, యు.యస్.ఏ |
| కనిష్ఠ పుత్రుడు | : కోట సారంగపాణి, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్, టెక్సాస్, యు.ఎస్.ఏ |
| వృత్తి | : తెలుగు పండిట్, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, నెల్లూరు<br>సంస్కృత ఉపన్యాసకులు, రామకృష్ణా జూనియర్ కళాశాల, అల్లూరు |
| ప్రవృత్తి | : పద్యరచన, అష్టావధానములు చేయుట<br>టి.టి.డి పక్షాన ధార్మిక ఉపన్యాసములు |
| ఆస్థాన పండితులు | : "మారుతీ" ఆశ్రమము, అల్లూరు |
| అధ్యక్షులు | : "సంస్కృత భారతీ" నెల్లూరు జిల్లా |
| పురస్కారము | : రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారము (2013) |
| బిరుదము | : "అవధాని శేఖర" కళాదీప్తి నెల్లూరు వారిచే (2017) |